# సబ్బులన్నియు శుభ్రపరచును కాని...

ద్విగుణ చర్యగల
సింథాల్ సబ్బు
క్రిమినిరోధకం
మరియు శరీర
దుర్గంధ
నిర్మూలనం
కూడ!

## ... నిష్కళంకమైన చర్మసౌందర్యం నిమిత్తం
# జి-11తో గూడియున్న సింథాల్
## మీకు కావలెను.

సింథాల్ యందు గల జి-11 (హెక్సాక్లోరోఫీన్) చర్మ పొడలను గలిగించే హానికరమైన క్రిములను చంపుతుంది. ఆహ్లాదకరంగా పరిమళమొనర్చబడినటువంటి జి-11 తోగూడియున్న సింథాల్ మీ చర్మమును మృదువుగాను, ప్రకాశమానంగాను వుంచుతుంది.




INTERPUB GCS 9A-TEL

దినదినానికీ...

సుందరం... అధిక సుందరం... అధికాధికసుందరం



కేడిల్ గల రెక్సోనా చమత్కారం

స్నానానంతరం సహితం
ఒళ్ళంతా సువాసనగా వుంచే
సమృద్ధిమైన మనోహరమగు
పరిమళం రెక్సోనాలో గలదు.




రెక్సోనాలో మాత్రమే
గలదు కేడిల్-
4 సౌందర్యకారియైన
నూనెల మిశ్రమం

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

లింటాస్. RX. 33-140 TEL

## 18 క్లూలకు తెలుగు అనువాదం

1. వనిత, సంతుష్టిపరచుట తన విద్యుక్త ధర్మం అనే ముఖ్యాంశాన్ని మరచి అధికారాన్ని చలాయింప నారంభించగానే తన భర్తయొక్క అనురాగాన్ని/శ్రద్ధాబాధ్యతను కోల్పోవును

2 కళాకారుడు/వైజ్ఞానికుడు కేవలం శారీరిక సౌఖ్యంగాని భవుతిక సౌభాగ్యాన్ని ఆశించినచో తన కృతియందు ఎప్పటికీ ఆనందాన్ని పొందజాలడు

3 సంస్కృతులు కేవలం సృజనాత్మకం / గ్రహణశీలం అయినవై ఏమైనా కొత్త భవుతిక, సామాజిక లేక ఆధ్యాత్మిక పరిస్థితులకు సమాధానమివ్వదగినవైతేనే వర్ధిల్ల గలవు

4 రాజనీతి, అర్థశాస్త్ర మరియు సాంస్కృతిక/శైక్షణిక క్రియాకలాపాలందు సహితం సదా పెంపిందుచున్న కేంద్రీకరణ మొనర్ప నుద్దేశించే ప్రబల శక్తులు గలవు

5 మనము ఆశించే భవిష్యత్తును సృష్టించుటలో సఫలత కర్తవ్య / ఐక్యతా భావన మరియు మనలను ప్రేరేపించే లేక పురికొల్పగల భావముపై నాధారపడి యున్నది

6. మనం అహంభావులం / నీతిమంతులం అందరమూను

7 అనువాదములు ఎంత యుక్తమైనవయినా, సామాన్యంగా మూల కావ్యాత్మక ప్రభకు / స్వాదుకు తప్పిపోవుచున్నవి

8 నిజమైన మిత్రత/రాజనీతిజ్ఞత రాజకీయ సంబంధములను లెక్కగొనదు

9 ఈ తాప—అణవిక యుగంలో మానవత / బుద్ధిస్థిరత నిలిపే నిమిత్తం శాంతి అవసరం

10 అత్యౌన్నత్యదశ ఒక విచిత్ర స్థానం అచట బహుకాలం నిలచుట దుర్లభం పతనం సామాన్యంగా, సాపేక్షంగా సర్వదా అంతర్నిహితం/సన్నిహితం

11 న్యాయం/దైవం క్రూరం కాదు అది కష్టం, ఆనందం యొక్క సామాన్య హద్దులను అధిగమించినట్టిది

12 అపరాధి తన దుష్ట కృత్యముల ఫలితాన్ని అనుభవిస్తున్నాడు అని భావించుటలో మానసిక / సామాజిక సంతుష్టి గలదు

13 అంతులేని భయంతో కంపించే మరియు నిర్మూలింపరాని ద్వేషభావంలో మునిగిపోయే మానవుడు గర్వింపయోగ్యుడు కాడు/ఇంకనైనాకాడు

14 పరస్పర విరోధ ఆకాంక్షా అధీనంలోవున్నప్పటికీ మనకు మధురజీవన సృష్టికి సరస్/నిగ్రహి గుణం సమకూర్చబడింది

15 నిజంగా, నవ యువ్వనుడు పారంపర్యా, దుస్సాహసి / చంచలంగా వుంటాడు

16 విజ్ఞానం సర్వదా (సత్య) ప్రకాశకం / క్రాంతికారం

17 పిల్లలు ప్రపంచంలో అందరికంటె ఎక్కువగా నిర్దయులు / అవివేకులు, వారి భావముల గురించి చింతతో మీ మనస్సులు బాధపడుతూ వుంటే, వారు మిమ్మలను మరచిపోయి వినోదంగా ప్రవర్తిస్తున్నారు

18 శక్తి / సత్యంవల్ల శాంతి ప్రసరించవలెను

## No. 34: 18 CLUES

1 As soon as a woman forgets that it is her function to please, and begins to rule, she has lost claim on the Affect ons/Attentions of her husband

2 The Art st / Scientist can never derive any real pleasure in his work by sheer antic pation of phys cal comfort or material well be ng

3 Cultures are alive only when they are Creative Receptive, and respond to some new challenge, phy ical, social or spiritual

There are powerful forces tending towards ever increasing centralisation in politics, economics and even Cu tural / Educational activities

5 Our success in shaping the future we seek depends upon the sense of Duty / Unity and the spirit of ded cation that move us or can be evoked in us

6 We are Egoists / Moralists, one and all

7 Translations, however adequate, generally miss the poetic Fire / Flavour of the original

8. True Friendship / Statesmanship ignores political ffiliations

9 Peace is essential for the preservation of Humanity / Sanity in this thermo-nuclear age

10 The summit is a strange point It is rather defficult to remain there too long The fall, generally and relatively, is always In manent / Imminent

11 Justice / Providence is not cruel- it is above the ordinary limits of pain and plesure

12 There seems to be a Mental / Social satisfaction in feeling that the criminal suffers for his deeds

13 Man shaking with fathom ess fears and consumed by ineradicable hatred is Not / Yet a product to be proud of

14 Placed under the sway of conflicting urges we are yet given Poetic / Stoic quality of composing a harmonious life

15 True youth has been traditionally somewhat Reckless / Restless

16 cience is always Revealing / Revolutionary

17 Children are the most Ruthless / Thoughtless people in creetion While you're breaking your heart worrying about their feelings, they've forgotten about you and are having fun

18 Peace should flow of Strength / Truth

గమనిక పై క్లూలు భారతీయ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తోపాటు లిటిల్ క్విజ్ వీక్లీలో ప్రచురించబడును

# ఉత్తరాలు

### కథలు

నేను ఎప్పుడు కాని కథలు చదువను కాని ప్రతి వారం సచిత్రవారపత్రికను తిరుగవేయటం అలవాటు అలాగే 10—5—68 నాటి వారపత్రిక తిరగవెయ్యడంతో "గురుద్యోగపర్వం" కథను లేళ్లపల్లి వెంకటలక్ష్మీనారాయణ గారిచే రచించబడినది. గమనించడం చదవడం అన్నీ జరిగిపోయాయి అంతే తరువాత వారపత్రిక కోసం ఎదురు చూశాను. ఈ దినమే వచ్చింది చదివాను ఎంతో ఆనందాన్నిపొందాను. మీ పత్రిక ద్వారా రచయితకు నా హృదయపూర్వక ధన్యవాదలు

ఎస్ వి ముద్దుకృష్ణ (అనంతపురం).

*　*　*

మీ పత్రికలో ప్రచురింపబడిన 'X పరిమెంటు' చదివాము ఆ ఎక్స్‌పరిమెంటు మాకు చాలానచ్చింది. అత్యద్భుతంగా ఉన్నది చివరి 'ట్విస్ట్' చదివి మూర్ఛపోయాము దాన్ని వ్రాసిన 'ఆకాశరాజు' గారికి మాహృదయపూర్వక ధన్యవాదములు, ఇది చదివిన తర్వాతయినా మన మాతృభాషను ఎంత వికృతంగా చెయ్యాలని కొందరు ప్రబుద్ధులు తలుస్తున్నారో మన వాళ్ళందరికీ తెలిసి వచ్చివుండాలి దాన్ని ప్రచురించిన మీకు మా 'కృతఘ్నతలు' 'కృతజ్ఞలు' తప్పు వ్రాసివుంటే క్షమించ వలసినది

ఇట్లు

జ్యోతిర్మయి, ప్రమీలాదేవి, కృష్ణకుమారి (హయిద్రాబాదు—36)

*　*　*

తే 17—5—68 పత్రికలో ప్రచురించిన "ఎక్స్–(X) పరిమెన్టు" కథ చాల బాగున్ది. హిన్దూ స్త్రీ ఒక్కరినే వరిస్తున్దనుటకు యిది ఒక చక్కని ఉదాహరణ. 'ఆకాశరాజు'గారు అభినన్దనీయులు

అయిలవరపు వెంకట శ్రీనివాసరావు,(హైదరాబాదు).

### సీరియల్

"హృదయం చిగిర్చింది" సీరియల్ మొదటి నుండి చాలా అందంగా, ఆకర్షణీయంగా, రసవత్తరంగా ఉండి పాఠకులను వారం వారం ఉత్తేజపరుస్తున్నది ఇందులో రచయిత్రి "రామారావు" పాత్రను చాలా ఆదర్శవంతంగా, ఉదాత్తంగా చిత్రీకరించారు 'రమ' పాత్ర అందరినీ ఆకర్షిస్తుంది. ఇంతవరకూ జరిగిన సీరియల్ చాలా బాగుంది.

పి విశ్వనాథరెడ్డి, (హైదరాబాదు)

*　*　*

నేటి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ధారా ప్రవాహంగ ప్రచురిత మవుతున్న శ్రీమతి రామలక్ష్మి గారి "హృదయం చిగిర్చింది" అనే సీరియల్ కథ వారం వారం చదవ కుతూహలం కలిగిస్తూ, వాస్తవ జీవితానికి దగ్గరగా వుంటూ, పాఠకులు ఎన్ని సార్లు చదివినా తనివితీరనంతగా నడుస్తున్నది. రమ, రామారావు పాత్రలు చాలా చక్కగా వున్నవి.

కుమారి దూపాటి అలివేలు, (శ్రీకాకుళం)

## 14 భాషలు 100 ఏజెంట్లు 160 పత్రికలలో ప్రకటనలు

### 3 PRIZES AND A KLEERTONE IRON




ఆఖరు ముగింపు తేది 5—6—68.
సొల్యూషన్ ఆంధ్రపత్రిక 9–6–68
ఫలితాలు భారత్ జ్యోతిలో 10-6-68

* సొల్యూషన్ వెంటనే పొందుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసుగల కార్డును వెంటనే పంపవలెను • లిట్‌క్విజ్ వీక్లీ 10 సంచికలకు రు 2/- పంపవలెను.

---

**లిట్ క్విజ్ నెం. 34 అధికార ఎంట్రి ఫారము**

**ఆఖరు ముగింపు తేదీ 5-6-68 బుధవారం**

**ADDRESS LITQUIZ No 34, ALANKAR, BALARAM STREET, BOMBAY-7 (W B)**

గమనిక (1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి (2) ఒక కూపన్‌మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి (3) ఎంట్రీరుసుము M O ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన M O రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను M O రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. (4) I P O క్రాస్ చేయవద్దు అది లిట్‌క్విజ్ నెం 34, బొంబాయి-7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| 1 | | Re 1 | 2 | | Re 1 |
|---|---|---|---|---|---|
| 1 | AFFECTIONS | ATTENTIONS | 1 | AFFECTIONS | ATTENTIONS |
| 2 | ARTIST | SCIENTIST | 2 | ARTIST | SCIENTIST |
| 3 | CREATIVE | RECEPTIVE | 3 | CREATIVE | RECEPTIVE |
| 4 | CULTURAL | EDUCATIONAL | 4 | CULTURAL | EDUCATIONAL |
| 5 | DUTY | UNITY | 5 | DUTY | UNITY |
| 6 | EGOISTS | MORALISTS | 6 | EGOISTS | MORALISTS |
| 7 | FIRE | FLAVOUR | 7 | FIRE | FLAVOUR |
| 8 | FRIENDSHIP | STATESMANSHIP | 8 | FRIENDSHIP | STATESMANSHIP |
| 9 | HUMANITY | SANITY | 9 | HUMANITY | SAN TY |
| 10 | IMMANENT | IM' INENT | 10 | IMMANENT | IMMINENT |
| 11 | JUSTICE | PROVIDENCE | 11 | JUSTICE | PROVIDENCE |
| 12 | MENTAL | SOCIAL | 12 | MENTAL | SOCIAL |
| 13 | NOT | YET | 13 | NOT | YET |
| 14 | POETIC | STOIC | 14 | POETIC | STOIC |
| 15 | RECKLESS | RESTLESS | 15 | RECKLESS | RESTLESS |
| 16 | REVEALING | REVOLUTIONARY | 16 | REVEALING | REVOLUTIONARY |
| 17 | RUTHLESS | THOUGHTLESS | 17 | RUTHLESS | THOUGHTLESS |
| 18 | STRENGTH | TRUTH | 18 | STRENGTH | TRUTH |

| 3 | | Re 1 | 4 | | Re 1 |
|---|---|---|---|---|---|
| 1 | AFFECTIONS | ATTENTIONS | 1 | AFFECTIONS | ATTENTIONS |
| 2 | ARTIST | SCIENTIST | 2 | ARTIST | SCIENTIST |
| 3 | CREATIVE | RECEPTIVE | 3 | CREATIVE | RECEPTIVE |
| 4 | CULTURAL | EDUCATIONAL | 4 | CULTURAL | EDUCATIONAL |
| 5 | DUTY | UNITY | 5 | DUTY | UNITY |
| 6 | EGOISTS | MORALISTS | 6 | EGOISTS | MORALISTS |
| 7 | FIRE | FLAVOUR | 7 | FIRE | FLAVOUR |
| 8 | FRIENDSHIP | STATESMANSHIP | 8 | FRIENDSHIP | STATESMANSHIP |
| 9 | HUMANITY | SANITY | 9 | HUMANITY | SANITY |
| 10 | IMMANENT | IMMINENT | 10 | IMMANENT | IMMINENT |
| 11 | JUSTICE | PROVIDENCE | 11 | JUSTICE | PROVIDENCE |
| 12 | MENTAL | SOCIAL | 12 | MENTAL | SOCIAL |
| 13 | NOT | YET | 13 | NOT | YET |
| 14 | POETIC | STOIC | 14 | POETIC | STOIC |
| 15 | RECKLESS | RESTLESS | 15 | RECKLESS | RESTLESS |
| 16 | REVEALING | REVOLUTIONARY | 16 | REVEALING | REVO.UTIONARY |
| 17 | RUTHLESS | THOUGHTLESS | 17 | RUTHLESS | THOUGHTLESS |
| 18 | STRENGTH | TRUTH | 18 | STRENGTH | TRUTH |

SEND FIRST TWO COUPONS & ENTER MINIQUIZ (A) FREE — No 34 — SEND FOUR COUPONS & ENTER BOTH MINIQUIZ (A & B) FREE

**MiniQuiZ (A)** — 6 CLUES FREE COUPON

| | |
|---|---|
| AFFECTIONS | ATTENTIONS |
| ARTIST | SCIENTIST |
| CREATIVE | RECEPTIVE |
| CULTURAL | EDUCATIONAL |
| DUTY | UNITY |
| EGOISTS | MORALISTS |

**MiniQuiZ (B)** — 12 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| FIRE | FLAVOUR | NOT | YET |
| FRIENDSHIP | STATESMANSHIP | POETIC | STOIC |
| HUMANITY | SANITY | RECKLESS | RESTLESS |
| IMMANENT | IMMINENT | REVEALING | REVOLUTIONARY |
| JUSTICE | PROVIDENCE | RUTHLESS | THOUGHTLESS |
| MENTAL | SOCIAL | STRENGTH | TRUTH |

**34 (ASVP)**

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరు గారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులు) ఫీజు రు 4/- M O రసీదు/I P O/లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను వాటి నెం ........

CAPITAL LETTERS

NAME ..............................................

ADDRESS ..............................................

..............................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను



(1) నెం 32 లో ఆల్ కరెక్ట్ 4 గురు — ఒక్కొక్కరు రు. 4375 మరియు మినిక్విజ్ బి 30 ఆల్ కరెక్ట్ — ఒక్కొక్కరు ఒక్క మర్ఫీ ట్రాన్‌సిస్టర్ పొందిరి.

(2) లిట్‌క్విజ్ నెం. 34 తో మా రెండవ యేడాది ముగింపు అగును. నెం. 35 మూడవ యేడాదికి స్వాగతం పలుకుతుంది.

## ముఖచిత్రం

17—5—68 సంచికలో "ఎన్ టి రామా రావుగారు" ముఖ చిత్రము ఎంతో బాగుందో చెప్పేదా! అబ్బ . మరి చెప్పలేము అంత బాగుంది "హృదయం చిగిర్చింది", "చీకటి కడుపున కాంతి" సీరియల్స్ చాలా . చాలా బాగున్నాయి "ముగ్గురు మూరు లు" కథ చాలా బాగుంది "పరిక్షలకి ముందు" "జయదేవ్" గారు వేసిన కార్టూన్‌లు నవ్వురాకపోయిన వారి కైనా నవ్వు రావల్సిందే!

ఎన్ ఎం వి భాస్కరరెడ్డి, (ఇఛ్ఛాపురం)

* * *

"పద్మ శ్రీ ఎన్ టి రామారావు" ముఖచిత్రం ఎంతో ఆకర్షణీయంగా ఉంది 'హృదయం చిగిర్చింది, 'చీకటికడుపున కాంతి' సీరియల్స్ బాగున్నవి కధలు కార్టూన్సు కూడా చాల సంతోషాన్ని కలిగిస్తున్నాయంటే నమ్మండి

హెచ్ రజినీకాంతారావు, (సికిందరాబాదు)

## నాలుగవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభ

నాలుగవ అఖిల భారత తెలుగు రచయితల మహాసభ హైదరాబాద్‌లో 1968 మే 31, జూన్1,2వ తేదీలలో జరుగుతుంది రవీంద్ర భారతిలో మే 31వ తేదీ సాయంత్రం మహాసభ ప్రారంభ మవుతుంది తరువాత సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతాయి ఇతర కార్యక్రమాలు జూన్1,2వ తేదీలలో బొగ్గుల కుంటలోని ఆంధ్రసారస్వతపరిషత్తు హాలులో జరుగుతాయి వివిధ రాష్ట్రాల నుంచీ, విదేశాలనుంచీ, 600 మందికి పైగా

## ఉత్తరాలు

ప్రతినిధులు హాజరవుతున్నారు కొంతమంది విదేశ ప్రతినిధులు కూడా సభలో పాల్గొన నున్నారు ఈసందర్భంలో ఒక ప్రత్యేక సంచికను విడుదల చేస్తున్నారు పుస్తక, చిత్రకళా ప్రదర్శనను కూడా యేర్పాటు చేస్తున్నారు

మహాసభ సాహిత్య గోష్ఠులలో చర్చించబడే కొన్ని ముఖ్య అంశాలు ఇవి—

1 తెలుగుభాష నేటి సమస్యలు అవసరాలు
2 తెలుగులో సాహిత్య విమర్శ దానిస్వరూప స్వభావాలు
3 నారచనల్లో నూత్న రీతులు
4 ప్రాచీన సాహిత్యంలో శాశ్వత విలువలుగల గ్రంధములు వున్నట్లు ఆధునిక సాహిత్యంలో వున్నవా? ఇవిగాక బహుభాషా కవిసమ్మేళనం, భారతీయ భాషలను గురించి గోష్ఠి కూడా జరుగుతాయి

ప్రతినిధులుగా చేరడానికి గడువును 1968 మే 25 వ తేదీవరకు పొడిగించారు ప్రతినిధి ఫారములనూ, పూర్తి వివరాలనూ దిగువ కార్యాలయాలనుండి పొందవచ్చును —
ఇంటి నెం 208—న్యూబోయిగూడ
సికింద్రాబాదు, ఫోను నెం 73477.
ఆంధ్రరచయితల సహకార సంఘపుస్తకశాల
నారాయణగూడ (వై ఎం సి ఏ ఎదురుగా)
ఫోను నెం 52158
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనం, బొగ్గులకుంట
హైదరాబాదు ఫోను నెం 42762

పోతుకూచి సాంబశివరావు,
ప్రధాన కార్యదర్శి




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 31—5—'68
కీలకనామ సం॥ జ్యేష్ఠ మాసం శుద్ధ చ తి
సంపుటము . 60 సంచిక . 38

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
1, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26 00 |
| 6 మాసముల చందా | 13 00 |
| 3 మాసముల చందా | 6 50 |


విషయానుక్రమణిక

రోజులు మారాయి

మునిసిపల్ ఎన్నికలలో కాంగ్రెసు విజయం

రాజస్థాన్ ఉప ఎన్నికలలో

కాంగ్రెసు

స్వతంత్ర

హర్యానాలో

హర్యానా కాంగ్రెసు విజయం

పార్టీ మార్పిడి దార్లు






శ్రీకృష్ణ

# ఆందోళనల వెనక అసలు రహస్యం?

'మెక్కాలో విగ్రహారాధన మొదలుపెడితే ఇస్లాం మతం గతి ఏమిటి?' అని పరిష్యా సామెత ఒకటుంది. మనదేశంలో శాంతిభద్రతల పరిస్థితికి ఈ సామెత బాగా కుదురుతుంది. మంత్రులు చట్టవిరుద్ధమైన కార్యకలాపాలకు దిగినప్పుడు, ఉపప్రధానిగారు మద్యనిషేధంపై సత్యాగ్రహాలు చేయాలని ప్రజలకు ఉద్బోధిస్తున్నప్పుడు అంత కంటె ఏం మేలు చేకూరుతుంది?

మొరార్జిదేశాయ్‌గారిని—ఆయన ఆర్థికమంత్రిగా వున్నప్పటి నుంచి పట్టిచూస్తే— శాంతి భద్రతల విషయం కంటె, ఆర్థిక పరిస్థితిని చక్క జేయడం కంటె, మద్యనిషేధం మీదనే ఆయన ఎక్కువ మోజు కనపరుస్తూ వచ్చారు.

మహారాష్ట్ర, రాజస్థాన్, మైసూరులలో కాంగ్రెసు ప్రభుత్వమే మద్యనిషేధం మీద కొన్ని ఆంక్షల్ని తొలగించింది! అఖిలభారత కాంగ్రెసు కమిటీలో మొరార్జీ గారికి ఎక్కువ పరపతి వుంది. మరి, ఈ కాంగ్రెసు ప్రభుత్వాలు మద్యనిషేధం సూత్రాలని సడలిస్తున్నప్పుడు మన మొరార్జి భాయ్ ఏం చేస్తున్నట్టు ?

**లక్షమంది వలంటీర్లు :**

ఈ డిసెంబరు నెలాఖరుకు గోవధ నిషేధాన్ని అమలుపరచకపోతే, లక్ష వలంటీర్లతో ఒక పెద్ద ఆందోళన జరుగుతుంది చూస్కోండి! అని భయపెడుతున్నారు పూరీ శంకరాచార్యులవారు. ఈ 'గోసత్యాగ్రహాలు' ఢిల్లీలోనే ఎందుకు జరుగుతున్నాయో తెలియనివాళ్లకి జనసంఘం తప్పక సమాధానం చెబుతుంది! నిరుద్యోగులు దినదినాభివృద్ధి నొందుతున్న మనదేశంలో లక్షమంది వలంటీర్లను (ఎలాంటి పనికయినా సరే!) పోగు చేయడం కష్టతరంకాదు.

శంకరాచార్యులవారు, సేట్ గోవింద్‌దాసుగారు లేవదీసిన ఈ ఉద్యమం ప్రజాస్వామ్య మనేదాన్ని కూకటివేళ్లతో తుంచి వేస్తుందనడంలో సందేహం లేదు. ఈ సమస్యనంతా ఒక కమిటీకి అప్పగించారు. అందులో శంకరాచార్యులవారు కూడా ఒక సభ్యుడు. ఈ సభ్యులవారు గోవధ నిషేధాన్ని అమలుపరిస్తేనే గాని కమిటీ పని పూర్తయినట్టు ఒప్పుకుంటారా? ఎప్పటికీ కాదు.

శంకరాచార్యులు, సేట్ గోవిందదాస్, జనసంఘం, తినమరిగిన సాధువులు— వీరంతా క్రితం బీహారు క్షామ పరిస్థితుల నెదుర్కొనడానికి ఎలాంటి చేయూతనిచ్చారూ? అని ప్రజలు ప్రశ్నించడానికి అవకాశం లేకపోలేదు. గోవుల్ని దయతో చూడగల్గిన వారు మానవమాత్రుల బాధ నెందుకు అర్థం చేసుకోలేకపోయారు?

పోనీ, 1947 నుంచి గోమాత సంరక్షణార్థం— శంకరాచార్యులవారి సంచులలో ధనాన్ని ఎంతవరకు వినియోగించారు? కలకత్తా, ఢిల్లీ వీధుల్లో గోవుల్ని ఎలా నిర్దాక్షిణ్యంగా గాలికి వదిలేస్తున్నారో ఎవరూ చూడలేదా? గోమాత పాలని ఆఖరి బొట్టు వరకు పిండడానికి కలకత్తాలో 'ఫుక్కా' విధానం అవలంబిస్తున్నారే! ఈ హింస కలకత్తాకి సమీపంలో వుంటున్నా కూడా శంకరాచార్యులవారి చెవినపడలేదా?

**ఆర్యుల పవిత్ర జంతువు గుర్రము :**

శంకరాచార్యులవారి బెదిరింపు మనల్ని వేదయుగానికి తీసుకు వెళ్లకమానదు. బాబూ జగజీవన రాన్‌గారు మన ఆహారమంత్రి. ఆయన ఈ విషయంలో వివిధ అభిప్రాయాలున్నాయని సెలవిస్తూ, వేదకాలంలో ఆర్యులు ఎద్దు మాంసం తినేవారు అని ఉదహరించారు. వేదశాస్త్రానుసారంగా— భూమి చదునుగా వున్నది, అశ్వరథం మీద సూర్యుడు ప్రయాణం చేస్తాడు. మన ఆధునిక విజ్ఞానశాస్త్రం మరొక విధంగా చెబుతుంది. అది హైందవ నమ్మకాన్ని గొడ్డలితో నరుకుతుంది. ఆర్యులు మధ్య ఆశియా నుంచి తరలి వచ్చారని, వారి పవిత్ర జంతువు ఆవుకాదు గాని 'గుర్రము' అని ఇటీవల శాస్త్రకారులు చెబుతున్నారు!

ఉత్తరహిందూస్థానంలో మర్రిచెట్టు చాలా పవిత్రమైంది. దానిని నరికితే ఒక సద్బ్రాహ్మణుడ్ని హత్య చేసినంత పాపం! ఈ విధమైన మూఢ విశ్వాసం ఎందుకు ప్రబలింది? వటవృక్షం చల్లని నీడ సేదదీర్చేదిగా వుంటుందీ అని. ఆర్యులు మన దేశానికి వస్తూ అడవుల్ని అటునుంచి నరుక్కుంటూ వచ్చారు. ఎందుకు? వాళ్లు బ్రతకడానికి తిన తిండి, వుండ నివాసము కావాలి గనక. కొన్ని చెట్ల ఉపయోగాలని కనిపెట్టి ఒకరకమైన విశ్వాసాన్ని ప్రబల చేశారు. ఇది 1968 సంవత్సరం మనుషుల్లో జీర్ణించుకుపోయి వుంది. హైందవుడు ఆ మర్రిచెట్టు మూలంగా తన కొంప కూలిపోతున్నా ఒప్పుకుంటాడు గాని, దానిని ముట్టుకోడానికయినా సాహసించడు!

ఇదే గోవు రూపకమైన కథ కూడా! 'అత్రి బ్రాహ్మణ' మనే ఒక హైందవ గ్రంథమున్నది. గోవధకి సంబంధించిన ఉత్సవం అందులో ఇవ్వబడింది! ఈ ఉద్గ్రంథంలో కులమతాల ప్రసక్తి వుంది కనుక మనువు కాలంలో అది రాయబడి వుండాలి. మర్రిచెట్టు కథలాగే ఈ గోవధని, దృష్టిలో వుంచుకుని, గోజాతి సమస్తమూ ఇలా నాశనమైపోతే పాలకి ముఖం వాయాలని 'గోమాత' పూజనీయము అన్నారు. ఈ విశ్వాసాలు ఒకవిధంగా ఆర్థిక పరిస్థితికి ముడి వేయబడ్డాయన్నా తప్పు లేదు. ఆవు, మర్రిచెట్టు— ఇవి చేసే సేవ అనంతం.

వాటిని మతంతో రుద్ది సంరక్షించడం జరుగుతున్నది!

ఆర్యులు గోమాంసం తినేవారా లేదా? అనే వాగ్వాదం ఇప్పుడు శుద్ధ అనవసరం జరిగిందేదో జరిగిపోయింది

గోవధ నిషేధానికి సంబంధించిన కమిటీ నిష్పక్షపాతంగా వ్యవహరిస్తుందనడానికి వీలులేదు పోనీ, వ్యవహరించిందే అనుకుందాం అప్పుడు శంకరాచార్యుల వారు సేట్‌గోవిందదాసుల వారూ ఈ కమిటీలో మెజారిటీ తీర్మానాన్ని ఎదిరిస్తూ ఆందోళన జరిపి ప్రజాస్వామ్యానికి మచ్చ తీసుకురావడం న్యాయం ప్రతివ్యక్తికీ తినడానికి, త్రాగడానికి స్వతంత్రం ప్రసాదించిన రాజ్యాంగానికి కూడా ఇది విరుద్ధం ముసల్మానులు, షెడ్యూల్డుకులాలు, క్రయిస్తవులు మొదలైనవారు వారి స్వతంత్రాన్ని కాపాడుకోడానికి ఏదో కొంత చేయకమానరు హిందీ రుద్దడానికి ప్రయత్నించినప్పుడు ఎంత రభస జరిగిందో గోవధ నిషేధ ఫలితంగా అంతగానూ జరగడానికి అవకాశం వుంది

### ప్రస్తుత సమస్య ఏమిటి ?

మనదేశానికి అనేక సమస్యలున్నాయి ఆర్థికమైన ఇబ్బందులు, ఆకలి, కోరికలు, నిరుద్యోగం ప్రజల్ని దహించి వేస్తున్నాయి ఈ సమయంలో వారి బాధని మరోవైపు కేంద్రీకరింప చేయాలని భాష, మద్యం, గోవు, మొదలైన సమస్యలు తెచ్చిపెడుతున్నారు మనదేశానికి కావలసింది శాంతిగాని, ఈ విధమైన ఆందోళనలు కాదు కూటికీ గుడ్డకీ లేని ఈ ఆందోళనల వల్ల సామాన్య ప్రజ చిత్రహింసలకు గురి అయిపోతున్నారు మనదేశం పురోగమించాలీ అంటే మనిషి మీగ మనిషి లేవదీసే ఈ ఆందోళనలకి స్వస్తి చెప్పాలి

దేశమంతటా గోవధ నిషేధాన్ని అమలువరిచే కంటె, గోసంరక్షణకై సహాయపడితే బాగుంటుంది దేవాలయాల్లో ధనాన్ని పాతిపెట్టే కన్నా— ఆ డబ్బుని దానికి సంబంధించిన మనుష్యుల్ని పెరిపించి పశువుల గ్రాసం కోసం కొన్ని పచ్చిక బయళ్లను ఏర్పరచవచ్చు గోమాతని దారుణహింస నుంచి కాపాడాలంటే అలాంటి పాలకుల నుంచి విడిపించి 'సాధుపుంగవులు' వాటికి సేవ చేస్తూ కొంత ముక్తిమార్గాన్ని ఏర్పరచుకోవచ్చు!

### గోవధనిషేధాందోళనలోని రహస్యం

గోవధని ఖండించకపోతే దేశంలో ఆవులు నానాటికి అదృశ్యమైపోతాయి అంటున్నారు కొందరు వ్యవసాయ అభివృద్ధికోసం ఇప్పుడిప్పుడు గేదెలు దున్నపోతులు విస్తృతంగా ఉపయోగించబడుతున్నాయి గేదెలు ఆవుల కంటే ఎక్కువ పాలు ఇస్తాయనే మాటని ఎవరూ కొట్టిపారేయలేరు శంకరాచార్యులవారు గోవధ నిషేధాన్ని అమలుపరచగలరేమోగాని, గేదెలా ఉపయోగపడని ఆవును భరించమని సేట్‌గోవిందదాసు గారిని ఇబ్బంది పెటలేరు ఈ నిషేధం అమలులో వున్న కారణంగానే తెగబలిసి క్రూరంగా వ్యవహరిస్తున్న ఉత్తరప్రదేశ్ ఆవుల్ని అడవులికి తోలేస్తున్నారు! ఆవిధంగా పంటల్ని కాపాడుకోవటం జరుగుతున్నది ఇది శంకరాచార్యుల వారికిగాని సేట్ గోవిందదాస్‌వారికిగాని తలపోటుకాదు!

వ్యక్తిగతమైన అభిప్రాయాలని, ఆశయాలని ఇష్టంలేని ప్రజల మీద రుద్ది ఎలాగో ఒకలాగ పేరు తెచ్చుకోవాలని చాలమంది ప్రముఖులు ప్రయత్నం చేస్తూ వున్నారు తదనుగుణంగా పని కాకపోతే—సత్యాగ్రహాలు, మూకుమ్మడి ఆందోళనల ద్వారా తమ నిరసనని తెలియపరుస్తూ ప్రజాజీవితాన్ని అల్లరి పెట్టడం జరుగుతున్నది ఇటువంటి పరిస్థితిని ఏర్పరచడానికి మద్యనిషేధ వాంఛాతత్పరులు, గోభక్తులు ప్రయత్నిస్తున్నారు

" ప్రజాస్వామ్య పద్ధతుల్లో నడిచే దేశంలో ఆందోళనలకి తిరుగుబాట్లకి చోటు వుండదు. " అంటూ 'డిఫెన్స్ ఆఫ్ టెర్రరిజమ్' అనే పుస్తకంలో ట్రాట్‌స్కీ రాశారు. అందులో ఒక తరహా ప్రజలు అధికారాన్ని పొందడానికి కొనసాగించే ఆందోళనలని సూచించారు ట్రాట్‌స్కీ ఆ పుస్తకం రాసిన తర్వాత రష్యాలో కూడా మార్పు వచ్చింది. ఇప్పుడు భారతదేశం ఒక ముఖ్యవిషయాన్ని ఆలోచించవలసి వుంది అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికి 'ఒక తెగ మనుషులు' గోవును సాధనంగా ఉపయోగించుకుంటున్నారనే విషయాన్ని పసిగట్టటం అవసరం ●

## మహీధరోక్తులు

మహీధర నళినీమోహన్‌రావు

భ్రమరి పొత్తుగూడి
పదివేలయేండ్లున్న
పురుగు తేటి రూపు పొందబోదు
సహజగుణము సాహ
చర్యమ్ము మార్చునా?
హృదయవర్తి యీ మహీధరోక్తి

యమునికంటె వైద్యుడధికుం
డుగా దోచ
యముడొనర్చు ప్రాణహరణ
మొకటె
వైద్యుడు హరియించు ప్రాణమ్ము
విత్తమ్ము
హృదయవర్తి యీ మహీధరోక్తి

ఇనుడు వెలుగ నీడ వెమ వెంటనే
యుండు
దుర్దినంబులందు తోడు రాదు
స్వార్థపరుల మైత్రి పొం
దిట్టులుండురా!
హృదయవర్తి యీ మహీధరోక్తి

భాగవతమునందు బహుశః బన్ప్రోస్త
శ్లేషమెందు వసు చరిత్రమందు
ప్రముఖ మతిశయోక్తి రైలువే
గైడులో
హృదయవర్తి యీ మహీధరోక్తి




చెలిని కౌగలించు చేతులతోడనే
కూతు కౌగలించుకొనడె నరుడు
చిత్తవృత్తి భిన్న చేసిన పనికన్న?
హృదయవర్తి యీ మహీధరోక్తి

# వాసవదత్త వివాహగాథ



ఉజ్జయిని వర్తకుడు చెప్పినట్లు చండమహాసేనుని ప్రతీహారుడు వత్సరాజు వద్దకు వచ్చాడు. ఆయనతో ఇలా విన్నవించాడు: 'దేవా, చండమహాసేనుల వారి ఆజ్ఞతో నేను దేవరవారి సన్నిధికి వచ్చాను—నా కుమారుడు గోపాలుడు మీ వివాహానికి తగినట్లుగా రత్నాలు, గుర్రాలు, ఏనుగులు మొదలయిన సంపదతో వస్తున్నాడు అని దేవరవారితో శ్రీ మహారాజులవారు మనవి చేయమన్నారు"

ప్రతీహారుని మాటలకు ఉదయనుడు చాల సంతోషించాడు. వాసవదత్త కూడ తన సోదరుని రాకకై దారికు చూడసాగింది.

ఉదయనుని సందేశం సేనాపతి రుమణ్వంతునికి అందింది. అతడు సముద్రం వంటి అపార సైన్యాన్ని సన్నద్ధం చేసుకొని ఉదయనుడున్న చోటికి వచ్చాడు. రాజు ఉదయనుడు రుమణ్వంతుని, ప్రేమతో ఆదరించి, అతడు సేనా సముద్రంతో తన వెంట రాగా కౌశాంబీ నగరానికి బయలుదేరాడు. కౌశాంబీనగరంలో ఉదయనుడు ప్రవేశిస్తున్నప్పుడు పురజనులు కుతూహలాయత్తచిత్తులై చూచారు.

ఉదయనుడు కౌశాంబీ నగరం చేరిన కొన్నాళ్లకే గోపాలకుడు వివాహ బహుమానాలతో వచ్చాడు. ఉదయన వాసవదత్తలకు సుముహూర్తంలో వివాహం జరిపించాడు. ఉదయనుడు వాసవదత్తతోపాటు వివాహమంగళ భూమిలో ప్రవేశించాడు. గణాల (ప్రజల) సంతోషానికి కారణమవుతూ, కుసుమాయుధుణ్ణి పునరుజ్జీవింప జేసిన వారి వివాహం ప్రమథ గణాలకు సంతోషం కలిగిస్తూ, మన్మథుని మరల బ్రతికించిన పార్వతీ పరమేశ్వరుల వివాహంలాగ జరిగింది. వాసవదత్త అగ్నికి ప్రదక్షిణం చేసినప్పుడు మెడలోని ముత్యాలదండలు ఊగులాడుతూ వింత శోభ కలిగించాయి. అప్పుడామె సుధా సముద్రం తరంగాల మధ్య నుంచి అప్పుడే పైకి వస్తున్న మహాలక్ష్మి వలె కనిపించింది. కర్పూరపు వెల్లువ విరజిమ్మిన తెల్లని దుకూలాలలో ఆమె పాలతో కడిగిన చంద్ర బింబపు నవ్వుల మొవ్వలాగ కనిపించింది. ఆ వివాహ భూమిని పడిన పూవులు, పేలాలు వాసవదత్త ముఖ చంద్రుని సేవించడానికి వచ్చిన నక్షత్రాలలాగ కనిపించాయి.

ఉద్వాహోత్సవం పూర్తయింది. ఉదయనుడు, మంత్రి యౌగంధరాయణుని, సేనాపతి రుమణ్వంతుని పిలిచి, వివాహానికి వచ్చిన వారందరికీ యథోచితంగా సత్కరించవలసిందని ఆజ్ఞాపించాడు. నానాదేశాల నుంచి రాజులు, ఇతరులు వచ్చారు. అందరినీ మెప్పించడం ఎట్లా అని యౌగంధరాయణునికి యోచన కలిగింది. రుమణ్వంతునితో ఇలా అన్నాడు "రాజు మనను చాల దుష్కరమైన కార్యంలో నియమించాడు. ఈ రాజు కల్యాణోత్సవంలో ప్రతివాడూ గర్వధనంతో బిర్రబిగుసుకుంటాడు. ఇలాటి జనాన్ని భోజన సమ్మానాలతో సుముఖులను చేసుకోడం ఎవరికి సాధ్యమవుతుంది? భోజన సమయంలో పిల్లవానికి కూడా, సరిగ్గా చూడకపోతే, కోపం వస్తుంది. పూర్వం ఒక బాలుడు కోపగించుకొని చేసిన అవమాన కథను ఒకదానిని వినిపిస్తాను. ఆ వినోదం విను.

"దేవసేన అనే అగ్రహారం ఉంది. దానిలో రుద్రశర్మ అనే బ్రాహ్మణుడున్నాడు. అతనికి వినష్టకుడు అనే కొడుకున్నాడు. వాడిని తల్లి పిడు

# క్షేమేంద్రుని బృహత్కథామంజరి కథలు

అనువాదం: తిరుమలరామచంద్ర

తల్లి చనిపోయింది వాడు శిశువుగావుండడంవల్ల తండ్రి వినష్టకుడు అని వాడికి పేరుపెట్టాడు వినష్టకుని పోషణ భారాన్ని రుద్రశర్మ తన రెండవ భార్యకు అప్పగించాడు ఆ సవతి తల్లికి అతనంటే ఆదరం లేదు అందువల్ల అతని ఒంటికి నూనె రాచేదికాదు, సరైన గుడ్డలు తొడిగేదికాదు మంచి భోజనం పెట్టేదికాదు అందువల్ల వాడు మరీ నీరసించి పోయాడు కాని సవతితల్లి తన కుమారుణ్ని బాగా చూచుకొనేది

"ఈ సంగతిని వినష్టకుడు గ్రహించాడు వాడికి పట్టరాని కోపం వచ్చింది సవతమ్మకు తగిన శాస్తి చేయాలనుకున్నాడు కుర్రవాడు చిన్నవాడైనా చాల తెలివిగలవాడు బాగా ఆలోచించాడు ఒకమారు తండ్రి తనను ఆడిస్తున్నప్పుడు 'నాన్న, నాకు మరొక నాన్న ఉన్నారు?' అని వచ్చీరాని జిలిబిలి పలుకులతో అన్నాడు తండ్రి అతని మాటలను మొదట అంతగా పట్టించుకోలేదు కాని, వినష్టకుడు పదేపదే ఆమాటే చెబుతూ వచ్చాడు అతని అవ్యక్తాక్షరాల ఆమాటలు తండ్రికి సందేహం కలిగించాయి ముఖం చిట్లించుకున్నాడు ఇలా చాలసార్లు విని భార్యను అవమానించడం ప్రారంభించాడు

"భార్యకు భర్త ప్రవర్తన అర్థంకాలేదు తన తప్పు ఏమీ లేకనే భర్త ఆగ్రహించాడు కారణం ఏమిటో? ఆమెకు ఏమీ తోచలేదు వినష్టకుడు తనపై కొండేలు చెప్పి ఉంటాడా?—అనే ఆలోచన కలిగింది ఆమెకు ఒకనాడు అతనిని ముద్దులాడుతూ చాల దుఃఖంతో 'నాన్న, నీవు నాకు నా కొడుకు కన్నా ఇష్టమయినవాడివి నా మీద ఏవైనా కొండేలు చెప్పి, తండ్రిగారికి కోపం వచ్చేట్లు చేశావా?' అని అడిగింది

"వినష్టకుడు సవతితల్లి దుఃఖం చూచాడు 'అమ్మ, నీవు నాకు సరిగ్గా అన్నం పెట్టడంలేదు అందువల్ల నాకు కోపం వచ్చింది నాన్నకు నీ మీద అయిష్టం కలిగేట్లు చేశాను' అన్నాడు

"దానికి ఆమె 'నాన్నా నీవు మళ్లీ ఎలాగయినా, తండ్రిగారి కోపం శాంతించేట్టు చేయి' అంటూ ప్రేమతో బుజ్జగించింది అతడు సరేనన్నాడు

'రుద్రశర్మ ఎప్పటిలాగే ఇంటికి వచ్చినప్పుడు వినష్టకుడిని ముద్దులాడుతూ, అతని తొక్కు పలుకులు వినసాగాడు కొంత సేపయిన తర్వాత వినష్టకుడు, అక్కడ గోడకు తగిలించిన అద్దం చూపి, "అదుగో, చూడు నాన్న మరొక నాన్న!" అని అన్నాడు "ఓహో ఇదా సంగతి!" అనుకున్నాడు రుద్రశర్మ

'కుర్రవాని మాటల అంతర్యం గ్రహించిన తర్వాత రుద్రశర్మ సందేహం తీరి, మనస్సు కుదుటపడింది భార్య ఎడల మునుపటిలాగే ప్రేమగా ప్రవర్తించ సాగినాడు. అందువల్ల భోజన సమయంలో మర్యాదగా చూడకపోతే, పిల్లవాడు కూడా మండిపడతాడు"

యౌగంధరాయణుడు ఈ విధంగా ఆలోచించి నానాదేశాల నుంచి వివాహోత్సవంలో పాల్గొన్న భూమిపాలులకు, పౌరులకు యథోచితంగా మర్యాదలు చేశాడు వివాహోత్సవం ముగిసిన తర్వాత తిరిగి రావలసిందని గోపాలునికి చండమహాసేనుడు మొదట్లోనే అనతి ఇచ్చాడు ఆ అనతి ప్రకారం గోపాలుడు వత్సభూపతి వద్ద, చెల్లెలు వాసవదత్త వద్ద సెలవు పుచ్చుకొని ఉజ్జయినికి వెళ్లిపోయాడు

ఉదయనుడునికి ఇప్పుడు ఏకాంతవాసం లభించింది వాసవదత్తా మాత్రసఖుడై విహరించాడు దేవివాసవదత్తలో కామమనే చెట్టు ఎప్పుడూ స్త్రీలోకానికి సహజమైన కడకంటి చూపులతో చిగురించి విలాసహాసాలతో విరగబూచింది

ఉదయనుడు వాసవదత్తను అప్పుడప్పుడు పొరపాటుతో ఏవేవో పేర్లతో పిలిచేవాడు అట్లా పిలిచినప్పుడెల్లా వాసవదత్త "చంద్రుడు రాత్రిళ్లే తిరిగే విధంగా ఈ రాజు కూడా రహస్యంగా రాత్రిళ్లు తిరుగుళ్లు మరిగాడు కాబోలు! లేకపోతే ఈ మారు పేర్లేమిటి? ఎవరు వీళ్లంతా?" అని కోపగించుకొనేది "దారసాని, రాజుగారికి ఇలాటి విషయాలలో సహాయం చేసేవాడు ఈ నర్మసఖుడు వసంతకుడే ఇతడు రాజుగారికి రెండవ శరీరం కామినీ చక్రాన్ని వేపుకొనితినే బర్బర చక్రవర్తి ఇతడు రాజుగారికి అనంగదూత" అని దాసీలు చెప్పారు వాసవదత్త వసంతకుడిని చేతులు కాళ్లు కట్టి ఒక గదిలో బంధించి వేసింది.

అప్పుడు ఉదయనుడు వాసవదత్త పుట్టినింటి నుంచి అరణంగా వచ్చిన సమర్థురాలైన ఒక తాపసిని ఆశ్రయించి, వాసవదత్త కోపం పోగొట్టవలసిందని అభ్యర్థించాడు ఆ తాపసి వినోదంగా ప్రేమతో, ప్రణయంతో తియ్యని మాటలు చెప్పి వాసవదత్త కోపం పోగొట్టింది మబ్బు తునక మరుగు నుంచి విడివడిన చంద్రుడు మళ్లీ తన కాంతిలక్ష్మిని పొంది ప్రకాశించేటట్టు వాసవదత్త ముఖం కోపం తొలగి, సందేహాల్ని సడలి, వెలుగొందింది తానే ప్రగాఢప్రేమతో ఉదయనుని, కౌగిలించుకొని, అతనికి ఆశ్చర్య సంభ్రమాలు కలిగించింది చిరునవ్వులతో తన కపోలాల అందం వెల్లివిరియగా, వసంతకుణ్ని బంధం నుంచి విముక్తుణ్ని చేసి, అతని కోపం కూడా పోగొట్టింది ఆమె ముఖకమలం చుట్టూ తిరిగే భృంగం వంటి రాజు ఆనందించాడు మన్మథుడు కోపానుగ్రహాలతో ముచ్చటగొల్పుతూ, ప్రీతి పెంచుతాడు

(ఇంకా ఉంది)



# ఆత్మహత్యకి దారితీసిన అశాంతి

తిరుపత్తూరుకు సమీపంలో వున్న కాటు వాయకనూర్ అనేచోట మల్లన్ అనే అతను మొన్న 13వ తేదీన పురిపోసుకు నిండు ప్రాణాలుతీసుకున్నాడట ఆత్మహత్యకు దారితీసినది అతని కుటుంబంలో అశాంతి అనితేలినా అసలు కారణం యింకా తెలియ లేదు

## ఇంట్లో అయిదు శవాలు

కాన్పూరులో ఒక యింట్లోంచి దుర్వాసనవచ్చే సరికి అనుమానంతో పోలీసులాయింటి తలుపు పగలకొటా రట లోపల అయిదు శవాలున్నాయట తల్లి, నలుగురు పిల్లలూనట. పోలీసు కధనం ప్రకారం 11, 12 తేదీలలో యీ దారుణం జరిగి వుండాలి కారణాలు యింకా బయటకు రానేలేదు

*　　　*　　　*

సిలిగురికి 10 మైళ్ళదూరంలో వున్న బాగ్‌దోగ్రా అనేచోట ఒక టీ యసేటు యజమానిని పనివారు కర్రలతోబాది (8వ తేదీన) చంపేశారట తమ కోర్కెలను ఆయన ముందు పెటా రట కానీ యజమాని మైదాస్‌దాస్ అగర్వాలా వాటిని నిరాకరించేసరికి ఆగ్రహంతో ఆయన్ను బయటికిలాగి, కర్రలతోబాది చంపేశారట.

*　　　*　　　*

మాజీ కాంగ్రెసు మంత్రి (తమిళనాడు) శ్రీభావ రావ స మామగారు శ్రీ రత్నవేలుగౌండరును అరెసు చేశారు ద్రవిడమున్నేట్ర కజగం (అనగా ద్రావిడులను వుద్ధరించుసంఘం అని అర్థంట ) పార్టీ ముఖ్యులలో ఒకరైన సేతురామన్ అనే ఆయన యింటికి నిప్పు అంటిస్తుండగా యీ రత్నవేలుగౌండరు పటుబడిపోయారట తక్కిన వివరాలింకా రాలేదు



## కుమార్తెని చంపిన తండ్రి

లండన్ నగరానికి కొంచెం దూరంలో సైకిల మీద పోతున్న వ్యక్తికి ఒక సంచి కనబడిందట. ఆగి, ఆసంచితీసి చూస్తే అందులో వున్నది ఒక స్త్రీ తలట! లండన్—వాల్‌వర్‌హేమ్స్ టవున్‌లమధ్య తిరిగే ఒక రైలులో దొరికిన తోలు పెటెలో ఒకస్త్రీ మొండెం దొరికిందట ఆతరువాత రెండురోజులకు ఒక సరస్సులో దొరికిన మరో తోలుపెటెలో రెండు కాళ్ళు దొరికాయట ఈ తల, మొండెం, కాళ్ళూ ఒక వ్యక్తివేనని తేల్చారు ఈస్త్రీపేరు 'సరబిత్‌కౌర్' వయస్సు 19 ఏళ్ళట పంజాబు సిక్కుస్త్రీట ఈమె. లండన్‌లో గత సెప్టెంబరులో స్థిరపడిందట. యఫ్ బి ఐ వారు యీ కేసుని తీవ్రంగా పరిశోధించి యీమె తండ్రే హంతకుడని నిర్ణయించి ఆ వహనీయుడ్ని అరెసు చేశారు

## అసభ్యకరమైన ప్రకటనలు-లోక్‌సభలో చర్చలు

ఇటీవల పేపర్లో వస్తున్న ప్రకటనలు చాలా ఏవకరంగా, అవినీతికరంగా వస్తున్నాయని లోక్‌సభలో సోదాహరణతో శ్రీ బారువా అనే ఆయన వివరించారట



''ఒక ఎడ్వర్‌టైజుమెంటులో స్త్రీ ఫోటోని చూశాను చీర కట్టుకుందా లేదా అన్నంత సన్నని చీర .కనీసం అసలు చీర కటు కోడం ఎందుకు అన్న



విషయంకూడా మర్చిపోయినట్లు ముఖ్యమైన ...

"మరీ దూరంగా పోవద్దు"అన్నారట స్పీకర్ శ్రీ సంజీవరెడ్డి

"  ఆబొమ్మ పక్కన 'ఒక్కసారి మునుగుము' అనేఅర్థం వచ్చేటట్లు యింగ్లీషులో వుందని బారువా అన్నారట

మరో రబ్బరు పరుపుల ఎడ్వర్టైజ్మెంటులో రబ్బరు పరుపుమీద బోరగిల్లా పడుకుని వున్న ఒక స్త్రీనివేసి, ముఖ్యమైన ఆమె ఎత్తు పల్లాలమీద "మీ సుఖంకోసం " అని వుందనీ— దానర్థం ఏమిటనీ ఆయనన్నారట

మనూభాయ్‌పటేల్ మాట్లాడుతూ, "ఎయిర్ యిండియా" ప్రకటనలో ఒకచోట పదమూడుమంది స్త్రీలనువేసి "వీళ్ళందరూ సిద్ధం మీకు నచ్చిన ఆమెను తీసుకుని ఛలోలండన్"అని (ఇంగ్లీషులో) రాసి వుందనీ యిలాంటి సభ్యతలేని ప్రకటనలు చాలా వుంటున్నాయనీ అన్నారట— మరి సినిమాలమాటేమిటి!

## పెళ్లిలో ప్రమాదం

పాట్నా జిల్లాకు చెందిన ముసార్హి అనే గ్రామంలో పెళ్ళికొడుకును చూడడానికి వుత్సాహంతో బాల్కనీ మీదకువచ్చినవారి ధాటికి తట్టుకోలేని ఆబాల్కనీ కూలి 10 మందిని చంపిందట మరో 29 మంది గాయపడ్డారట.

*  *  *

గత శుక్రవారం (10 వతేదీ) తిరుపతి కొండ మీద 60 పెళ్ళిళ్ళు జరిగాయట స్థలాలు చాలక ఎక్కడ వెమ్మాడు చోటుదొరికితే అక్కడే బాజాలు మోగించేశారట. పెళ్ళిళ్ళసంఖ్యకు తగినన్ని మండపాలు లేక పోవడమే కారణం అన్నారు అయినా అదిసాధ్యం




కూడాకాదుకదా! ఈ సంవత్సరం మే నెలలో జరిగిన పెళ్ళిళ్ళు చూస్తుంటే పై సంవత్సరం రాబోయే జనాభాకి దేశం తట్టుకోగలదా అనిపిస్తోంది వాట్సాడూ!!

—ఫాలాక్షుడు ●

## అభియోగాలలో వింతలు

# పని మాని వెయ్యలేక ఆత్మహత్యచేసుకున్న భార్య

స్యూ ఇన్‌గ్రామ్ అనే యువతి బిల్ అనే యువకుణ్ణి వివాహమాడి రెండు సంవత్సరాలయినది ఇంతలోనే వారొక పెద్ద చిక్కు నెదుర్కొనవలసి వచ్చింది. నర్సింగ్ సిస్టర్‌గా పని చేస్తూండేదామె వయస్సు 24 సంవత్సరాలు ఉద్యోగంలో చాలా శ్రమచేస్తున్నదని బిల్ ఫిర్యాదు చేశాడు "మనకు ఉన్నది చాలదా? ఇంకా డబ్బు దేనికి?" అంటాడు

పగలంతా ఉద్యోగంతోనే స్యూఇన్‌గ్రామ్‌కు సరిపోయేది ఎక్కడ పని అక్కడ ఆగిపోయేది ఇంట్లో ఆమె ఉద్యోగం గురించి భార్యాభర్తల మధ్య కలత బయలుదేరినది బిల్ వయస్సు కూడా 24 సంవత్సరాలే ఒక వాణిజ్య సంస్థ ప్రతినిధిగా పని చేస్తున్నాడు ఇట్లా చెప్పాడు "వారానికి 45 గంటలు పనిచేస్తే చాలు కానీ నా భార్య అంతకంటే ఎక్కువ పనిచేస్తోంది అదనంగా డబ్బు సంపాదించాలని ఆమె యత్నం కానీ అంత డబ్బు దేనికీ మాకు? ఉన్నది చాలదా?"

ఆఖరిసారి యీ సంగతిని వారు జనవరిలో చర్చించారు ఆలోచించి చూడమని బిల్ బ్రతిమాలాడు ఆమె సమాధానమేమీ చెప్పలేదు— బిల్ వెళ్ళేప్పుడు చెయ్యి వూపింది; నవ్వింది

అంతే ఆ తరువాత బిల్ ఆమెను చూడలేదు. మర్నాడు తమ యింటికి 20 మైళ్ళ దూరంలో తన కారు వెనుక సీట్లో కనిపించినది ఆమె. అప్పటికే చచ్చిపోయింది

అరసీసా విస్కీ, సీసా షెర్రీ తాగింది, నిద్రమాత్రలు మింగింది కింగ్స్ లిన్‌లో జరిగిన విచారణలో యీ భార్య కథ బయట పడినది

ఆమె మరణించినందుకు బిల్ చాలా విచారపడినాడు ఇంత అఘాయిత్యం చేస్తానని ఆమె సూచించలేదని అన్నాడు.

కారొనర్ శ్రీ ఆర్థర్ బాన్‌టాఫ్ట్ ఇట్లా చెప్పాడు "ఇటువంటి అఘాయిత్యాలు ఇదుగో యిట్లా జరిగినవని చెప్పడం సాధ్యం కాని పని ఎక్కడో చిన్న పొరపాటు జరుగుతుంది అంతే నిలువునా ప్రాణాలు తీసుకుంటారు ఈ రకం మనుషులు"

### బిడ్డను కననివ్వని భర్తకు విడాకులు

ఆమె భర్త శ్రీ కెన్నెత్ కింగ్‌హామ్ చాలా క్రూరంగా వ్యవహరించాడని న్యాయమూర్తి అన్నారు శ్రీ కింగ్‌హామ్ ఉపయోగించిన జన్మనిగ్రహ పరికరం అతని భార్య డోరెస్‌కు చాలా బాధ కలిగించినదని న్యాయమూర్తి అభిప్రాయపడినారు న్యాయమూర్తి రాంగ్‌హామ్ ఇంకాయిలా అన్నారు "భార్యను కొడ్తాడనే అర్థంలో మాత్రం కింగ్‌హామ్ క్రూరుడు కాడు కానీ, స్వార్థమూ, అజ్ఞానమూ అతనిలో ఎక్కువయి భార్య పట్ల భర్త వ్యవహరించవలసిన రీతిన వ్యవహరించలేకపోయినాడు

"భార్యకుఇష్టంలేని జన్మనిగ్రహ పద్ధతిని ఒక భర్త అనుసరించే పక్షంలో క్రూరుడని అతని నిందించడంలో తప్పేమీ లేదనుకుంటాను

"ఎందుచేతనంటే తల్లి కావాలనే కోరిక చాలామంది మహిళలలో చాలా ఎక్కువగా వుంటుంది"

భార్య తల్లి కావడానికి కింగ్‌హామ్ అంగీకరించకపోవడానికి అతని దుష్ప్రవర్తనయే కారణమని న్యాయమూర్తి నిర్ణయించారు ఇంతకూ యీకింగ్‌హామ్ అనుసరించిన జన్మనిగ్రహ పద్ధతి యేమిటి? సుఖానుభూతి భార్యకు దక్కకుండా మధ్యలో విరమించే పద్ధతి ఇది చాలా ప్రమాదకరమయినదని న్యాయమూర్తి అభిప్రాయపడినారు కావాలంటే, నిరపాయకరమయిన మరొక జన్మనిగ్రహ పద్ధతిని యువదంపతులనుసరించవచ్చునని హితవు చెప్పారు

—వి. ఎస్. అవధాని

జమ్మి కోనేటిరావు

# రక్తసంబంధం

ఈమధ్య ఒక తెలుగు సినిమాలో ఒక రసవత్తర సన్నివేశం చూసాము కథానాయిక, ఒకచంటివాడిని చూపి, కథానాయకుడు తనను వివాహం చేసుకున్నాడని, తత్ఫలితంగా పుట్టినవాడే ఆ ముద్దుపాపడని, నమ్మింప ప్రయత్నిస్తుంది కొన్ని ఆధారాల ప్రోద్బలంతో, తన వాదనను బలిష్ఠం చేసుకోవడంవల్ల, కథానాయకుడు అసహాయ స్థితిలో పడిపోతాడు అయితే ఆఖరికి, తన అమాయకత్వాన్ని నిరూపించుకొందుకు నాయకుడికి ఒక ఆశాకిరణం కన్పిస్తుంది ఒక డాక్టరు చేత పరీక్షించుకొంటే, తన రక్తం, ఆ బిడ్డరక్తం ఒకటి కాకపోతే, సంగతి తేలిపోతుంది కదా స్పష్టంగా!

ఈ పరంగా శాస్త్రీయంగా కొన్ని విషయాలు ఉన్నాయి. సినిమా విషయంగాక, శాస్త్రీయంగా, ఆ విషయం వివరిస్తాను తండ్రి రక్తం, (లేక తల్లి రక్తమైనా) బిడ్డరక్తంఒకే మాదిరిగా ఉన్నాయనే ప్రసక్తి ఇక్కడ అంతగా రాదు వారిద్దరిలోను ఒకే రక్తంఉన్నా, వారు ఖచ్చితంగా వారి సంతానమని అనడానికి వీల్లేదు అయితే ఒకప్పుడు వారిద్దరిదీ ఒకే రక్తం కాకపోయినా వారు వారి సంతానంకాదు అవడానికి అవకాశంలేదు ఈవిషయాలు, కొన్ని సందర్భాలలో కొన్ని పరిస్థితులకు లోబడి కోర్టులో సాక్ష్యాధారాలకి కూడా పనికివస్తాయి అయితే ఫలానా బిడ్డ, ఫలానా వ్యక్తికి పుట్టి ఉండడు అని ఖచ్చితంగా కొన్ని సందర్భాలలో చెప్పడానికి అవకాశం ఉంది పుట్టి ఉంటాడు అని మాత్రం ఖచ్చితంగా ఏ సందర్భంలోను చెప్పలేము

ఈ విషయం సూక్ష్మంగా వివరిస్తాను మనుష్యుల్లో ముఖ్యంగా 4 రకాల రక్తాలున్నాయి వీటిని **A, B, AB, O** రకాలు (గ్రూపు) అంటారు అవసరాన్నిబట్టి ఒక వ్యక్తి శరీరంలోకి, వేరొక వ్యక్తి రక్తాన్ని ప్రవేశ పెట్టవలసి వచ్చినపుడు, ఈ విషయాన్ని తెలుసుకోవాలి సాపగని రక్తాన్ని ప్రవేశ పెట్టడంవల్ల, ఎర్ర రక్తకణాలు కూడుకొనిపోయి, సన్నరక్తనాళాల్లో ప్రవాహానికి ఆటంకం కల్గి, వ్యక్తి మరణించవచ్చు O అనేది సార్వజనీనమైనది వారి రక్తం ఎవరికయినా ఇవ్వవచ్చు వారికి ఎవరి నుండయినా రక్తాన్ని ఇవ్వవచ్చు కానిA రక్తం కలవారికి, A లేక O రకం వారినుండే తీసికోవాలి. అలాగే B రక్తంకలవారికి B లేక O నుండే తీసికోవాలి AB వారికికూడా AB నుండి లేదా O నుండి మాత్రమే తీసికోవాలి

రక్తంలో ఈ లక్షణాలకి జీనులు కారణం తల్లిదండ్రులనుండి ఈ జీనులు, బిడ్డలకు సంక్రమిస్తాయి వ్యక్తులలో ఈ లక్షణానికి సంబంధించి రెండు జీనులుంటాయి బిడ్డలు కనేటప్పుడు, ఈ రెండు జీనులు విడిపోయి, ఒక్కొక్కటిగానే అండములోకిగాని (స్త్రీ అయితే), శుక్లకణములోకికాని (పురుషుడయితే), ప్రవేశిస్తాయి తిరిగి ఆ రెండూ కలుసుకొని, సంతానంలో నూతన వ్యక్తికి రెండు జీనులతో ఆ లక్షణాన్నిస్తాయి

ఈ జీనులు మొత్తం మూడున్నాయి వాటిని A, B, ı అని చెప్పుకొందాం వాటిలో ఏ రెండయినా వ్యక్తిలో ఉండవచ్చు అంటే ఈ ఆరు అవకాశాలున్నాయి

| | |
|---|---|
| AA Aı | A రకం (రెండువిధాలు) |
| BB, Bı | B రకం (రెండువిధాలు) |
| AB | AB రకం |
| ıı | O రకం |

వ్యక్తులలో ఈ ఆరువిధాలలో (అంటే నాలుగు రకాలు) ఏదయినా ఉండవచ్చు స్త్రీ పురుషులిద్దరు వివాహమయ్యాక, భర్తలోని రెండు జీనులలో ఏదో ఒకటి, భార్యలోని రెండు జీనులలో ఏదో ఒకదానితో కలిపి, తిరిగి రెండు జీనులుంటాయి, సంతానంలో ఏఏజీనులు రావాలో ఆ అవకాశాన్ని బట్టి ఉంటుంది. ఈ ఫలితం, తల్లిదండ్రులనిద్దరిని పోలికాని, లేకఏదో ఒకరినే పోలికాని, లేక ఇద్దరిని పోలకుండా కూడా ఉండవచ్చు

ఉదాహరణకు భార్యాభర్తలిద్దరూ AA విధంవారే అయినప్పుడు, బిడ్డకూడా తప్పక AA విధంవాడే అయిఉంటాడు అలాగే ఇద్దరూBB విధంవారే అయినా, లేక ఇద్దరూ ıı విధంవారే అయినా అదే రకం సంతానం కల్గుతుంది




అయితే తల్లిదండ్రులిద్దరూ A రకం రక్తం కలవారే అయినప్పుడు వేరు ఫలితం కూడా రావచ్చు చూడండి నలుగురిలో ఒకరికి O రకం రక్తం




రావచ్చు (1) అలాగే తల్లిదండ్రులిద్దరూ AB రకం రక్తం కలవారే అనుకొందాం అప్పుడు పిల్లలు AB అయినా అవవచ్చు A అయినా అవవచ్చు,




B రకం అయినా అవవచ్చు చూడండి (2) అదే విధంగా AB రకం రక్తంకలవ్యక్తి O రకం రక్తం కలవ్యక్తినే వివాహం చేసుకుంటే పిల్లలలో A రకం రక్తం కాని, B రకం రక్తంకాని రావచ్చుకాని మరొక రకానికి అవకాశంలేదు.




(3) ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే పైనఉన్న ఆరు విధాలయిన (నాలుగు రకాలు లేక గ్రూపులు) మానవులలో భార్యాభర్తలది ఏమయినా ఉండవచ్చు వారినిబట్టి పిల్లలరక్తం కూడా ఉంటుంది ఎన్నో అవకాశాలు మనం వూహించుకోవచ్చు

అయితే తల్లిదండ్రులిద్దరి విషయం తెలిస్తేకాని బిడ్డడి విషయం ఖచ్చితంగా చెప్పలేము మరొక ముఖ్యమైన విషయం ఈ సందర్భంగా అవకాశం చెప్పగలమేకాని ఖచ్చితంగా అవునని చెప్పలేము వీల యిన సందర్భాలలోఒక్కొక్కప్పుడు కాదనిచెప్ప గల్గుతాం ఉదాహరణకు వ్యక్తి రక్తం AA అను కొందాం బిడ్డడికి AAకాని A1 కాని AB కాని ఉంటే తండ్రి అయిఉండడానికి అవకాశాలున్నాయని అనగలం అంతమాత్రంచేత అతడువాడి బిడ్డడే అని మాత్రం ఖచ్చితంగా చెప్పలేం శాస్త్రం అంత ముందుకుపోలేదు అయితే తండ్రి AAఉంటే, ఆ బిడ్డడకి BB ఉన్నా 11 ఉన్నా అతడు ఆతండ్రికి జన్మించలేదని ఖచ్చితంగా చెప్పుకోవచ్చుకదా!

రెండుచిన్న ఉదాహరణలతో ఈ వ్యాసం ముగి స్తాను ఒక ముసలాయన రక్తం AB అనుకొందాం ఆయన భార్యది కూడా అదే రకం అనుకుంటే ఆయన కుమారులిద్దరిలో ఒకరిది AA వేరొకరిది BB అనుకొందాం ఒక పిల వానిరక్తం AB రకం అయి నప్పుడు అతడు, ఈ కుమారులిద్దరిలో ఏఒకరికయినా బిడ్డడు అయిఉండడానికి అవకాశం ఉందా? దీనికి జవాబుగా, అది తల్లినిబట్టి ఉంటుందని, దానికి అవకాశం ఉందని చెప్పుకోవచ్చు తల్లి AB రకం అయినప్పుడు, ఈఇద్దరికి అటువంటి కొడుకుని కనడానికి అవకాశం ఉంది అయితే తల్లి BB అయి నప్పుడు AAతండ్రికి, తల్లిAA అయినప్పుడు BB తండ్రికి మాత్రమే ఆ అవకాశం ఉంటుంది అవకాశమే ఉంటుందికాని ఖచ్చితంగా ఇతడు తండ్రి, అతడు కొడుకు అని మాత్రం చెప్పలేము

అలాకాక ఆ ముసలాయన రక్తం AB నే అను కొని తల్లిది 11 అనుకొందాం అకప్పుడు ఒక కుమారుడు A1 వేరొక కుమారుడు, B1 అవ డానికి అవకాశాలున్నాయి ఒక బిడ్డరక్తం BB అని ఉన్నప్పుడు అతడు ఇందులో ఒకనికిమాత్రమే బిడ్డ డుగా ఉండడానికి అవకాశం ఉంటుంది కాని, వేరొక అన్నదమ్ముడుకు బిడ్డడుగా ఉండడానికి అవకాశం లేదు తల్లిది ఏరక్తమయినాసరే ఇలా ఎన్నయినా అవకాశాలు వూహించుకోవచ్చును ●



తాళ్ళ బొమ్మలాటలు ఈ బొమ్మలాటలు భారతదేశంలో రాజస్థాన్ లో ప్రసిద్ధి తాళ్ళతో ఆడిస్తారు కనుక వీటి పేరు వచ్చింది రాజపుత్ర వీరుడు అతని ప్రియురాలు

# బొమ్మలాటలు

బొమ్మలాట భారత దేశములో అనాది ప్రసిద్ధ మైన జానపద సంప్రదాయ కళ ఇందులో ముఖ్య మైన రకాలు 1 తాళ బొమ్మలాట 2 తొడుగు బొమ్మలాట 3 ఊసబొమ్మలాట 4 తోలు బొమ్మలాట

తోలు బొమ్మలాట ఒకప్పుడు ఆంధ్రుల ఖ్యాతిని ఖండఖండాంతరములకు వ్యాపింప జేసినది ఈనాడు ఆదరణ లే కొన వూపిరితో మూలుగు తూన్నది

ఆచార్య శ్రీ యం వి రమణమూర్తి, సీతా లక్ష్మి మరుగుపడిన యీ కళను పునరుద్ధరించా లనే ఆకాంక్షతో ఒక దశాబ్దమునకు పూర్వము నుండి కృషి చేస్తూన్నారు వారి లక్ష్యాన్ని గుర్తిం చిన కేంద్ర చర్మ పరిశోధనాలయం డైరెక్టరు డా నై నాయుడమ్మగారి చేయూతతో ఆ పరి శోధనాలయంలో యీ కళాభివృద్ధికి అనేక విధము లైన కృషి జరుగుతున్నది ఆధునిక పద్ధతులలో మద్రాసు గవర్నమెంటు ప్రోత్సాహముతో సంప్ర దాయ కళాకారులతో, అవుత్సాహిక కళాకారులకు, పాఠశాలలోని చేతివృత్తి ఉపాధ్యాయులకు, తోలు బొమ్మలాట కళలో శిక్షణ ఇవ్వబడుతున్నది సంప్ర



తోలుబొమ్మ లాటలకు ఆంధ్రదేశం ప్రసిద్ధి ఈ బొమ్మలు తోలుతోలతయారు చేయబడతాయి కనుక వాటికాపేరు వచ్చినది ఈ బొమ్మలాట ఇతర బొమ్మలాటలవలె కాక ఛాయా పదర నము భారతంలో యుద్ధంచేస్తున్న 'అర్జునుడు'

దాయ రామాయణ బొమ్మలాటను ఆధునిక రంగస్థల పరికరములతో మెరుగులు దిద్దబడినది పంచతంత్ర కథలు, ప్రచారపు కథలు తయారు చెయ్యబడినవి ఈ కళ అతి ఆకర్షణీయమైన ప్రదర్శన మాత్రమే కాదు అనువైన చేతివృత్తి అని నిరూపించబడినది విదేశ వ్యాపారస్తులను బాగా ఆకర్షిస్తున్నది ప్రభుత్వము తగు చర్య తీసుకొంటే తోలుబొమ్మలాటలు, తోలుబొమ్మలు విదేశ మారకాన్ని బాగా ఆర్జించగలవు

—ఎం రత్నాజీరావు ●



**జె పి. ఆర్, కోయంబత్తూరు**

చదువు పూర్తి అయాక పెండ్లి చేసుకుంటానని అంటూ రెండేళ్ళు అమ్మాయితో తిరిగి ఇప్పుడామెను చేసుకుంటే సుఖపడలేనని అంటున్న స్నేహితునికి సలహా ఏమిటి ?

నయం— పెళ్ళి చేసుకున్నాక సుఖపడలేనని పెళ్ళాన్ని వదిలేసే ప్రబుద్ధుల కంటె వో ఆకు తక్కువే తిన్నాడు మీ స్నేహితుడు .....

**ఆర్. వి ఎస్, గుంతకల్**

. నాకు ఒక నిముషం శాంతిలేదు . ఇన్నాళ్ళు డబ్బు పంపి సదిందింది. ఒక యింటిదాన్ని చేద్దామన్న ఉద్దేశ్యం వాళ్ళకిలేదు ఎన్నాళ్ళిలాగ? పోనీ పెళ్ళి ఏంలేకుండా ఇలాగే ఉద్యోగంచేస్తూ కాలం గడిపేద్దామంటే ఇంట్లో ఆదరణలేదు.

నీ పిచ్చిగాని ఆడపిల్ల సంపాదన తిరుగులేనిది అని గ్రహించిన తల్లితండ్రులు— పెళ్ళి ప్రయత్నా లెక్కడ చేస్తున్నారు? కొడుకైతే కనీసం కొంచెం కర్చు పెట్టుకుంటాడు ఆడపిల్ల జీతం జీతం అలా యిస్తుంది ఉద్యోగం ఉంది ఇంగిత జ్ఞానం ఉంది నచ్చినవాడు తగినవాడు తటస్థ పడినప్పుడో క్షణం బాధ్యతలు ప్రబుద్ధులైన అక లకు వదిలి పెళ్ళి చేసుకోవడం ఉత్తమం ఇక తరువాత అంటావా? అన్నీ సర్దుకుని నీదారికి వాళ్ళే వస్తారు రాకపోయినా, నువ్వేదో ద్రోహం చేశానని కృశించి పోనక్కరలేదు బాధ్యతలు తెలియనిది నీ వాళ్ళకి కాని నీకు కాదని ధైర్యంగా ఉండడం నేర్చుకో సోదరీ

**ఎమ్. కె డి, పిఠాపురం**

నిక్షేపరాయుడు అంటారు. అంటే అర్థం ఏమిటి అక్కయ్యా ?

విగ్రహ పుష్టి కల్గిన అప్రయోజకుడిని నిక్షేపరాయుడు అనొచ్చు తమ్ముడూ, పైకి దర్పంగా కనబడే చేతకానివాణ్ణి వర్ణించడానికిలా అంటారు

**కె. ఎస్, కడప**

పసిపిల్లల బాగోగులకు మూలకారణం ఏమిటి ?

తగిన ఆహారం తల్లి ఆదరణ.

**ఏ బి. ఏ, టిట్లాఘర్**

చక్కని సంస్కారం అలవడడానికి ఎకాడమిక్ ఎడ్యుకేషన్ తప్పనిసరి అంటాను. మీరే మంటారు ?

అసలు సంస్కారం అన్నది స్వతహాగా ఉంటేనే దానికి మెరుగులు దిద్దడానికి అవకాశం యిస్తుంది ఎకడమికల్ ఎడ్యుకేషన్ సహజ సంస్కారం లేని వాడికి ఎన్ని డాక్టరేట్లు ఉన్నా ఒక్కటే

**వి వి ఆర్. ఎస్, విజయనగరం**

కవి కాలానికి అంతం ఎప్పుడు ?




దాన్ని మనం చూసే అవకాశం లేదు సోదరా.

**బి. జె ఎస్, ఉంగుటూరు**

ఈ రోజుల్లో పురుషులు స్త్రీలకు లొంగి ఉంటారెందుకక్కయ్యా

ఏ రోజుల్లో స్త్రీ హృదయం పురుషుణ్ణి ఏల లేదు చెల్లెలా?

**ఎస్. ఆర్. ఎస్, కడప**

మెట్రికు విషయంలో మీరు తప్పు సమాధానం ఇచ్చారు. అడిగి తెలుసుకొని వ్రాయ వచ్చుగా ?

మెట్రిక్యులేషను బోర్డు ఒక్కటే అది ఆంధ్రా యూనివర్శిటీ మీరు అనుకుంటున్నట్టు వెంకటేశ్వరా యూనివర్శిటీ వారికి విడిగా మెట్రికు పరీక్షలు లేవు

**బి. కె. ఆర్, కావలి**

ప్రేమించి పెళ్ళి చేసుకుని ఇప్పుడు అష్టకష్టాలూ పడుతున్నాను ఉద్యోగంలేక.

పేదతనం తలుపు తట్టితే ప్రేమ కిటికీలోంచి పలాయనం చిత్తగిస్తుంది ఉద్యోగం లేకుండా పోషించే స్తోమత లేకుండా పెళ్ళేమిటి? అసలా మాట తలపెట్టి ఉండకూడదు ఉద్యోగం దొరికే దాకా ఆగలేక పోయిందా మీ ప్రేమ?

**సి. హెచ్. ఎస్. డి, కలకత్తా**

నేను ఏ సంగతీ ఎప్పుడూ చెప్పలేదు అయినా జీవిత రహస్యాలన్నీ ఈ నాడు బట్టబయలయ్యాయి. ఇదెలా జరిగిందంటారు ?

సమయమూ, అవకాశమూ కలిసి రావాలేగాని అన్ని రహస్యాలూ ఎప్పుడో ఒకప్పుడు బయట పడక తప్పదు కదా?

**కె. ఎస్. ఆర్, విజయవాడ**

నా కెన్నో కోరికలు ఉన్నాయి. ఇంకా చదువు మొదట్లోనే ఉన్నాను ..పెద్ద చదువులు, ఫారిన్ టూరు, ఒకటేమిటి ఈ కోరికల నరికట్టాలా ? సాగనివ్వాలా ?

కోరిక లెన్నయితే నేం? గోనెలు నిండవు కదా! ముందా కోరికలు తీరడానికి — రాజమార్గం వేయండి (అంటే చదువు మీద శ్రద్ధ వహించమని!)

**ఎ. కె. డి, మద్రాసు**

కొత్తబట్టలు ఏవారం కట్టుకుంటే మంచిదక్కయ్యా?

దీనికో క్రమం చెప్తారు చెల్లెలా— వినుః

ఆదివారం— చిరుగుపడతాయి.
సోమవారం— కంట తడిపెడతావు
మంగళవారం — తాకితే చాలు పుణ్యం పోతుంది
బుధవారం— అతిశుభం
గురువారం— చుట్టాలొస్తారు!
శుక్రవారం— వెంటనే యింకా కొత్త బట్టలొస్తాయి
శనివారం— త్వరగా మాస్తాయి! ..

**ఎమ్. ఆర్. ఎన్, విశాఖపట్నం**

కొందరెందుకండీ — ఇంకోళ్ళు రాసినట్టే రాస్తూంటారు ?

వెనకటికో నాటక రచయిత అన్నాట్ట — నా నాటకం ఆడనివ్వరు గాని, దాన్ని కాపీ కొట్తారు! అని .

**వి. వి ఆర్, అనంతపురం**

మనుష్యులను కలిపేది స్నేహమా ? ద్వేషమా ?

ప్రేమ, స్నేహం, గౌరవం. వీటన్నిటికంటే ద్వేషమే ఎక్కువగా మనుషులను ఏకం చేస్తుందేమో!

**ఎమ్ ఎస్. ఆర్, ఖర్గపూరు**

తెలివితేటలుండీ గుర్తింపబడని నా లాంటివాళ్ళ వేమనాలి ?

చేతనైతే ఇతరులను మించిన తెలివితేటలు ప్రదర్శించు గాని ఆ సంగతి ఎదుటివారికి చెప్పకు అంటాడు— చెస్టర్‌ఫీల్డ్

**ఎమ్. వి. కె, విశాఖపట్నం**

నిచ్చెన జేరవేసిఉంటే దాని కిందనుంచి దూరకూడదు అంటా రెందుచేత ?

అందరి కాళ్ళా ఆనే నిచ్చెన మెట్ల కిందనుండి నడవడం హేయమన్న భావంతో మన వాళ్ళలా అంటారు యూరపులో పూర్వం నేరస్థులని నిచ్చెన మెట్లనుండి ఉరితీసే వారు అంచేత అది అమంగళంగా భావిస్తారు ఏసుక్రీస్తును శిలువవేశాక, ఆయన శిష్యులు నిచ్చెన వేసుకుని ఎక్కి కళేబరాన్ని క్రిందికి దింపబోయినప్పుడు, ఆ నిచ్చెన కింద పిశాచాలు చేరి దాన్ని వెనక్కి తిరగతోయాలని చూశాయట అంచేత కూడా నిచ్చెనకింద దూరడం దోషంగా భావిస్తారు . అందుకే నిచ్చెన కింద దూరడం అదృష్టహీనం అన్న లోకోక్తి ప్రబలింది ●



# కాళి కోరిన తల

వి.యస్.సుక్తాంకర్

ఇది మధ్యయుగానికి చెందినదేమీకాదు ఇర వయ్యో శతాబ్దంలో 1928వ సంవత్సరంలో కలకత్తా వంటి పట్టణంలో జరిగినదే!

కర్మవీరంగ్ కలకత్తాలో నివశించే ఒకమధ్య తరగతి కుటుంబానికి చెందిన యిరవై యేళ్ళ యువ కుడు. అతను చాలా బుద్ధిమంతుడు కుటుంబంలో అందరేగాక, ఆపేటలోని వారంతాకూడా అతన్ని అభి మానించేవారు కాళికాదేవి అంటే అతనికివున్న నిష్ఠ భక్తి అపారం దానివల్ల అతవంటే ఆ వాడ వాడంతా అభిమానించేవారు కాళికాదేవి మీాద అతను చక్కని తన గొంతెత్తి భజనపాటలు పాడేవాడు అటువంటి వ్యక్తి చేసిన ఘాతుకం చూసి, ఆవూరి ప్రజలు తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు ఏదో పీడకలను చూసినట్టు భయపడ్డారంటే ఆశ్చర్యంలేదు

అది 1926వ సంవత్సరం డిశంబరు 12వ తేదీన వుదయం ఎనిమిది గంటలవేళ కర్మ, అతని తండ్రి కలిసి యింటినుంచి బయలుదేరడం కర్మ అన్నగారు చూశాడు ఇంటినుంచి కొన్తదూరం రాగానే కర్మ తటాలున తనతండ్రి తల నరికేశాడు క్రిందపడ్డతలను ఒక గుడ్డలో చుట్టి, చేత్తో పుచ్చుకుని నడక ప్రారంభించాడు ఆతం తను ఆరా ధిస్తున్న కాళికాదేవికి నైవేద్యం పెట్టాలని అతని వాంఛ కానీ సయ్యద్ఆలీ అనే అతను యీా దాబుఋ న్నిచూసి, పోలీసులకు తెలియ చేశాడు. పోలీసులు కర్మని వెంబడించి పట్టుకున్నారు "ఠాణా కువచ్చి అసిస్టెంటు యినస్పెక్టరుతో రిపోర్టు యివ్వాలి" అన్నారు.

కర్మ పోలీసు ఠాణాకు వెళ్ళి తనకు రాత్రి కాళికా దేవి కలలో కనుపించి, తన తండ్రి తలను కోరిందని చెప్పాడు అతన్ని ఠాణానుంచి యింటికి తీసుకు వెళ్ళారు ఇంట్లో అతనితండ్రి మొండెం వుంది కర్మఅందరితోసూ యిదే విధంగా చెప్పాడు డాక్టరు తోనూ చెప్పాడు డిశంబరు 13న మేజిస్ట్రేటు ముందుకూడా యిదె కథ చెప్పాడు ఇతనికి మతి భ్రమించిందేమోనన్న అనుమానంతో ఒక సివిల్ సర్జన్ ( డాక్టరు ) అధీనంలో వుంచారు అతను మామూలుగానే మాట్లాడడం, తిరగడం చూసి నిజంగా లతనికి బుర్రపాడై వుండాలనీ, లేకపోతే ఆవిధంగా హత్యచేసిన వాడు ఉండలేడనీ అన్నారు

హైకోర్టు జడ్జియిచ్చిన తీర్పులో యీావిధంగా వుంది

"సెషన్సు జడ్జి యిచ్చిన తీర్పు ప్రకారం మిస్టర్ కర్మ యావజ్జీవకారాగార శిక్ష ననుభవించకన్కరలేదు క్రిమినల్ పినల్ కోడ్ సెక్షన్ 471 ప్రకారం హత్య చేసిన యితనికి బుద్ధితిన్నగాలేదన్న విషయం తెలు స్తూనేవుంది నిజానికి అతనికి తను చేస్తున్న పని కూడా తెలిసివుండదు కనుక టెజుపూర్లో వున్న మెంటల్ ఆసుపత్రిలో అతనిని చేర్పవలసినదిగా కోరుతూ, అస్సాం ప్రభుత్వపు "ఆర్ 54" ప్రకారం పిచ్చివారిని ఏ ప్రకారంగా చూస్తారో, అదే ప్రకా రంగా అతనినీ చూడవలసిందిగా సెషన్సు జడ్జిని కోరుతున్నాము " ●

ఏమిటే ఇందాక నీకొచ్చిన పార్సెలూ? ఏదేనా న్యూ ఇయర్ గిఫ్టా?




ఇదే— ప్రేమలేఖ!



సీరియల్






సి. ఆనందారామం

**జ రి గి న క థ**

రామచంద్రమీద అభిమానం పెంచుకుంటుంది వారిజ. రామచంద్ర కూడా వారిజని ప్రేమిస్తాడు. గతంలో ఆమె ఒక సినిమాతార అని తెలుసుకున్న తర్వాత అతను గుండెరాయి చేసుకుంటాడు. వారిజ వృత్తిని విరమించుకుని తన కుటుంబానికి పాటు పడుతూవుంటుంది. అయినా ఆమెమీద అందరికీ దురభిమానమే. వారిజ చెల్లెలు లత. రామచంద్రానికి లతతో వివాహం ఐపోతుంది. లతలో వారిజని వూహించుకున్న రామచంద్ర ఆశలు ఫలించవు. రామచంద్ర తన చెల్లెలు లతనే వివాహమాడాడని తెలుసుకున్న వారిజ ఆ వూరు వచ్చినందుకు చింతిస్తుంది. రామచంద్ర అభిమతానికి ఎదురు తిరుగుతూ ప్రవర్తించ సాగింది లత. రామచంద్ర తల్లి వారి సంసారాన్ని చూసి చాలా నొచ్చుకుంది. వారిజ లతకి నచ్చచెప్పాలని ప్రయత్నించింది, కాని లాభం లేక పోయింది.

## 13

లతకోసం మల్లెపూలూ, సంపెంగలూ కొని చిరునవ్వుతో ఇంట్లో అడుగు పెట్టిన రామచంద్రను చురచుర చూసింది లత—

'ఎందుకా పూలన్నీ ఇక్కడికి? దాని దగ్గిరకే తీసుకెళ్లకపోయారా?'

విభ్రాంతపోయాడు రామచంద్ర—

'అదెవరు?'

'ఆహా! ఏం నంగనాచి నటన! ఇంకెవరు? మీ వారిజ!'

రామచంద్ర చేతిలోంచి పువ్వులన్నీ నేల రాలిపోయాయి—పాలిపోయిన ముఖంతో లతని చూస్తూ నించున్నాడు—

'ఏం? ఎందుకలా అయిపోయారు? నాకు తెలిసిపోయిందనా? ఎన్నాళ్లు దాచ గలరు? రంకూ బొంకూ దాగవు—'

ఆవేశంగా లత రెండు భుజాలుపట్టుకుని రెండుచెంపలూ టపటప వాయించాడు రామచంద్ర—

కెవ్వున కేకపెట్టి పెద్దపెట్టున శోకండాలు ప్రారంభించింది లత—

ఇరుగు పొరుగు వినకుండా తలుపులు గట్టిగావేసాడు రామచంద్ర—

'ఏం వాగావ్? రంకా? ఎవరు రంకు తనం చేస్తున్నది నేనా? ఎవరు చెప్పారు నీకు?'

'ఏం? ఎవరూ చెప్పకపోతే తెలీదా? ఎన్నాళ్లు దాచగలరు?'

'నోరుమూసుకుని అడిగినదానికి సమాధానం చెప్పు—'

గర్జిస్తూ మళ్లీ చెయ్యెత్తాడు—

హడలిపోయింది లత అతని భీకర స్వరూపానికి—

'ఎవరో ఏంకర్మ! ఆవిడే వచ్చి చెప్పింది?'

'ఎవరు? వారిజా! వారిజ ఇక్కడికి వచ్చి నేను తనతో రంకుసాగిస్తున్నానని చెప్పిందా?'

కళ్లలోంచి అగ్నివర్షం కురిపిస్తూ అడిగాడు—

'రంకు చేస్తున్నమ్మ తను రంకులాడినని ఒప్పుకుంటుందా? ఆవిడెందుకు చెప్తుంది? ఆవిడమాటల్నిబట్టి నేనే అర్థంచేసుకున్నాను—'

'ఏం మాట్లాడింది? ఏం అర్థంచేసుకున్నావు?'

'పనికట్టుకుని ఇక్కడికొచ్చి, 'నీ మొగుడు నీ మీద చూపిస్తున్న ప్రేమంతా నిజం ప్రేమకాదు – నేనే నిన్ను ప్రేమించమన్నాను—అందుకని ప్రేమిస్తున్నాడు— ఇప్పుడు నువ్వు అతనితో సవ్యంగా ఉండక పోతే నిన్ను వదిలివేస్తాడు—' అని చెప్పింది— ఆవిడెలా ఆడిస్తోంటే, మీరలా ఆడుతున్నారంటే ఏంలేకుండానేనా? నే నామాత్రం అర్థంచేసుకోలేనా? విచ్చలవిడిగా ఉండే సినిమారంగంలో సహితం గొప్ప వ్యభిచారిణిగా పేరు సంపాదించుకున్న ఆ వారిజ మిమ్మల్ని ఆ మాత్రం గుప్పెటలో పెట్టుకోలేదా?'

మళ్లీ చెంప చెళ్లుమంది లతకు—

బావురుమంది లత—

'దాని వలలోపడి—దాన్ని మరిగి కట్టుకున్నదాన్ని ఇలా నానా హింసలూ———'

రెండుచేతులతోనూ లతను ఇష్టమొచ్చి నట్లు బాదేసాడు రామచంద్రి—

'ఆపు! ఆవెధవ వాగుడు ఆపు—'

వెక్కివెక్కి ఏడుస్తూనే లత అంది—

'ఆపను—ఎందుకాపుతానూ? కట్టుకున్న

దాని కష్టసుఖాలు గాలికొదిలేసి ఆ రంకు ముండతో కులికే వీరు, స్వంత చెల్లెలి కాపురంలోనే నిప్పులుపొయ్యటానికి తయారయిన ఆ వగలాడీ-వీరిద్దరూ ఏకమై నాకు చితిపేరుస్తుంటే నేనెందుకు నోరు మూసుకుంటాను?' కొట్టడానికి ఎత్తిన చెయ్యి వాలిపోయింది రామచంద్రకు—పిచ్చి పట్టినవాడిలా లతనుచూస్తూ—'ఏమన్నావ్?' అన్నాడు—

లతకు తనపొరపాటు తెలిసివచ్చింది—భయంతో చూసింది - రామచంద్ర ముందు కొంగి లత రెండుభుజాలు పట్టుకుని బలంగా ఊగిస్తూ 'చెప్పు — వారిజకు నువ్వు చెల్లెలివా? ఈ సంగతి నాకిది వరకే ఎందుకు చెప్పలేదు? అక్కాచెల్లెళ్లిద్దరూ కలిసి నా దగ్గిర ఎందుకు రహస్యంగా ఉంచారు ఈ సంగతిని?' అన్నాడు

'రహస్యంగా ఉంచక ఏంచెయ్యను? సినిమాస్టారంటేనే వల్లమాలిన ఆకర్షణతోపాటు దానిలో లీనమయి తేలికభావం—అందులో ఈవిడగారు అలాంటి సినీ రంగంలోనే పోకిళ్లమారిగా ప్రసిద్ధి పొందింది — అందరితోనూ ఈవిడ చచ్చిందనే చెప్పాము — అందుకే నాకు అక్క ఉందని చెప్పలేదు — మా ఇంటికే పీడలా దాపురించిన ఈ శని ఇక్కడికి కూడా నా కర్మకొద్దీ, 'దాపురిస్తుందని నాకేం తెలుసు?' నించున్న మనిషి కుప్పలా కూలిపోయాడు రామచంద్ర — బిక్కుబిక్కుమంటూ చూసింది లత — రామచంద్ర కోపంతో గర్జిస్తున్నప్పుడూ, చావ బాదుతున్నప్పుడూ కూడా కలగని భయమేదో రెండు చేతులలో 'తలపెట్టుకుని అతను శిలలా కూర్చున్నప్పుడు కలిగింది.

గడియారపు ముళ్లు చకచక కదిలిపోతున్నాయి — అయినా రామచంద్రలో చలనంలేదు—తనంత తనగా రామచంద్రను పిలిచే సాహసం కలగటంలేదు లతకు

ఇంట్లోంచి శవాన్ని తీసుకెళ్లిపోయిం తర్వాత ఏర్పడే దారుణ నిశ్శబ్దంలాంటిది



ఆవరించింది ఆ ఇంట్లో—

గడియారం తొమ్మిది కొట్టింది — లతకు ఆకలేస్తోంది—

అయినా రామచంద్రను భోజనానికి లెమ్మని అనలేకపోయింది — ఎప్పటిలా తను పెట్టుకుని తినటానికి సాహసించలేక పోయింది — ఉన్నట్లుండి చటుక్కున లేచి 'రైలు తొమ్మిదిన్నరకి—' అన్నాడు రామచంద్ర—

తెల్లబోయి చూసింది లత—

'ఇంకా అలా చూస్తావేం? త్వరగా నీ బట్టలేవీ సర్దుకో! మళ్లీ ఇక్కడికి రావక్కర్లేని పద్ధతిని సర్దుకో!'

'అంటే! ఇక ఏకంగా దానితో ఉందామనా? దాన్ని ఏకంగా ఇక్కడికే తెచ్చుకుందామనా?'

'నోర్మూయి—మీ నాన్న ఒక తాగుబోతు—మీ అక్క ఒక తిరుగుబోతు — నువ్వొక వదరుబోతు—మీ రెవ్వరూ మనుష్యులు కారు—మీ ఎవ్వరితోనూ నాకిక ఏ సంబంధమూ లేదు—అన్నీ సర్దుకో! రిక్షా తెస్తాను—'

రామచంద్ర వెళ్లి రిక్షా తెచ్చాడు—

లత ఏం సర్దుకోలేదు—ఎలా కూర్చుందో అలాగే ఉంది—

'అదేం? ఎందుకు తయారవ్వలేదూ?'

రాళ్లు రువ్వుతున్నట్లు అడిగాడు—

'ఎందుకు తయారవుతాను? మీ ఆటలు నేను సాగనిస్తాననే అనుకున్నారా? ఈ ఇల్లు నాది—ఈ సంసారం నాది—నన్ను ఎవరు వెళ్ల గొడతారో చూస్తాను—'

పెంకిగా అంది లత—

'లే! వెంటనే బయలుదేరు—రైలు వెళ్ళిపోతుంది'—నిర్లక్ష్యంగా ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నాడు—

'దాటిపోతే దాటిపోనియ్యండి — నేను కదలను—నా ప్రాణం పోయినా ఇక్కడనుండి కదలను—'

'లతా! నన్ను హంతకుడిని చెయ్యకు—ఈ రాత్రినుంచీ ఈ ఇంట్లో మనిద్దరం ఉండటం అసంభవం...' నొక్కిపలికాడు రామచంద్ర—

శిలలా ఉన్న అతని ముఖాన్ని ఎర్రగా నిప్పులు కక్కుతోన్న అతని కళ్లనీ చూసి నిజంగా హత్య చేస్తాడేమోనని హడిలిపోయింది లత — చేతికందిన బట్టలన్నీ పెట్టెలో కూరుకుని, ఉన్నది ఉన్నట్లుగా వెళ్లి రిక్షాలో కూర్చుంది—వెనకాతలే సైకిల్ మీద వెళ్లి టికెట్ కొని లతను రైలెక్కించాడు రామచంద్ర—

అతడు తనను పుట్టింటికి పంపేస్తాడని ఎంతమాత్రమూ అనుకోని లతకు రైల్లో కూర్చోగానే దుఃఖం పొంగుకొచ్చింది—

'నన్నింత ఉసురు పెడుతున్నారు — మీకు న్యాయం కాదు — భోగందాన్ని నమ్ముకుని కట్టుకున్నదాన్ని ఘోష పెట్టిన వాడు ఎప్పటికీ బాగుపడలేడు — మీకున్నదంతా కైంకర్యం చేసి, అది మీ చేతికి చిప్ప తెచ్చిన నాడు అప్పుడు నేను గుర్తుకొస్తాను—భోగంది కనుక అది వదిలిపోగలదు కాని నేను పోలేనుగా! — ఆనాడు మీతో పాటు దరిద్రం అనుభవించటానికి వస్తాను—అప్పటికి తెలుస్తుంది మీకు—'

లత ఇంకా మాట్లాడుతోనే ఉంది—రైలు కదిలేవరకూ కూడా ఉండకుండా వచ్చేసాడు రామచంద్ర—

* * *

శిశిరఋతువు — ప్రకృతి నిలువెల్లా వణుకుతూ మంచు బిందువులను విదిలించుకొంటూంది—వెలుగు రేకలు పూర్తిగా విప్పుకొని అరుణోదయాత్పూర్వపు టాకాశం బద్ధకంగా ఎరుపులో నీలాన్ని విరుచుకొంటూంది—అతి పలచని అరుణ కాంతులు ప్రాచీదిశగా బయలుదేరి ఆకాశంలో చాలావరకు నీలాన్ని చీల్చుకొంటూ అల్లుకొని క్రింది నల్లని చీకట్లలో ప్రతిఫలిస్తున్నాయి — మత్తు వదుల్చుకొని ప్రకృతికి సుకుమారమైన ఆ తేజోకిరణాలు గిలిగింతలు పెడుతోంటే ముసిముసి నవ్వులతో కద్దికొద్దిగా చైతన్యం పొందుతోంది — ఆ ప్రశాంత సుందర సమయంలో తన ఇంటి ముంగిలిలో నిలబడి ప్రకృతి పొందుతోన్న పారవశ్యాన్ని అర్థం చేసుకోవటానికీ — అందులో తనూ భాగం పంచుకోవటానికీ ప్రయత్నిస్తోంది వారిజ—

లత తనతో మాట్లాడిన ధోరణిని బట్టి ఏవిధంగానూ భర్తతో సమాధానపడగలదని ఊహించలేకపోయింది—

లతా రామచంద్రలు మళ్లీ ఘర్షణ పడవచ్చని కూడ తోచింది. అప్పుడు రామచంద్ర మళ్లీ తనదగ్గిరికి వస్తాడు—

ఏం చెప్పాలి అతనికి? ఏవిధంగా అతడిని అనునయించాలి? ఏరకంగా అతడి దారుణ దుఃఖాన్ని మరిపించాలి? ఎలా నచ్చజెప్తే అతడు లతను క్షమించి ఆదరించగలడు?

విపరీతమైన ఆందోళనాపూర్వకమైన ఉత్కంఠతో ఏరోజుకారోజు రామచంద్ర రాకకోసం ఎదురు చూడసాగింది వారిజ — నాలుగు రోజులు గడిచినా అతడు రాక పోయేసరికి ముందు ఆశ్చర్యపోయింది — తరువాత సంతోషపడింది—ఎదో ఒకవిధంగా లతా రామచంద్రలు సమాధానపడి ఉండ



తమ్మునవే నిర్ణయించుకొంది—అవును లత తొందరపాటు మనిషయినా రామచంద్ర విగ్రహం కలవ్యక్తి—మంచిచెడ్డలు తెలిసిన వ్యక్తి—ఎంతో అలవిమాలితేకాని లత కన్యాయం చెయ్యడు—

తేలిగ్గా నిట్టూర్చింది—

పలచని అరుణకాంతులు చిక్కబడి తూర్పుదిశకు పేరుకుంటున్నాయి — తెలి మబ్బులు నీలపు మబ్బులను మచ్చిక చేసుకొంటూ వెన్నాడుతున్నాయి — తమలో కలుపుకోవాలని తాపత్రయ పడుతున్నాయి— ప్రకృతి మొత్తం మత్తు వదిలించు కొంటూనే ఆవులిస్తోంది—

ఎంత అందంగా ఉంది ప్రకృతి ? ఈ ప్రకృతిలో తనూ ఒక భాగంగా లీనమయి



# చీకటి కడుపున ...

పొగలిగితే ?

తన ఆలోచనకు తనకే నవ్వొచ్చింది వారిజకు—ప్రకృతిలో ఒక భాగంగా లీనమవటమంటే చచ్చిపోవటం—చచ్చిపోవటం తనకిష్టమా? ఆత్మహత్య ఇష్టమయితే ఏనాడో ఆత్మహత్య చేసుకునేది—తను కావాలనుకొని ఈ లోకంలోకి రాలేదు—ఇష్టమున్నా, ఇష్టం లేకపోయినా ఏదో ఒకనాడు ఈ లోకంలోంచి వెళ్ళకా తప్పదు—అలాంటప్పుడు మధ్యలో తన ప్రయత్నమెందుకు? ఈ అరుణోదయాలూ, సూర్యాస్తమయాలూ, నల్లని చీకట్లలో తళుకుమనే తారకలూ, జగత్తుపై అమృతపు జల్లులు కురిపించే వెన్నెలలూ, ఈ అందాలన్నీ తనకోసం కాదూ! వీటిని వదులుకొని ఎక్కడకు పారిపోవాలి? ఏనాడో ఒకనాడు ఈ విశ్వమే తనను ఆహ్వానిస్తుంది — అప్పుడే సుఖంగా వెళ్ళిపోవచ్చు—ఎందుకు తొందర?

ఎంతకూ బద్ధకం వదుల్చుకోని ప్రకృతిని చూసి తూర్పుదిశ కళ్ళెర్ర చేసింది — ఒకసారి ఉలికిపడిన పక్షులన్నీ కలకల నవ్వాయి — ఆ నవ్వులకు ప్రకృతి సమస్తమూ చైతన్యంతో చిందులు త్రొక్కింది—

వాకిలి ఊడ్చి నీళ్ళుజల్లి ముగ్గుపెట్టి, ఇల్లు శుభ్రం చేసుకుని స్నానం ముగించి వంట కుపక్రమించింది వారిజ—

'అమ్మా!' అన్న దీనమైన వీరన్న పిలుపుకు ఉలికిపడి వీధిలోకి వచ్చింది—

పాలిపోయిన వీరన్న ముఖంలోకి భయంగా చూస్తూ 'ఏం జరిగింది వీరన్నా?' అంది—

వీరన్న వారిజ ముఖంలోకి దీనంగా చూసాడు—

'బాబుగారు రోజురోజుకీ పిచ్చివాడిలా అయిపోతున్నారమ్మా!'

అదిరిపడింది వారిజ — ఏం మాట్లాడటానికీ సాహసించలేనట్లు కొన్నిక్షణాలు పిచ్చిదానిలా వీరన్న ముఖంలోకి చూసింది—చాలాసేపటికి గొంతు పెగుల్చుకుని ఎలాగో 'లత లత' అంది—

'లతమ్మగా రెక్కడమ్మా! వెళ్ళిపోయారుగా!'

గిర్రున తలతిరిగింది వారిజకి—

'వెళ్ళిపోయిందా? ఎందుకు?' పిచ్చిదానిలా అడిగింది—

తలవంచుకున్నాడు వీరన్న—

'బాబుగారే రైలెక్కించేసారు—ఎందుకో నాకే తెలీదు — అప్పటినుండీ అలా పరాగ్గావే ఉన్నారు — పొలం పనులు కూడా పట్టించుకోవటంలేదు—అన్నీ నే నొక్కడినీ చూసుకుంటున్నాను — అసలొక్కొక్కరోజు పొలంమీదికే రావటంలేదు — ఆ ఇంట్లో అలా పడుకుని ఉంటారు — తిన్ననాడు తింటారు— లేనినాడు లేదు — మనిషి ఈ కొంచెం రోజుల్లో ఎంత చిక్కిపోయారో చెప్పినా నమ్మలేరు మీరు.'

వారిజ హృదయం కలతపడి కరిగి కళ్ళలోంచి స్రవించింది—

బొమ్మలా కూర్చుని కన్నీళ్ళు కారుస్తోన్న వారిజను చూస్తూ భయంగా అన్నాడు వీరన్న—

'అమ్మా! మీ రొక్కసారి బాబుగారి దగ్గరకు రావాలి— ఆయనను కొంత మనుష్యులలోకి తేవాలి!'

'నేనా?' విభ్రాంతితో అంది వారిజ —

'బాబుగారిమీద మీ ప్రభావం ఎంతో మీకు తెలియదా అమ్మా! ఆయనచేత మీరేపనిస్తైనా చేయించగలరు—ఆయన మనసులో ఎంత దుఃఖమున్నా మరిపించగలరు—రావాలమ్మా! మీరు రాక తప్పదు— ఇప్పుడు రాకపోతే తరువాత మీరే చాలా బాధపడతారు—'

'వస్తాను వీరన్నా! ఇవాళే వస్తాను — ఎందుకు రాను?' తనను తను ప్రశ్నించుకొంటున్నట్లు అంది—

వీరన్న ముఖం వెలిగింది—

'నాకు తెలుసమ్మా! మీమీదే ఆశపెట్టుకున్నాను—ఇంక నాకు నిశ్చింత — ఆయన పొలంలోకి రావటంలేదు — ఇంటిదగ్గరే ఉంటారు—వెళ్ళండి—'

తేలికపడిన హృదయంతో వెళ్ళిపోయాడు వీరన్న—

* * *

రామచంద్ర ఇంటికి బయలుదేరి సగం దూరందాకా నడిచిన వారిజ చటుక్కున ఆగిపోయింది—

ఏమిటిది? ఏంచేస్తోంది తను? తనక్కడకు వెళ్ళటంవల్ల ప్రయోజనం ఏమిటి? తను పూనుకుంటే ఆతని

మనసులోని చికాకునంతటినీ మరిపించ గలదు—నిజమే! కానీ దాని పరిణామ మేమిటి? రామచంద్ర తనకు మరింత దగ్గరవుతాడు—తనను మరింత అల్లుకుపోతాడు—లతపట్ల విముఖత్వం మరింత పెరుగుతుంది—తనను వదిలిపోయిన లతనూ, కూడా ఉండి మనోవ్యధనంత మాయం చేయగలిగిన తననూ మనసులో పోల్చుకుని లతపట్ల అసంతృప్తి మరింత పెంచుకుంటాడు—అదేనా తను చెయ్యవలసింది?

గిర్రున వెనక్కు ఇంటివైపు మళ్ళింది వారిజ—మళ్ళీ ఆలోచనలు—

అటు లతా, ఇటు తనూ ఇద్దరూ వదిలేస్తే ఏమయిపోవాలి రామచంద్ర? ఇప్పటికే సగం పిచ్చివాడిలా తయారయ్యాట్ట! తిండిమీద ధ్యానం లేదుట! అయ్యో! ఎలా వదిలెయ్యగలను అతణ్ణి అతనికర్మానికి?

మళ్ళీ రామచంద్ర ఇంటివైపుకే మళ్ళింది వారిజ—

లతకు అన్యాయం చేస్తున్నానేమోననే శంక ఒకవైపూ, తన రామచంద్ర ఏమయిపోతాడోననే బెంగ ఒకవైపూ, హృదయాన్ని ఊగిస్తూండగా, అసలేం జరిగిందో ననే ఆందోళన—తిరిగి ఏనాటికైనా లతా రామచంద్రలు ఒకటవ్వగలరా అనే ఆవేదనా మనసును కల్లోలపెట్టేస్తూండగా—తనకే సరిగా అర్థంకాని ఉద్వేగంతో వణికిపోతూ రామచంద్ర ఇంట్లోకి అడుగు పెట్టింది వారిజ—

మంచంమీద పడుకుని ఇంటికప్పుకేసి తదేకంగా చూస్తోన్న రామచంద్ర వారిజ అడుగుల చప్పుడువిని వారిజను చూసాడు—ఒక్కక్షణం అతని ముఖం వెలిగింది — అంతలో కఠినంగా మారిపోయింది — విసురుగా మంచంమీంచి లేచి వారిజ ముందుకొచ్చి 'ఎందుకొచ్చావ్?' అన్నాడు—

'మీకోసం'

వారిజ అబద్ధమాడదలచుకోలేదు — రేగిపోయిన జుట్టుతో—ఎర్రబడిన కళ్ళతో, వడిలిపోయి చిక్కిపోయిఉన్న రామచంద్రను చూడగానే వారిజకింకే విలువలు గుర్తు రాలేదు—అందంగా, ఆనందంగా ఆరోగ్యంగా తనకు పరిచయమయిన రామచంద్రను ఈ స్థితిలో చూడవలసివచ్చిందనే ఆవేదనే మిగిలింది. తిరిగి అతణ్ణి యథాప్రకారంగా చెయ్యాలనే తపనే గెల్చింది—

రామచంద్ర వారిజ భుజం పట్టుకుని గెడ్డంక్రింద, చెయ్యేసి ముఖాన్ని విసురుగా పైకెత్తి 'ఇలా చూసి చెప్పు—నా కళ్ళలోకి చూసి చెప్పు—నాకోసం వచ్చావా?' కఠినంగా అన్నాడు—

నీళ్ళునిండిన కళ్ళతో తీక్షణంగా ఉన్న రామచంద్ర చూపులను ఎదుర్కొంది వారిజ—

'అవును-మీకోసమే వచ్చాను—'

'కాదు—కాదు—మీచెల్లెలికోసం వచ్చావు—నాకు మాయమాటలుచెప్పి, మభ్యపెట్టి మళ్ళి నీ చెల్లెల్ని ఇక్కడికి పిలిపిద్దామని వచ్చావు — నా గుండెలు ఆవేదనతో పగిలిపోతున్నా నీకు బాధలేదు నేను ప్రేమకోసం ఎలా పరితపిస్తున్నానో నీ కక్కర్లేదు — నీకు కావలసింది నీ చెల్లెలు సుఖం— నీ చెల్లెలు హాయిగా ఉంటే చాలు నీకు—అందుకే అందుకే వచ్చావు.'

'కాదు!'

గట్టిగా అరిచింది వారిజ—

'కాదు — మా చెల్లెలికోసం రాలేదు మీకోసమే వచ్చాను — ఈ ప్రపంచంలో మీకంటె నా కెవరూ ఎక్కువకారు — మీరు తప్ప నాకు కావలిసిన వాళ్ళెవరూ లేరు—మీ సుఖంకంటె నాకు కావలసింది లేదు—నన్ను నమ్మండి—'

ఆతని గుండెలమీద వాలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది వారిజ—బలంగా ఆమెను అదుముకున్నాడు రామచంద్ర—

'ఏదో పెన్నిధిని దాచుకొన్నట్లు తన చేతులతో వారిజ శరీరాన్ని చుట్టేసాడు—ఇంకెప్పటికీ విడవలేనట్లు వారిజను చుట్టుకొన్న చేతులు బిగించాడు—ఆమె శిరస్సు పెదవులతో స్పృశిస్తూ 'నమ్మితాను వారిజా! రా! నా దగ్గరకు వచ్చెయ్యి—నువ్వు కావాలి నాకు — ఇంకేం అక్కర్లేదు—మనిద్దరం కలిసి బ్రతుకుదాం—అ—బ్బా! నీకోసం ఎలా దహించుకుపోతున్నానో తెలుసా? నీ చేతులు నా చేతుల్లో బంధించుకోవాలి—నీ నొక్కునొక్కుల జుట్టుని ఆప్యాయంగా ఆఘ్రాణించాలి—నీ మెత్తని పెదవులతో ఆడుకోవాలి—నీ పలచని చెక్కిళ్ళలో నా నీడలు చూసుకోవాలి— నీ గుండెల్లో సమస్తమూ మరిచి నిద్రపోవాలి—రా! వారిజా! నా దగ్గరికి—నా ఇంట్లోకి—నాలోకి—వచ్చెయ్యి —నాకు దూరంగా ఉండకు—ఏ విషయమూ గుర్తు చెయ్యకు—దేన్నిగురించీ ఆలోచించకు—నువ్వూ—నేనూ—అంతే' ఇంకేమీ లేదు—ఇంకేమీ అక్కర్లేదు—' అన్నాడు—

ఎంత అణచుకున్నా వారిజకు దుఃఖం ఆగటంలేదు—

'ఈ పాపిష్ఠిదానిమీద మీకెందు కింత ప్రేమ?'

వారిజను చుట్టుకున్న రామచంద్ర చేతులు చటుక్కున వాలిపోయాయి—

'ఎందుకలా మాట్లాడతావు? వద్దు వారిజా! ఎన్ని చికాకులైనా భరించగలను కాని అది అదిమాత్రం భరించలేను—



ఆ ప్రసక్తి తేకు—నాకది గుర్తుచెయ్యకు—'

అది నిజం—గుర్తు చేసుకోనంత మాత్రాన మాసిపోయేదికాదు—అనుక్షణమూ శరీరాన్నీ మనసునూ నిప్పులా మలమల మాడ్చేది—'

'ఆ—హ్హా! వారిజా!'

'ఈ వారిజ దగ్గర ఏముంది మీకివ్వడానికి? ఈ ఎంగిలి శరీరం ఏముఖంతో మీ కర్పించుకోను? ఎప్పుడూ మీ మేలు కోరుతూ మీకోసం పరితపించే బేలమనసు ఒకటున్నదని మీకు మాత్రం తెలీదూ?'

'పోనీలే! ఏదీవద్దు—నా దగ్గరుండిపో! నాకదేచాలు! నిన్ను చూస్తూ నీతో కబుర్లు చెప్పుకుంటూ ఉంటే అంతే చాలు! ఏం, ఉంటావా? నాకోసం — నా మనశ్శాంతికోసం — నా సంతోషంకోసం ప్రాధేయపడుతున్నాను—సరేననూ—'

'మీకు తెలీదు — ఇప్పుడలాగే అనిపిస్తుంది—ఈ యవ్వనం ఒకమహామాయావి —దీన్ని నమ్మడానికి వీల్లేదు — ఈ ఉద్రేకాలు అంతకన్నా దొంగవి-ఎప్పుడు పొంగుతాయో, ఎలా మనసును వశం చేసుకుంటాయో మనకే తెలీదు—అంతా అయిపోయాక—ఎంత బాధపడ్డా—మనను మనమే ఎంత అసహ్యించుకున్నా, ఏం ప్రయోజనం ఉండదు — మీ మేలుకోరి చెపుతున్నాను— నన్ను పూర్తిగా మరిచిపొండి ఇప్పుడు వెంటనే కాకపోయినా కొన్నాళ్ళకైనా మీ మనసులో పశ్చాత్తాపం రాకమానదు అప్పుడు

'పో! వెంటనే ఇక్కడినుంచి పో!'

ఉరిమాడు రామచంద్ర—

'నీకు నామీద ప్రేమా? ఒట్టి స్వార్థం పరురాలివి—

ప్రేమ ఉన్న దానివయితే, నీ చెల్లెల్ని చేసుకోబోయే ముందుగానే నన్ను హెచ్చరించవూ? నీ చెల్లెలు స్వభావం నీకు తెలీదూ? నీ చెల్లెలికి కట్నం లేకుండా మొగుడు దొరికిందే చాలని మురిసిపోయి ఊరుకున్నావు — అశాంతితో వేగిపోయి నీదగ్గరికి శాంతికోసం వస్తే ఆదరించక పోగా మరింత క్షోభ పెడుతున్నావు— 'లతను ప్రేమించండి-మీ ప్రేమకు కరగని వాళ్ళెవరు?' అని నాతో తియ్యని మాటలు చెప్పి అటు లతని హెచ్చరించడానికి తయారయ్యావు నామీద ఏకోశాన్నా ప్రేమలేని లతను ప్రేమ నటించమని చెప్పేటంత నీచా

చీకటి కడుపున...

నికి తయారయ్యావు అన్నివిధాలా భంగపడి, దీనంగా నీ సాహచర్యాన్ని యాచిస్తే తిరస్కరించి వెళ్ళిపోగలుగుతున్నావు — నీకు నా మీద ప్రేమ ఉందని నమ్మకోనా? ఫూల్‌ని — నువ్వు మహానటివని ఎప్పటి కప్పుడు మరిచిపోతూ ఉంటాను'

'నటనా? నేను మీదగ్గిర నటిస్తున్నానా?'

అతి మామూలు చీరతో, ఒక అలంకారమైనా లేని శరీరంతో పెద్దకళ్ళను మరింత పెద్దవిచేస్తూ అమాయకంగా దీనంగా అడుగుతోన్న వారిజను చూడలేక చటుక్కున వెనక్కు తిరిగాడు రామచంద్ర

కొన్నిక్షణాలు అలాగే నిలబడిన వారిజ శాంతస్వరంతో అంది

'చిన్నచిన్న చికాకులకే ఇంతగా బెదిరిపోయే మీరు అనాడు 'నా కన్నిమాటలు ఎలా చెప్పగలిగారో ఆశ్చర్యంగాఉంది సమయానికి పనికిరాని జ్ఞానమెందుకు? క్లిష్ట పరిస్థితులలో దృఢంగా నిలబడలేని—బలహీనపు క్షణాలలో తట్టుకోలేని — ఉద్రేకాలను జయించలేని వ్యక్తిత్వమూ ఒక వ్యక్తిత్వమేనా?'

గిర్రున వారివైపుకు తిరిగాడు రామచంద్ర

'ఏమిటీ? నువ్వు వెక్కిరిస్తున్నావా? నా వ్యక్తిత్వాన్ని?'

'అవును — నేనే వెక్కిరిస్తున్నాను—నేను





పతితను— భ్రష్టను— అయినా నేను నిలద్రొక్కుకున్నాను. అనేక ప్రలోభాల మధ్య నుంచి బయటికి వచ్చాను. ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినా నా వ్యక్తిత్వం నశించి పోలేదు అందుకే, ఆ వ్యక్తిత్వంతోనే మీ ముందు నిండుగా నిలిచి మీ వ్యక్తిత్వాన్ని అధిక్షేపిస్తున్నాను'

'నా వ్యక్తిత్వం బలహీనమైనదా?'

'కాదా? ఇప్పుడింతగా కృంగిపోతున్నారే? ఎందుకు? అంత దుర్బలులా? ఒక స్త్రీ లేకుండా బ్రతకలేరా?'

'ఛీ! ఛీ! ఒక ఆడదానికోసం కృంగి పోతున్నానంటావా?'

'ఏమనను మరి? నన్ను ప్రేమించి — నా ప్రేమకోసమే పరితపిస్తున్నారని అనుకోమంటారా? మీ అంతరాత్మను అడిగి చెప్పండి— లత మీకు అనుకూలంగా ఉండి మీరిద్దరూ అన్యోన్యంగా ఉండగలిగితే నాకోసం ఇలా వ్యాకులపడేవారా? దౌర్భాగ్యురాలు జీవించటం చేతకాక వెళ్ళిపోయింది. అందుకు మిమ్మల్ని నిందించను— కానీ లత వెళ్ళిపోయినంతమాత్రాన మీరిలా కృంగిపోవటం న్యాయంకాదు - తిండీ తిప్పలూ మాని, మీ పనులుమాని మీరు సాధించే దేమిటి? లతలో పశ్చాత్తాపం కలగక మానదు — ఒకనాటికి మీ దగ్గిరికి తిరిగి రాక మానదు అప్పటికి మీ ఇల్లాలిని హృదయపూర్వకంగా ఆదరించగలదశలో నిలబడండి — మోడులాంటి నేను కూడా ఈ సృష్టిని చూసుకుంటూ నిండుగా బ్రతకగలుగుతున్నాను ఏ లోపమూ లేని అదృష్టవంతులు— అల్పమైన చికాకులతో బ్రతుకుమీద విరక్తి పెంచుకొని మనసులోని మాధుర్యాన్ని హరింపచేసుకోకండి— బ్రతుకును ప్రేమించండి— నిండుగా బ్రతకండి —మన మనసులను కవ్విస్తూ మనల్ని ఉక్కిరిబిక్కిరిచేసే ఉద్రేకాలకు మీ వ్యక్తిత్వాన్నే భంగపరిచేటంత బలం ఇవ్వకండి— ఆలోచించండి వెళ్తాను'

రామచంద్ర ఆశ్చర్యంగా చూస్తుండగానే వారిజ గడపదాటి గబగబ బయటికి అడుగులు వేసింది.

**(ఇంకా ఉంది)**

# ......ఏం ముద్దు!!

వసుంధర



కె. రామలక్ష్మి

సాధారణంగా అతి ముద్దుగా నెమ్మదిగా ఉండే చిన్న పిల్లలు, ఆ ముద్దునీ, నెమ్మదినీ పూర్తిగా స్వప్రయోజనాలకి ఉపయోగించుకుంటారు అందుకే పిల్లాడి ముద్దు చూసి మూర్ఛపోకూడదు! తమ పిల్లలు 'అబ్బ ఎంత ముద్దుగా ఉన్నారమ్మా' అనడం విని పొంగిపోని తల్లులు చాలా అరుదు నిజమే కూడా, నలుగురిలోనూ ముద్దుగా ప్రవర్తించడం, అందరి మెప్పు పొందడం బాగానే ఉంటుంది చిన్న పిల్లలు ముద్దుగా ఉండడం సహజమే కాని అతిగా ఉండడం కొంచెం ఆలోచించ తగ్గది. నాకు తెలిసిన సరోజ కొడుకు పిల్లల పాలిట పిడుగే—ఆడపిల్లల పిలక జడలు పీకతాడు అవకాశం దొరికినప్పుడల్లా ఏడిపిస్తాడు అయితేనేం? పెద్దవాళ్ళు ఆ చుట్టుపక్కల ఉండనివ్వండి అంత ముద్దుగా నమ్రత ఉట్టిపడుతూ ఉండే ఇంకో పిల్లాడు ఉండడనిపిస్తుంది!

ఓ రోజు నేనూ సరోజా కబుర్లు చెప్పుకుంటున్నాం ఇంతట్లో సరోజ మేనత్త చూడ్డానికి వచ్చింది. ఏముంది? మన పిడుగు తన యాక్టు మొదలు పెట్టాడు' 'అత్తయ్యా' అని సరోజ పిలిచేలోపునే ఆమె చుట్టూ ముచ్చటగా తిరిగి, మంచినీళ్ళు తెచ్చి, కొత్తగా నాన్న కొన్న బొమ్మల పుస్తకం తెచ్చి చూపించి ఒళ్ళో కూర్చున్నాడు ఆవిడ మాట్లాడుతూంటే అంతకుమించిన ఆనందం లేనట్టు ఆవిడ ముఖంలోకి చూస్తూ సంతోషపడిపోడం మొదలుపెట్టాడు 'ఎంత ముద్దుగా ఉన్నాడే నీ కొడుకు! అదృష్టవంతురాలివి' అంటూ ఉబ్బిపోయింది అత్తయ్య అసలు సంగతేమిటంటే 'అత్తయ్య' రాగానే చూశాడు ఆమె చేతిలో ఉన్న చాక్లెట్టు పెట్టె! అది కాస్త చేతులో పెట్టేదాకా ఇంత నటించాడు!

ఇటువంటి తత్వం ఒంట్లో జీర్ణించుకుని పుడతారు కొందరు పిల్లలు పొగడ్త, అతి ముద్దుగా మనలుకోవడం లాభదాయకం అని గ్రహించి, చేసిన తప్పుల నుండి తప్పించుకొందుకు, పని ఎగగొట్టడానికి తమకు లాభసాటి అయినవి సాధించడానికి ఆ అస్త్రాన్ని వినియోగిస్తారు ఎవరూ ఇది వాళ్ళకి నేర్పక్కలేదు

సాధారణంగా ఇలాంటి పిల్లలకి 'మామూలు' తెలివితేటలే ఉంటాయి కష్టపడి చదవడం వ్రాయడం కూడా ఎగ్గొట్టి అతివినయం నటించి ఇంట్లోనూ స్కూల్లోనూ కూడా నెగ్గుకు వస్తారు వీళ్ల ఎత్తులూ పై ఎత్తులూ గుర్తించడం కూడా కష్టం.

ఇలా తన సదుపాయం కోసం అతి ముద్దుగా ప్రవర్తించే తత్వం పిల్లలకు పోగొట్టాలి—లేకుంటే స్కూల్లో తోటి పిల్లలమధ్య బాధపడతారు పొగిడే ముద్దు నటించి ఇంట్లో పనినుండి, స్కూల్లో 'ఇంటిపని' నుండీ తప్పించుకో చూస్తారు. అందుకే ముద్దుదారి ముద్దుది క్రమశిక్షణ దారి క్రమశిక్షణది అన్న ధోరణి తల్లి అలవాటు చేసుకోవాలి. ఎంత మెడకి చేతులు చుట్టేసినా 'అలాగే కాని పోయి లెక్కలు చేసిరా' అని కాళ్ళు నేల మీద ఆన్చిన నాడు నెమ్మదిగా అర్థం చేసుకోవడం ప్రారంభిస్తాడు కుర్రాడు లేదా 'ఒరేయ్ పెద్దాడా నువ్వు చేసి పెట్టరా, పాపం నానిగాడికి లెక్క రాడం లేదుటా' అంటూ సపోర్టు చేస్తే అంతే ఇంక.

పెద్దయాక నలుగురిలోనూ హుందాగా నెగ్గుకు రావాలంటే మన పిల్లలకి మనం బాధ్యతలు నేర్పాలి వాటిని ఎలాగో అలాగ పక్కవాళ్ల మీదికి నెట్టేసేలా తయారు చెయ్యకూడదు స్కూల్లో, ఉద్యోగంలో, ఆఖరికి వైవాహిక జీవితంలో మనవాడు రాణించాలంటే— చిన్నతనం నుంచీ వాడిని ఒకరకం అదుపులో ఉంచాలి — లేకుంటే గోడమీద పిల్లిలాగా తయారై ఏదైనా పని చేయవలసి వచ్చేసరికి మురిపించేసో, ముఖం చాటుచేసో తప్పించుకుంటాడు!

మీరే చెప్పండి? కోడలు పిల్ల వచ్చాక 'మిమ్మల్నేం లాభం? మీ అమ్మగారి పెంపకాన్నవాలి!' అంటే ఎంత తలవంపు. 'సుశీ నీవే నా హృదయం, ఆ పుస్తెల తాడిలాతే అంటూ మైకంలో పడేసి పెళ్ళాం పుస్తెలు పేకాటకి తెమ్మంటాడు, అప్పుడు చెయ్యకలిగింది ఉండదు! అందుకే మొక్కగానే వంచాలి అనడం ●

వంటలు

## 'రొయ్యలతో-వడలు

రెండు గంటలు ముందుగా పావుశేరు సెనగపప్పు నీళ్ళలో, నానబొయ్యాలి వుల్లి, పచ్చిమిర్చి అల్లం, కొత్తిమీర సన్నగా తరగాలి పచ్చిరొయ్యలు వల్చి, శుభ్రంగా కడిగినవి సుమారు కప్పు వుండేలా చూసుకొని, చిటికెడు పసుపు, వుప్పువేసి కలిపి కుంపటిమీదపెట్టి, నీరు యిగిరిపోయేవరకువుంచి, దించెయ్యాలి సెనగపప్పు శుభ్రంగా కడిగి, రోట్లో వేసి రుబ్బుతో, పప్పు సగం నలిగాక, రొయ్యలు వేసి మరీ మెత్తగా కాకుండా రుబ్బి తీసుకోవాలి రుబ్బిన పిండిలో గరంమసాలాపొడి, వుప్పు, తరిగిన ముక్కలూ, రెండు కోడిగ్రుడ్లు కొట్టివేసి, అంతా సమంగా కలిసి నిమ్మకాయంత ముద్ద తీసికొని, అరిటాకు మీద వడమాదిరి చేసి, కాగిన నూనెలో

# వంటలు

వేసి, రెండు వైపులా దోరగా వేగనిచ్చి, తీయాలి. ఇవి భోజనములోకి మధ్యాహ్నం టిఫిన్‌కి కూడా చాలా బావుంటాయి

## రొయ్యల బజ్జీలు

బజ్జీలకు పెద్ద రొయ్యలే తీసుకోవాలి రొయ్యలు వల్చి శుభ్రంగా కడగాలి అల్లం, వెల్లుల్లి ముద్దనూరి , వల్చిన రొయ్యలు, సరిపడ వుప్పు, కారం, చిటికెడు పసుపు వేసి కుంపటి మీదపెట్టి, నీరు యిగిరి పోయేవరకు వుంచి దింపెయ్యాలి శెనగపిండిలో, ఒక గుడ్డు కొట్టిపోసి, వుప్పు, నీళ్ళు వేసి బజ్జీల పిండిలా కలిపి, ఒక్కొక్క రొయ్యని, శెనగపిండిలో ముంచి, కాగుతున్న నూనెలో వేసి, దోరగా వేగనిచ్చి, తీసుకోవాలి ఇవి కూడా మధ్యాహ్నం టిఫిన్‌కి బాగుంటాయి

## రొయ్యల వేపుడు

వుల్లి, పచ్చిమిర్చి పొడవుగా ముక్కలు తరగాలి అల్లం, వెల్లుల్లి, జీలకర్ర, యాలకాయలు, లవంగాలు, దాసిన చెక్క మెత్తగా ముద్దనూరి, శుభ్రంగా కడిగిన రొయ్యలు, నూరిన మసాలా ముద్ద, వుల్లి, పచ్చిమిర్చి ముక్కలు, వుప్పు, చిటికెడు పసుపు, కొద్దిగా నీళ్ళు చల్లి, కుంపటిమీద పెట్టి నీరు యిగర నిచ్చి, దింపాలి కళాయిలో, తగినంత నూనెవేసి, కాగాక, కొంచెం జీడిపప్పు వేసి, దోరగా వేగనిచ్చి, ఇగర బెట్టిన రొయ్యలు వేసి, సన్నసెగని, పది నిమిషాలు వేగనిచ్చి, కొత్తిమీర సన్నగా తరిగివేసి, దింపెయ్యాలి.

## రొయ్యల కుర్మా

అల్లం, వెల్లుల్లి, జీలకర్ర, యాలకాయలు, లవంగాలు, దాసిన చెక్క మెత్తగా నూరి వుంచుకోవాలి కొబ్బరి, గసగసాలు విడిగా నూరి వుంచాలి కూరకు సరిపడ పచ్చిమిర్చి, నేతిలో వేయించి, మెత్తగా ముద్దనూరాలి వుల్లిపాయలు సన్నగా తరుక్కోవాలి రొయ్యలు వలిచి శుభ్రంగా కడుక్కోవాలి కుంపటిమీద గిన్నె పెట్టి, మామూలు కూరల కంటె, మరికాస్త ఎక్కువ నూనెవేసి, జీడిపప్పు, యాలకాయలు, లవంగాలు, దాసిన చెక్క వేసి కాస్త వేగాక, వుల్లిపాయ ముక్కలు వేసి ఎర్రగా వేయించి, నూరిన ముద్ద వేసి, కొంచెం వేగనిచ్చి, రొయ్యలు, వుప్పు, పసుపు వేసి గరిటెతో కలిపి, అరగ్లాసు నీళ్ళుపోసి, మూత పెట్టాలి వో అయిదు నిమిషాలు అయాక కొబ్బరి, గసగసాల ముద్దవేసి, కాస్సేపు వుంచి దించెయ్యాలి ఇది భోజనంలోకే కాకుండా, గారెలు, బ్రెడ్‌లోకి కూడా బాగుంటుంది




## వేరుశనగతో- దోసెలు

వచ్చివి పావుశేరు వేరుశనగ గింజలు, పావుశేరు బియ్యం రాత్రి నీళ్లలో నానబోయాలి వుదయం శుభ్రంగా కడిగి, పచ్చిమిర్చి, జీలకర్ర వుప్పు వేసి మెత్తగా, దోసెల పిండి మాదిరిగా, రుబ్బి, పల్చగా దోసెలువేసి, రెండు వైపులా దోరగా, వేగనిచ్చి, తీయాలి ఈ దోసెలు మామూలు దోసెలకంటె, ఎంతో రుచిగా వుంటాయి.

చట్నీ — పది పచ్చి మిరపకాయలు నూనెలో వేయించి, చింతపండు, వుప్పు, పసుపు, చిన్న అల్లం ముక్క, కప్పు వేయించిన వేరుశనగ పప్పు అన్నీ కలిపి, మెత్తగా రుబ్బి, మినపప్పు, ఆవాలు కరివేపాకు పోపుపెట్టుకుంటే, యీ చట్నీ టిఫిన్ లలోకే కాకుండా భోజనంలోకి **కూడా** రుచిగా వుంటుంది

హల్వా — కప్పు గింజలు నీళ్ళలో (రాత్రి) నానబోసి వుదయం శుభ్రంగా కడిగి, మెత్తగా రుబ్బి, వుంచుకోవాలి కప్పు పంచదార లేతపాకం పట్టి, రుబ్బిన ముద్దపాకంలో వేసి, సన్నని సెగని, గరిటె కలుపుతూ , హల్వా ముద్దలా అవుతుండగా రెండు టేబుల్ స్పూన్ల నెయ్యి, యాలకుపొడివేసి, నెయ్యి రాసిన పళ్లెంలో వేసి సమంగా సర్దాలి. ద్రాక్ష, జీడిపప్పు నేతిలో వేయించి, పైన అద్ది, చల్లారాక మనకు కావలసిన షేప్‌లో ముక్కలు కోసుకోవాలి.

—కె విజయలక్ష్మి.

## కేసరి

ఒక కప్పు పంచదార
ఒక కప్పు రవ్వ
రెండు కప్పుల నీళ్ళు
రెండు స్పూన్ల అమ్మోలు పౌడరు
నాలుగు ఏలకులు
ఆరు జీడిపప్పులు
పది కిస్‌మిస్ పళ్ళు
ఒక గరిటె డాల్డా

రెండు కప్పుల నీళ్ళలో అమ్మోలుపౌడరు వేసి కలిపి పొయ్యిమీద పెట్టాలి బాగా మరుగుతున్నప్పుడు రవ్వ పోసి కలపాలి. పంచదార, జీడిపప్పు, కిస్‌మిస్ కూడా వేసి పదినిమిషాలు ఉంచి, దింపే ముందు ఏలకపొడి, డాల్డా వేయాలి పళ్ళానికి కొంచెము నెయ్యిరాసి గిన్నెలోని పాకము పళ్లెములో పోసి సైజులు చేసుకోవాలి

—బి. సీత ●

# ఆ స్వచ్ఛమైన మనోహరమైన తెల్లి తనానికి




లయన్ బ్రాండ్

## విక్టోరియా బ్లూ ఒఒబి (OOB)

(ప్రశస్తమైన ముదురు నీలం)

అవును, కొంచం విక్టోరియా బ్లూ ఒఒబి మీ తెల్ల బట్టలకు అద్భుతమైన ప్రత్యేకత నిస్తుంది! వాటికి మిఱుమిట్లు కొలిపే తెల్లి తనాన్ని చేకూర్చుతుంది. మీ చొక్కాలకు, చీరెలకు, దుప్పట్లకు అటివచ్చే విధంగా అదనపు తెలుపునిచ్చే పద్ధతి!



తయారుచేయువారు: అల్ట్రామరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్ అంబత్తూర్, మద్రాస్-53.

సోల్ సెల్లింగ్ ఏజంట్సు: కెంప్ డైస్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగి చెట్టి స్ట్రీట్, మద్రాసు-1.

VAPI:UP:2/68 TEL




ఊరివెలుపల కాలువగట్టుమీద, చింత చెట్టుక్రింద నల్లరాతిమీద కూర్చున్నాడు అన్న గోళ్లు గిల్లుకొంటున్నాడు కళ్ల వెంట నీళ్లు గారుతున్నాయి కాలువలో జలం ప్రవహిస్తూ వుంది అతని కాళ్లు వణుకుతున్నాయి పిచ్చిగా, ప్రవహించే నీటిని చూస్తున్నాడు వెనుక గుడిలో గంటలు వినబడుతున్నాయి తమ్ముడి ఆలోచనే గుండెలో పోటు పుట్టిస్తూ వుంది బాధకు తట్టుకోలేక పోతున్నాడు అన్న కళ్లు అప్రయత్నంగా చింతచిగురులు ఆకులు ఎండు డొల్లలు తొక్కుకొంటూ రాత్రి వానకు మెత్తబడి వున్న నేలలోకి దిగుతూ వుంది

కాలువ గట్టుమీదికి పశువులు తోలుకు వచ్చిన పిల్లలు–జీతగాళ్లు–అన్నను చూచి 'అదుగో రాక్షి!' అంటూ ఆనందంతో వెర్రిగా గగ్గోలెత్తిపోయారు.

వాళ్లంతా తనవైపే వస్తుంటే చూచిన అన్న ఊళ్లోకి పరుగు మొదలు పెట్టాడు తేపతేపకూ వెనక్కు చూస్తు న్నాడు. వెనుక వాళ్లు పరుగెదుతూ వస్తున్నారు.

వెనుకనుంచి పిల్లలు గొడ్లు మళ్లించే చేతికర్రలు విసిరివేశారు అవి అన్నకు తగలలేదుగానీ విపరీతంగా భయం కలిగించాయి.

ఊరి మొగదల పావిళ్ల ప్రక్క చాలా గడ్డివాములున్నాయి వాటిని చూడగానే అన్నకు ప్రాణం లేచివచ్చింది అతను రెండు పావిళ్ల మధ్యగా వెళ్లాడు అక్కణ్ణుంచి వెనుదిరిగాడు వాళ్లకు కనిపించకుండా గడ్డివాముల దగ్గరకుపోయాడు. మనిషి దూరేంత సందుకూడా లేని రెండు వాముల మధ్య చొరబడ్డాడు లోపలికిపోయి కదలకుండా, ముణగరదీసు కూర్చున్నాడు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గడ్డిపరకల గాలికి కదిలితే పచ్చినధ్వనిలో కలిసిపోతున్నాయి గడ్డి పరకలమించి జారి వాలుగయిదు నీటిబొట్లు అన్నమీద పడ్డాయి.

'ఏడిరీడు!'

'ఎక్కడరీడు!'

జీతగాళ్లు ప్రశ్నించుకొన్నారు అన్న కనిపించలేదు. వాళ్లు ఊళ్లోకి పరిగెత్తారు.

రాత్రి వానవల్ల నేలంతా రొచ్చుగా వుంది కర్మసాక్షి నిద్రలేచి రావలసిన సమయందాటి అప్పుడే పాలుదు గంటలయిపోయింది ముసురు పట్టినట్లుంది చెట్ల కొమ్మల మీంచి గాలి తోలితే నీటి బొట్లు పడుతూనే వున్నాయి

చిల్లకంపలమీద సాలెపురుగు గూటిమీద నిలచిన నీటిబొట్లు సూర్యకిరణాలు పడక పోయినా మెరుస్తున్నాయి రాత్రి చలి పుట్టి దుప్పటి కప్పుకొన్న ఊరు నిద్ర లేచి, కాలకృత్యాలు తీర్చుకొని మనిషిలాగా వుంది

నెలక్రితం పిక్‌నిక్‌కు వస్తూ కాలేజీ విద్యార్థులు అన్నను సామాన్లు మోసేందుకు వెంట తీసుకువచ్చారు నాలుగు రోజులక్రితం కాలువ గట్టుమీద దేవాలయం చూపించటానికి తమ్ముణ్ణి తీసుకు వచ్చాడు అన్న

రైలుదిగి వస్తూ సిగరెట్టు పీక కాల్చుకొని గాలిలోకి గువిగా పొగ వదులుతున్న అన్నవెంట తమ్ముడు చేతులు ఊపు కొంటూ నడుస్తున్నాడు

పొలంనుంచి వస్తున్నజీతగాడు వాళ్లకు

ఊరుగా వచ్చి 'ఎవ్వరు మరేది ?' ప్రశ్నించాడు అన్నచెబితే జీతగాడు అడిగాడు.

'సిగరెట్టిస్తా ?!'

'ఆఁ!'

'ఊఁ!'

అన్న జేబులోంచి సిగరెట్టు పీక ఒకటి తీసి ఇచ్చాడు

'కాల్చిం ద్దొద్దు!'

'అన్నీ యియ్యి!'

జేబులో చేయిపెట్టి సిగరెట్ పీకలన్నీ తీసి చూపించాడు రకరకాల సిగరెట్లు! అన్నీ సగం కాల్చినవే!

'ఎంగిలి పీకలు! ఎంగిలి పీకలు!'

జీతగాడు హేళన చేస్తున్నాడు

'ఎగతాళి చెయ్యొద్దు! ఆఁ! నే నసలే రౌడీని!'

జీతగాడు ఇంకా ఎక్కువ చేశాడు

'ఎంగిలి పీకల రౌడీ!, ఎంగిలి పీకల రౌడీ!'

'పోరా పుల్లాయ్! నీతో నాకేంది!'

'పుల్లాయ్ గిల్లాయ్ అనొద్దురోయ్ దొమ్మలు బగులుతాయ్!'

'ఏడిశావ్‌లే పోవోయ్ పుల్లాయ్!'

జీతగాడికి కోపం వచ్చింది గొడ్డుగాచే కర్రచాచి నెమర గంతమీద వేశాడు 'చచ్చాన్రోయ్!' అంటూ కూలబడ్డాడు అన్న తమ్ముడికి కోపంవచ్చింది రాయితీసుకు కొట్టాడు జీతగాడి తలచిట్లి రక్తం వచ్చింది రక్తం చూచుకొనేసరికి పళ్లు మండిపోయింది 'ఉండు నీపని జెబుతా!' అంటూ కర్రెత్తాడు కర్రదెబ్బ పడితే తమ్ముడు చచ్చిపోతాడని భయం ప్రాణ భయంతో అన్న అడ్డంపోయాడు పెద్ద దెబ్బలాట!

అన్నదమ్ములు తనని చంపేస్తారేమో నని భయంతో కర్రపారేసి ఊళ్లోకి పరుగెత్తాడు జీతగాడు

జీతగాళ్లు ఊళ్లో అన్నకోసం వెతుకుతున్నారు ఎటుపోయాడో ఎక్కడనక్కాడో తెలియలేదు ఎక్కడికి పోతాడు!! వెతుకుతున్నారు

గాంధీ బొమ్మదగ్గర సిమ్మెంటు గచ్చుమీద కూర్చుని పంచాంగం, వానలు, తొలకరి, పంటలు—అనేక సంగతులు చర్చించుకొంటున్నారు రైతులు

రెండు వాముల మధ్య ఇరుక్కొని కూర్చున్న అన్న వణికిపోతున్నాడు. జీతగాళ్లు ఒక ప్రక్కనుంచి వస్తే రెండో ప్రక్కకు పరుగెత్తవచ్చు. రెండుప్రక్కలా వస్తే ? అన్న వణికిపోతున్నాడు

ఆ భయంతో అకారణంగా మరోభయం తోడయింది రెండువాముల మధ్య పొడిగా వెచ్చగావున్న స్థలంలో హాయిగా ఉన్నాడు. ఎవరయినా వాములకు నిప్పుపెడితే! తల్లడిల్లి పోతున్నాడు,

పదమూడేళ్ల పూర్వం తను ఎక్కడ పుట్టాడో అమ్మ నాన్న లెవరో, ఊరుపేరు లేమిటో తమ్ముడు తన తమ్ముడు అవునో కాదో అన్నకు తెలియదు

లోకం తెలిసిందగ్గర్నుంచి తమ్ముడు తనతోనే వుంటున్నాడు ఇద్దరికీ ప్లాటుఫారం తల్లీ దండ్రీ ఇల్లూ వాకిలీ,

పంపులదగ్గర అన్నంమూటలు విప్పుకొని తినే పల్లెవాళ్లు పెట్టిన ముద్దలు, కేంటీన్‌లో టిఫిన్ తినేవాళ్లు వేసిన ఎత్తివేతలు, పారేసిన విస్తరలో మిగిలిపోయిన ముక్కలు, తిని వాళ్లు చనిపోలేదు

ప్లాటుఫారం ఫెన్సింగుక్రింద మునగదీసుకొనో, ఒవర్‌బ్రిడ్జి మూలల్లో ఒదిగో, వెయిటింగ్‌హాల్ బల్లలక్రింద నక్కో, క్లోక్‌రూం షెడ్ క్రింద ముడుచుకొనో, కాళీ వాగన్ల లోపలో, వాగన్‌షెడ్ వేళ్లమధ్య ఎక్కడో పడుకొని నిద్రపోయారు

అన్నం తిని పల్లెవాళ్లు పారేసిన గుడ్డముక్కలు ఉతుక్కొనీ, లైసెన్సు కూలీలను అడుక్కొనీ, ప్రయాణీకులకు యాచించీ, గుడ్డలు సంపాదించి చలికీ ఎండకీ ఒళ్లు దాచుకోగలిగారు

అన్నం తింటున్న పల్లెటూరి తల్లిని అన్నం అడిగితే, అన్నం అయిపోవటంవల్ల ఆమె, డబ్బులిస్తే—డబ్బులవల్ల తినేది కొనుక్కోవచ్చు నన్నజ్ఞానం ఏర్పడ్డతర్వాత, డబ్బులు అడుక్కోవటం ప్రారంభించారు

ఆ రోజు అన్నదమ్ములిద్దరూ సాయంకాలం వసూలయిన చిల్లరంతా ఒక్కచోట పోసి లెక్కపెట్టుకొంటుంటే, అంత కవిపెడుతున్న నల్లముఖం వాళ్ల దగ్గరకు వచ్చి చిల్లరంతా తీసుకొని జేబులో వేసుకొని నవ్వుతూ వెళ్లిపోయింది

అతనెవరో ఎందుకలా తీసుకుపోయాడో అర్థంకాక అన్నదమ్ములిద్దరూ వాటేసుకొని ఏడ్చారు ఆకలి కడుపులతో వెళ్లి అడుక్కోవటానికి వెళ్లారు

ప్లాటుఫారంమీద అడుక్కొన్న తిండి లాక్కుపోయేవాళ్లు బిచ్చగాళ్లు చిల్లర డబ్బులు గుంజుకు పోయేవాళ్లు రౌడీలు. చేతిలో తినుబండారాలు తన్నుకుపోయేకాకులు కాకుల మూకలు, కాకుల మూకలవంటి లోకులు అన్నకు బాగా తెలుసు

గార్డు బూటుకాలు, కూలీ చెప్పులేని కాలు, ప్రయాణీకుల చెప్పుకాలు అన్న వీపుకు తెలుసు గడియారాల చేతులు, ఉంగరాల చేతులు అన్న చెంపలకు తెలుసు. ప్రయాణీకుల తిట్లు, బిచ్చగాళ్ల బండబూతులు చెవులకు తెలుసు ఎందరి కాళ్లూ చేతులు అనురాగం చూపించాయో, శరీరంలో ఉన్న రక్తం రుచి చూచి, చూస్తూ కర్మసాక్షిలా వూరుకొంది

అన్నదమ్ములు బ్రతుకుతున్నారు ధర్మం చేసిన వాళ్ల అన్నం, డబ్బులూ, అధర్మం చేసినవాళ్ల దెబ్బలు తిట్లూ, తిండీ తిప్పలూ తింటూ బ్రతుకుతున్నారు అన్నకు బ్రతుకుమీద వెగటు పుట్టలేదు అంతకంటే వేరే బ్రతుకు ఉందని అతనికి తెలియదు అదే బ్రతుకని అన్న విశ్వాసం.

నాలుగేళ్ల క్రితం ప్లాటుఫారంమీద పుస్తకాలు పేపర్లు అమ్మే కుర్రాడుగా కుదిరాడు ఎన్ని అమ్మితే అంత వస్తూ వుండేది శ్రమపడి అమ్ముతూ వుండేవాడు

ఒకరోజు ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో కూర్చున్న పుణ్యాత్ముడు అన్నను పిలిచాడు పుస్తకాలు చూస్తున్నాడు ఆశతో ఉన్నాడు అన్న

ఆ వ్యక్తి సిగరెట్లు తీసుకురమ్మని రూపాయి ఇచ్చాడు అన్న సిగరెట్లు తీసుకొని తిరిగి వచ్చేసరికి రైలు బయలుదేరింది పరుగెత్తుతూ వెళుతూవుంటే ఫస్టుక్లాసు కంపార్టుమెంటు దూరంగా పరుగెత్తుతూ వెళుతూవుంది

'రైలుక్రిందపడి చస్తావేంరా!'

ఎవరో అన్నను పట్టుకొని ఆపారు.

అన్న తన్నుకులాడాడు

ఏమీ ఎరుగని నంగనాచిలా వయ్యారాలు పోతూ పోతూవుంది రైలు

వెళిపోయిన రైలువంక చూస్తూ, చేతిలో ఉన్న సిగరెట్లు, చేతిలో లేని పుస్తకాలు తలుచుకొని, గుండె తరుక్కుపోయి, ఆవురుమని ఏడ్చాడు అన్న.

# అన్న

పువ్వులాంటి తమ్ముణ్ణి పోషించుకుంటూ ఏడుస్తూ కాలం గడుపుతున్న అన్నకు మరో ఉద్యోగంవచ్చి ఏడ్పు పోగొట్టింది

గారెలు చక్రాలు బొండాలు రైలులో అమ్మేపని!

భుజంమీద పెట్టెపెట్టుకొని, నాలుగు ప్రక్కల గాజు పలకల్లోంచి కనిపించే 'తినుబండారాలు, పై చెక్కమూత తీసి, అమ్ముతూ, వచ్చిన డబ్బులు పెట్టెలో ఒకమూల వేసుకుంటూ రైలు పొడుగునా అరుచుకొంటూ అమ్ముతూ తిరిగేవాడు అన్న

రైలు వచ్చి ఆగింది అన్న త్వరత్వరగా అమ్ముతున్నాడు

ఎదురుగా ఎవరో పరుగెత్తుకొంటూ వస్తున్నాడు వెనుకనుంచి పోలీసులు 'పట్టుకోండి పట్టుకోండి' అని వెంట బడ్డారు

చూస్తూ వుండగానే ఎదురైనవాళ్ళను తప్పుకొంటూ వస్తున్న వ్యక్తి అన్నను పడేసి, జనాన్ని తోసేసి ఫెన్సింగ్, దూకేసి వెళిపోయాడు

అన్న లేచిచూస్తే భుజంమీద పెట్టె లేదు ప్లాటుఫారంమీద లేదు రైలు పట్టాకి ప్లాటుఫారంకి మధ్య పడివుంది

రైలు వెళిపోయాక చూస్తే, గాజు పలకలు పగిలిపోయి, తినుబండారాలు చెల్లాచెదురుగా, పట్టాప్రక్క మురికిలో చెత్తలో చెదర చెదరగా పడివున్నాయి డబ్బులు చిందర వందరగా పడిపోయాయి

అన్న వాటిని అలా చూస్తూవుంటే పేగుల్లో ఇనుపముళ్ళ గుదినంటిది ఉండలు చుట్టికపోయి, గుండెల్లోకి పోతున్నట్లయింది నెత్తిబాదుకొంటూ జుత్తు పీక్కొంటూ లబో దిబోమని ఏడ్చాడు

ఏడ్పు ఎవరూ వినకపోలేదు కేంటిన్ మేనేజర్ విన్నాడు నాలుగు తన్నాడు తగిలేశాడు

రాత్రి, క్రాసింగ్ బ్రిడ్జి మూలలో తమ్ముణ్ణి కడుపులోకి లాక్కొని ఆకలి మరచిపోయి ఏడుస్తూ పడుకొన్నాడు అన్న

మార్చినెలలో అన్న ఐస్ ఫ్రూట్లు అమ్మేపనిలో కుదిరాడు ఎన్ని ఎక్కువ అమ్మితే అంత ఎక్కువ డబ్బు వస్తుంది డబ్బులు పట్టి కడుపులో ఆకలి!

అప్పుడప్పుడు తమ్ముడికి ఒకటో రెండో ఇచ్చేవాడుగాని తను తినేవాడుకాడు

మార్కెట్టుదగ్గర, స్టేషన్ ముందు, బస్స్టాండులో ఐస్ ఫ్రూట్లు బాగా అమ్ముడుపోతాయి ఎప్పుడూ రీసెస్‌లో మాత్రం స్కూల్సుదగ్గర మంచి అమ్మకం

పదిరోజుల్నుంచి హైయర్ ఎలిమెంటరీ స్కూలు దగ్గర రీసెస్‌లో అమ్ముకొంటున్నాడు

అక్కడ చిన్నిఅంగడి పెట్టుకొని ఒక ముసలమ్మవుంది పెట్టె అంగడిలో రకరకాల చియతిళ్ళు వున్నాయి

సంవత్సరం పొడుగునా ఆమెకెంతో రాబడివుంటుంది అన్న అక్కడ ఐస్ ఫ్రూట్లు అమ్మకపోతే, ఆమెకు మరింత రాబడి వుంటుంది

'నువ్వుకూడా నాలాగా రోజంతా ఇక్కడే కూర్చుంటే కూర్చో! సరిగ్గా రీసెస్‌లో మాత్రం రావద్దు!' అంది ముసలమ్మ ఆమె మాట అన్న లెక్క పెట్టలేదు

నాలుగోనాడు, ముసలమ్మ కొడుకు పోలీసు కానిస్టేబుల్ వచ్చాడు అన్న దగ్గరకు వచ్చి, మునిగాళ్ళమధ్య డబ్బాపెట్టుకొని కూర్చున్నవాణ్ణి జుట్టు పట్టుకొని, పైకి లేవనెత్తి, డబ్బామూతతీసి, అప్పుడే బైటికివస్తున్న పిల్లల్ని పిలిచి 'తీసుకోండి' అన్నాడు.

అన్న గింజుకొన్నాడు. పిల్లలెవరూ రాలేదు ఒక్కడు ధైర్యంగావచ్చాడు ఐస్ ఫ్రూట్ తీసుకొన్నాడు అన్న ఏడుపుముఖం పెట్టాడు పిల్లలు బిలబిల లాడుతూ వచ్చారు చేతికి అందినన్ని తీసుకున్నారు వెళిపోయారు డబ్బా కాళీఅయింది

డబ్బామీద మూతలేదు డబ్బాలో ఐస్ ఫ్రూట్లు లేవు జేబులో డబ్బులులేవు జుత్తు పోలీసు కానిస్టేబుల్ చేతిలోవుంది పిల్లలు వెళుతున్నారు వాళ్ళతోపాటు ఐస్ఫ్రూట్లు వెళుతున్నాయి

మెదడులో ఏదో ఉండ చుట్టుకుపోతుంది! భూమి అంత గుండ్రని ఉండ! తలతిరిగి పోతూవుంది ఉండ ఉబ్బుతున్న బెలూన్‌లాగా అయింది కళ్ళుతిరిగిపోయాయి' ఆవురునువి నోరుతెరిచి, అమ్మని ఎరుగనివాడు, 'అమ్మా!' అంటూ ఏడుస్తూ కూర్చుండి పోయాడు ముక్కు గొంతుకలో అడ్డుపడుతున్నాయి. పెదాలు వణుకుతున్నాయి

'లే! లే ఇక్కడ! రేపు వచ్చావంటే చంపుతాను' కూర్చుండి పోయిన అన్నను బూటు కాలుతో తన్నాడు పి. సి

బూటుకాలు దెబ్బ దెబ్బేకాదు అటువంటి దెబ్బలెన్నో తిన్నాడు. వంటిమీద దెబ్బకంటే గుండెమీది దెబ్బకు బదులు లేక, ఖాళీడబ్బా తీసుకొని, ఏకాకిలా రోడ్డుమీద నడుస్తున్నాడు అన్న!

ఆరాత్రి, థర్డ్‌క్లాసు వెయిటింగ్ హాలులో మూలన తమ్ముణ్ణి కడుపులో దాచుకొని ఏడుస్తూ, సంగతంతా చెప్పి, 'నువ్వయితే అలాచేస్తావా' అని అడిగితే 'చేయను అన్నాడు' ఏమీ అర్థంకాని తమ్ముడు

ఆ రోజు వాన కురిసింది చిత్తడిగా వుంది ఈదురుగాలి చలి! వేలంతా బురద! రొచ్చు! రోత!

తమ్ముణ్ణి వదిలిపెట్టి ఎక్కడికిపోలేని అన్న దొంగతనంగా సామాన్లు మోస్తున్నాడు లైసెన్సు కూలీలతిట్లు దీవెనలుగా తింటున్నాడు

వంటిమీద పడ్డ నీళ్ళు తుడుచుకోకుండా నీళ్ళుగారి పోతూవుంది రైలు

ఒకపెట్టెలోంచి నవదంపతులు దిగారు, 'బాబు కూలీ! అమ్మ కూలీ!' అంటూ దగ్గరకు వెళ్ళాడు అన్న'

'ఈ సామాను మోస్తావా?'

'ఆఁ!'

నెత్తిమీద పెద్ద పెట్టె, దానిపైన బెడ్డింగు, చంకలో బుట్ట—అన్న దంపతుల వెంట నడుస్తున్నాడు పెట్టెలో పెళ్ళి ఉత్సాహమే వుందో, దాంపత్యమే దాగివుందోగాని బరువుగావుంది బరువుకు మెడ వూగిపోతూవుంది చేయి పీక్కుపోతూ వుంది

'త్వరగా నడవ్వోయ్!'

క్రొత్త పెళ్ళికొడుకు ఉత్సాహం కేక వేసింది

గేటుదాటి, హాలుదాటి, రిక్షాస్టాండ్ దగ్గరకువచ్చేసరికి అన్నకు తూలు వచ్చింది. తడినేలమీద కాలుజారింది. కూలబడ్డాడు.

మెలకువ వచ్చేసరికి, వెయిటింగ్ హాల ప్రక్క గోడవారగా పడుకొని వున్నాడు. లైసెన్సుకూలీ ఒకాయన ముఖంమీద నీళ్ళు

ఏల్చుతున్నాడు:

కళ్ళు తెరిచి చూస్తే సవదంపతులు లేరు. సామానులేదు డబ్బులులేవు మెడ మాత్రం కదలటంలేదు కాలిబొటనవ్రేలు చితికింది

లేచికూర్చుని చుట్టూ చూశాడు. ఏడుపు వచ్చింది. వెలుపలికి రాలేదు. ప్రేగుల్లో ఇటుకావ కాలుతూవుంది

ఇది అన్యాయం! ఇది బ్రతుకుకాదు ఇది జీవించటంకాదు ఇది చావుగాదు చావుబ్రతుతుల సంధికాదు. లోకంకాదు ధర్మంకాదు

ఎందుకీగతి? కొందరికే ఎందుకీ దురవస్థ? ఎందుకిలా అయిపోవాల? దీని హద్దెక్కడ?

ఇది సహజంకాదు ఇది స్టేషన్ గుండె పైన పుండు: లోకం కణతమీద కణితి!

ఎక్కడో దారం తెగింది ఇక్కడ మెడ నరాలేకాదు. ఏమయినా తెగుతాయి సృష్టి మాత్రం తిన్నగా సాగటంలేదు ఆ దారం ముడిపడింది చిక్కుపడింది తెగిపోయింది.

రాత్రి తమ్ముణ్ణి గుండెలకదుంకొని, మెడరాసుకొంటూ 'మనం ఇలాగేనా బ్రతకవలసింది? ఇలాగేనా? ఇలాగేనా?' అంటే 'అవును ఇలాగే!' అన్నాడు ఏమీ అర్థం కాని తమ్ముడు

లోకంలో ఎంతమంది పిల్లల్లేరు? అందరూ ఇలాగే బ్రతుకుతున్నారా? ఇలా కాదు బ్రతకవలసింది. మరోలా బ్రతకాలి! ఎలాగో తెలియలేదు

అనాథాశ్రమంలో కూడా వీళ్ళ దిక్కులేనివాళ్ళు అని చెప్పే దిక్కయినా లేకపోతే చోటులేదని తెలుసుకొన్న అన్న దేవుడే దిక్కనుకొన్నాడు

ప్రయత్నాలు విఫలమయి, ఆకలి అధికమయి, గూడువిడిచి పారిపోవాలనుకొన్న పక్షులు, గత్యంతరం లేక, మళ్ళీ గూటికి చేరుకొన్నాయి. స్టేషన్ జీవితం మళ్ళీ మామూలయింది

రౌడీకోసం వెతుకుతున్నారు జీతగాళ్ళు. పార్కులో కనిపించలేదు రేడియో గదిలోంచి వెలుపలికి వచ్చిన రైతు 'ఏందిరా గాడిదల్లారా ఈడ దిరుగుతున్నారు' అని ప్రశ్నించాడు.

జీతగాళ్ళు జవాబు చెప్పలేదు.

'మా జీతగాడేడి?'

కంచెలో రౌడీకోసం చూస్తున్నాడు.

'ఏందిరా నువ్వెతికేది?' రైతు అడిగాడు.

'ఏంలే!'

ఆ జీతగాడు నాలుగు రోజుల్నాడు అన్నదమ్ములతో తగాదా పడ్డాడు

'ఎదవకాన! ఏడాదిలిపెట్టా గొడ్డు! దున్నదిన్నట్టు తింటమేగానీ గొడ్డుమేపేదిలే! ఏ చేలోనన్నాబడితే బందిలొడ్డిలో బెడతారుపో! ఈడ గనపడితే మక్కెలిరగదంతా పోవేం!' కర్రతో రెండంటించాడు

జీతగాళ్ళు వెనుదిరిగారు

అన్నదమ్ములిద్దరూ, నాలుగురోజుల్నాడు, దేవాలయంలో కొబ్బరికాయ గొట్టి, ప్రక్కనున్న కాలువలో దిగాడు

అంతలో జీతగాళ్ళు గొడ్డు దోలుకు వచ్చి, జట్లుగా గట్టుమీద నిలబడ్డారు

'అడుగోరౌడీ! ఆళ్లె! ఆళ్లిద్దరే!'

దెబ్బలు,—ఉదయం స్టేషన్ దగ్గర,—చిన్నజీతగాడు చెప్పేడు.

'రండి! ఒడ్డుకురండిరా!!

జీతగాళ్ళు కేకేశారు

అన్నకు భయం కలిగింది

'వద్దురా! ఎక్కొద్దు! ఒడ్డెక్కొద్దురా! కొడతారు!'

తమ్ముడు భయపడిపోయాడు

కాలువలో క్రొత్తనీరు ముమ్మరంగా వస్తూవుంది

వాళ్ళింతకి ఒడ్డెక్కలేదు జీతగాళ్ళె రాయి విసిరాడు అందరూ రాళ్ళు విసురుతున్నారు అన్నదమ్ములకు తగులుతున్నాయి.

రాళ్లదెబ్బలు తప్పించుకోవాలంటే నీళ్లలో మునిగి వుండాలి నీళ్ళలో మునిగి ఇక్కడనుంచి పోయి అక్కడతేలటం వాళ్ళకు చేతగాదు ఈతరాదు!

రాళ్లదెబ్బలుతప్పుకోవటంకోసం తమ్ముడే వెనక్కు వెళుతున్నాడు కాలుకు నేల అందటంలేదు కాలువ జోరుగా పోతూవుంది

పట్టణంనుంచి వస్తున్న సుబ్బారావు సైకిల్‌తో కాలువ వంతెనమీదకు వచ్చాడు

మనిషి బాగాలావు ఎప్పటికయినా భార్య మగ పిల్లవాణ్ణి కనకపోతుందా అనే ఆశతో తొమ్మిదిమంది ఆడపిల్లలకు తండ్రి అయ్యాడు

సుబ్బారావు కూర్చుంటే సైకిల్ సటపటలాడుతుంది జట్కాగుర్రం సకిలించినట్లు మూలిగికాని సైకిల్ ముందు చక్రం ముందడుగు వేయదు అతనంటే ఊళ్లో అందరికీ అలుసు అతనిదగ్గర వడ్డీకితీసుకొన్నడబ్బు కోర్టు వ్యవహారం లేకుండా ఎవరూ ఇవ్వరు జీతగాళ్ళు అతన్ని చూశారు మామూలుపాట ప్రారంభించారు

సుబ్బరావు! సుబ్బరావు!
మబ్బరావు! దుబ్బరావు!
సుబ్బరావు! సుబ్బరావు!



# అన్న

సుబ్బారావు ! డబ్బారావు!

డబ్బురావు ! మబ్బురావు !

మబ్బురావు ! దిబ్బరావు !

మబ్బరావు ! దిబ్బరావు !

డబ్బురావు ! మబ్బురావు !

జీతగాళ్ళు రాళ్ళు విసురుతూ ఎగ రటం ప్రారంభించారు అతను పరిస్థితి గమనించాడు. వంతెనమీద సైకిల్ ఆపి, 'ఆగండ్రా గాడిదల్లారా' అంటూ వస్తు న్నాడు

కాలువలో తమ్ముడు కాలు నేలమీద ఆనక 'అన్నా అన్నా !' అన్నాడు

అన్న చేయి అందించాడు అందలేదు చివరిసారి రాళ్లవర్షం నీటిమీద జోరుగా కురిసింది కాలువనీళ్ళు చిందరవందరగా లేచాయి తమ్ముడికోసం లోపలికి పోతు న్నాడు నేల తగలటంలేదు తమ్ముడు అందలేదు 'అన్నా ! అన్నా !' వినిపిం చింది సరీగ్గా చూస్తే తమ్ముడు కని పించలేదు అన్నకు ఏడుపు వచ్చింది నోట్లోకి నీళ్ళుపోయాయి తమ్ముడు ప్రవా హంలో కొట్టుకు పోతున్నట్టు కనిపించి నట్లయింది ఎవర్రా అది ఏదో కేక ఏమీ వినిపించలేదు

అన్నకు స్పృహ వచ్చేసరికి సుబ్బారావు ఇంట్లో వున్నాడు

'తమ్ముడేడి ?'

'ఉన్నాళ్లే !'

'ఏడ ?'

'పక్కింట్లో ఉన్నాళ్లే'

అన్న పూర్తిగా కోలుకొన్న తర్వాత కూడా తమ్ముడు కనపళ్లేదు

అన్న ఏడవలేదు ఆకాశంలోకి చూశాడు అక్కడా ఏడ్పులేదు

'అన్నా !, అన్నా!' అన్న ధ్వని తప్ప మరేమీ వినిపించటంలేదు

నాలుగు రోజులు సుబ్బారావు ఇంట్లోనే అన్న ఉన్నాడు

ఇంక ఉండ బుద్ధి పుట్టలేదు వెళ్లి పోవాలనిపించింది

ఉదయమే వెలుపలికి వచ్చాడు కాలువ గట్టుమీద చింత చెట్టుక్రింద కూర్చుని తదేకధ్యానంగా చూస్తూ వుండిపోయాడు

గడ్డివాముల మధ్య ఏదో అలికిడి అయింది

అన్న కళ్ళు కప్పిచూశాడు. కళ్ళు పెద్దవి చేసుకొని చూశాడు. అదిరి పోయాడు పాము ! చుట్ట చుట్టుకొని పడుకొనివుంది.

ఒక్క ఉదుటనలేచి వెలుపలికి వచ్చాడు సావిళ్ళుదాటి డొంకలోకి వచ్చాడు

అప్పటిదాకా వెతికి తిరిగి వస్తున్న జీతగాళ్ళు అన్నను చూశారు

'అదుగో రౌడీ !' అరిచారు.

జీతగాళ్లను చూచేసరికి గుండె ఆగి పోయినంత పనయింది

దూరంగా రైలుకూత వినిపించింది.

అడ్డబాటన స్టేషన్వైపు పరుగెత్తు తున్నాడు

స్టేషన్ ప్రక్క ఎడ్లబళ్ళు పోయేం దుకు వీలుగా గేటువుంది అక్కడకు వచ్చాడు

వెనుకనుంచి జీతగాళ్ళు — పిల్లలు ! ముందునుంచి-స్కూలుకు పోయి తిరిగి వస్తున్న పిల్లలు—ముందువెనుకల పిల్లలు! మధ్యలో పిల్లవాడు— అన్న

'పట్టుకోండి! పట్టుకోండి!'

వెనుకనుంచి అరుపులు! ముందునుంచి పిల్లలు!

ఫర్లాంగుదూరంలో స్టేషన్. అక్క ణ్ణుంచి బైలుదేరిన గూడ్సు వేగం పుంజు కొంటూ వుంది ఇటునుంచి పట్టణం పోయే రైలు వేగం తగ్గించుకొంటూ వస్తూవుంది

అటుప్రక్క బడిపిల్లలు నిలబడి పోయారు ఇటుప్రక్క జీతగాళ్ళు ఆగి పోయారు మధ్యలో—గేటు తోవలో అన్న!



అటు బడిపిల్లలు! ఇటు జీతగాళ్ళు! అటు గూడ్సు! ఇటు రైలు! మధ్యలో— సమాంతరంగా అన్న!

పరిస్థితి పరికించాడు. తలవంకిం చాడు నిలబడిపోయాడు అటు పట్టాలు! ఇటు పట్టాలు! అటు గూడ్సు! ఇటు రైలు!

రైలు తన పట్టాలమీద తాను వస్తూ వుంది గూడ్సు తన పట్టాలమీద తాను వెళుతూ వుంది బడిపిల్లలు జీతగాళ్ళు తమ తమ తావుల్లో ఆగిపోయారు అన్న తనస్థలంలో తానున్నాడు. లోకంలో అంద రికీ అన్నింటికీ స్థలం వుంది! తనకు? ఉందా ?— లేదా ?

అన్న అటు పోబోయాడు గూడ్సు ఇంజన్ గేటులోకి వచ్చేసింది ఇటు పోబో యాడు రైలింజన్ వచ్చేసినట్లయింది.

గేటులో ఇంజన్లు!

పిల్లలు బిళ్ళంగోడు ఆడుకొంటారు దేవుడు ఆడుకొంటే వింత!

శత్రువు బుల్లెట్లు తప్పించుకొనేం దుకు ఏదో షీల్డ్ దొరుకుతుంది విధి బుల్లెట్ ?

జీవన సంగ్రామంలో రైలో గూడ్సో యమదూత అయినా అవుతాయి, బుల్లెట్ల బారినుంచి రక్షించే షీల్డులు అవ్వా అవుతాయి

గూడ్సు ఇంజన్ చక్రాలు వేగం పుంజు కొంటున్నాయి కటకటలాడుతున్నాయి

రైలింజన్ చక్రాలకు బ్రేకులు పడు తున్నాయి కటకటలాడుతున్నాయి

గేటులో నాలుగు రైలుపట్టాలమీద రెండు ఇంజనులు రెండు తోవలకు వెళి పోతున్నాయి

ఒకచక్రం అటు పోతూవుంది ఒక చక్రం ఇటు పోతూవుంది. చక్రంప్రక్క చక్రం! చక్రం తర్వాత చక్రం

పట్టాలమీద చక్రాలు అతి తేలికగా సునాయాసంగా నిర్భయంగా దొర్లి పోతున్నాయి

చక్రం! ఇంకో చక్రం! మరో చక్రం! చక్రాలు! చక్రాలు!

గూడ్సు పూర్తిగా గేటుదాటింది!

రైలు స్టేషన్దాకా వెళిపోయింది!!

అన్న ?

# ఏ భాష మాట్లాడాలి?



ధర్మపథం

ఋషు వేంకటరమణయ్య

హనుమంతుడు అశోక వనంలో ప్రవేశించిన తర్వాత అతనికి ఒక సందేహం కలిగింది 'సీతాదేవి కన్పడిన తర్వాత ఆమెతో ఏ భాషలో మాట్లాడాలి?' అని

హనుమంతుడికి జనులందరూ మాటలాడుకునే మానుష భాషా – (వ్యవహార భాష) తెలుసును పండితులు మాట్లాడుకునే సంస్కృత భాషా తెలుసును ఒక వేళ ద్విజాతివలె సంస్కృతంలో మాట్లాడితే ఆమెకు అనుమానం కలుగుతుంది 'ఈ వచ్చిన వాడు నిజంగా వానరుడు కాదు రావణుడే ఇలా రూపంతో వచ్చి మాట్లాడుతున్నాడు' అని ఆ అనుమానం వల్ల భయపడి, ఆమె అతన్ని నమ్మక పోవచ్చు అతని మాటలవల్ల ఊరట కలగక పోవచ్చు ఆ కారణం చేతనే హనుమంతుడు ఆమెతో అందరూ మాట్లాడుకునే సామాన్య భాషలోనే మాటలాడుటకు నిశ్చయించాడు ఈ విషయమే రామాయణం సుందరకాండ ముప్ఫయ్యో సర్గలో

'యది వాచం ప్రదాస్యామి
ద్విజాతిరివ సంస్కృతామ్,
రావణం మన్యమానామాం
సీతా భీతా భవిష్యతి.
అవశ్యమేవ వక్తవ్యం
మానుషం వాక్య మర్థవత్,
మయాసాంత్వయితుం శక్యా
నా వ్యథేయ మనిందితా'

అని కానవస్తుంది. ఈ శ్లోకాలను బట్టి సీతాదేవి చదువుకున్నదనీ, ఆమెకు సంస్కృత భాష బాగా తెలుసుననీ గ్రహించాలి ఆ కాలంలో స్త్రీ విద్యకు ప్రాముఖ్యం వుండేదని కూడా ఊహించవచ్చును.

హనుమంతుడు ఉత్తర, దక్షిణ భారత దేశాలకు మధ్యదేశం వాడు అతడు మాటలాడే సామాన్యభాష యావద్భారత వాసులకూ అర్థమవుతున్నదంటే అందరూ సర్వసాధారణంగా ఉపయోగించే భాష ఒకటి వుండేదని తెలుస్తున్నది

పూర్వం భరతఖండం ఛప్పన్న దేశాలుగా – అంటే ఏభైయారు దేశాలుగా విభజింపబడి వుండినది ఇప్పుడు వాటి పేర్లు కూడా మరిచిపోయాం కాని వివాహాదుల్లో మహాసంకల్పం చెప్పేవారికి మాత్రం ఆ పేర్లు తెలుస్తాయి ప్రతి ప్రాంతానికీ ప్రాంతీయ భాష ఒకటి వున్నా, జనసామాన్యం మొత్తంగా వాడుకునే భాష కూడా వుండడం వల్ల ఐక్యతకు భంగం వుండేదికాదు. భాషాద్వేషానికి ఏ మాత్రమూ అవకాశం వుండేదికాదు.

హనుమంతుడికి సంస్కృత భాషకూడా బాగా వచ్చునంటే ఆ కాలంలో జనులు అనేక భాషలు నేర్చుకునే వారనీ, మంచి వ్యవహార జ్ఞానం కలవారనీ తెలుస్తుంది. అనేక భాషలను అభ్యసించడంలో వారికి ఉత్సాహం వుండేది. ఏ ప్రాంతానికి వెళ్ళినా వారికి చిక్కు వుండేదికాదు సమయానుకూలంగా ఆయా భాషలు మాటలాడుతూ తమ పనులు ముగించుకునేవారు. అర్జునుడు పాంచాల రాజపుత్రికతోపాటు పాండ్యరాజ పుత్రికనూ, అసాం ప్రాంతంలోని నాగరాజ పుత్రికనూ వివాహమాడడం భాషా సమైక్యాన్ని తెలుపుతూనే ఉన్నది.

మహాత్మాగాంధీ వంటి మహానాయకులు బహుభాషా వేత్తలయి ఉండడం వల్ల జనులందరి మన్ననలు పొందగలిగారు దేశాభ్యున్నతికి మార్గం చూపారు దేశసేవ చెయ్యడానికి అనువైన పద్ధతులలో అనేక భాషలు ఎరిగి వుండడం ఒకటి! ●



# పెద్దకథ ప్రారంభం!

## విడిన మబ్బుతెరలు

[పెద్దకథ]




"అమ్మా!" ఆకలేస్తోందమ్మా! కొంచెం అన్నని పెట్టమ్మా! జాలిగా అడుగుతున్న కొడుకుం చూస్తూ అలానే ఉండిపోయింది జానకమ్మ. ఆమెకేం చేయాలో తోచటం లేదు మూటముాడు డిగ్రీల జ్వరంతో ఒళ్ళు పేరిపోతూంది కళ్ళు జ్యోతుల్లా పెరిగిపోతున్నాయి బక్కచిక్కిన శరీరంతో, మంచాని కంటుకుపోయిన కొడుకుని చూస్తుంటే, ఆమె కడుపు తరుక్కుపోతోంది. ఆకలితో అలమటిస్తున్న కొడుక్కి అన్నమెలా పెడుతుంది? అదీకాక ఇంతవరకూ పొయిలో పిల్లి లేవనేలేదు "రాధ రావాలి! ఏదన్నా తెస్తే ఇపుడు వండాలి అయినా జ్వరపు పిల్లడికి అన్నం పెడితే ఇంకా ఏమన్నా ఉందా? ఆలోచిస్తూ .. అపుడపుడు గుమ్మం కేసి చూస్తోంది జానకమ్మ

అమ్మ తన మాట వినిపించుకోవటం లేదని .. "అమ్మా! అక్క ఇంకా రాలేదా?" అని అడిగాడు వేణు, తల్లి ముఖంలోకి చూస్తూ

"లేదు బాబూ! డాక్టరిగారి కోసం వెళ్ళింది. ఆయన వస్తే సరేసరి! లేకపోతే, నీవు అన్నం తివచ్చో, లేదో, అడిగి వస్తుంది' బియ్యం లేవని చెబితే, కొడుకు బాధపడుతాడనీ, ఏదో విధంగా అతన్ని మరిపించాలని ఆతల్లి ఆశ

అమ్మ చెప్పిన మాట నిజమో, అబద్ధమో, ఆ కొడుక్కి బాగా తెలుసు అందుకే అమ్మని మరి బాధ పెట్టలేక, ప్రక్కకు తిరిగి కళ్ళు మూసుకుని పడుకున్నాడు వేణు

కొడుకు అటుతిరిగి పడుకోగానే నెమ్మదిగా లేచి వచ్చి వీధి గుమ్మంలో నిల్చుంది, రాధ కోసం ఎదురు చూస్తూ జానకమ్మ

ఆకాశమంతా, కారుమబ్బులతో నిండిపోయి, పగలే రాత్రిగా చేసేటంత భయంకరంగా తయారయింది అపుడపుడు గుండె లదిరిపోయేటట్లుగా ఉరుము లురుముతున్నాయి ఈదరగాలి కిటికీ తలుపుల్ని అదరగొట్టేస్తోంది

ఆకాశంలానే జానకమ్మ మనసు కూడా కారు మేఘాలతో నిండి అల్లకల్లోలంగా తయారయింది

ప్రొద్దుటనగా వెళ్ళిన రాధ ఇంకా ఇంటికి చేరలేదే! ఎక్కడెక్కడ తిరుగుతుందో, ఏమో! ఆఫీసు టైము కూడా అయిపోతోంది త్వరగా ఇంటికి వస్తే బాగుండును పిచ్చిపిల్ల! ఆనందంగా గడపవలసిన ఈ వయసులో బరువంతా మీద పడిందాయె! ఏమిటో! ఎపుడు తీరతాయో, ఈ ఇక్కట్లు? కూతురి కోసం ఎదురు చూస్తూ . గుమ్మంలోనే చతికిలబడింది జానకమ్మ

తడబడే అడుగులతో, చకచకా నడుస్తోంది రాధ అపుడపుడు ఆకాశం వంక చూస్తూంది. సన్నగా చినుకు ప్రారంభమైంది చేతిలో ఉన్న సంచిని గట్టిగా పట్టుకుని గబగబా నడుస్తూ ఆలోచిస్తోంది రాధ

ఆఫీసు టైము అయిపోయింది నిన్న కూడా, ఆఫీసుకు లేటయిపోయింది నిన్న తన అదృష్టం బాగుండ బట్టి బాస్ ఏమీ అనలేదు ఈ రోజు మటుకూ .. చివాట్లు తప్పవు ఇంకా ఇంటికెళ్ళి బియ్యం అమ్మకివ్వాలి! అమ్మ వండాలి! ఎంత లేదన్నా ఇంకో గంటన్నా పడుతుంది వేణూ ఏం గొడవ పెడుతున్నాడో, ఏమో! అన్నం పెట్టమని. ఈరోజు నిద్ర మంచం మీద మంచే లేచాడు ఆక

లంటూ, పాపం! అమ్మ మటుకూ, పీంచేస్తుంది! (ఇంట్లో ఏం లేందే! పైగా జ్వరం కూడా వచ్చింది! పాపం! ఎలా తింటాడూ? పోనీ రొట్టె కొనుక్కొడితే ఈ ఆలోచన రాగానే చేతిలో ఉన్న డబ్బులు చూసుకుంది రాధ సరిగా అర్ధరూపాయి మిగిలింది మరోసారి ఆకాశం వంకకు చూసి చకచకా నడుస్తూ ప్రక్క మలుపు తిరిగి, అక్కడే ఉన్న మిఠాయి దుకాణంలోకి వెళ్ళింది రాధ అర్ధ రూపాయి ఇచ్చి ఒకరొట్టె తీసుకుని, ఇంటికి బయలుదేరింది ఇంతలో, జోరున వాన కురువసాగింది 'ఎలా ఇంటికి చేరేది?' ఆలోచిస్తూ. ఆగిపోయిన ఆమెను చూచి "లోపలకు రావమ్మా! వాన వెలిశాక వెడుదువు గాని!'' అన్నాడు మార్వాడీ లోపలకు వచ్చి, ఒక ప్రక్కగా నిలుచుంది రాధ, వచ్చేపోయే వారిని చూస్తూ.

'హల్లో! రాధా మీరిక్కడున్నారేం?' అన్న మాట విని ఉలిక్కిపడింది రాధ అపుడే కారు దిగి లోపలకు వస్తున్నాడు డాక్టర్ సుధాకర్! తన బాస్ ఫ్రండ్, అతన్ని ఒకసారి ఆఫీసులోనే చూచింది బాస్ పరిచయం చేశారు అంతే! అపుడు చూడటమే అతన్ని! ఇంత చనువుగా పలుకరిస్తాడేమిటీ? అనుకుంటూ అతని వైపు చూసింది రాధ

'ఏదన్నా పని మీద వచ్చారా?' లోపల కొచ్చి అడిగాడు సుధాకర్

'అవునండీ! మా తమ్ముడికి జ్వరంగా ఉంటే బ్రెడ్ కొనుక్కెడదామని వచ్చాను' అంది రాధ ముక్తసరిగా

"అరరే! జ్వరమెప్పటి నుంచీ! మీ ఫామిలీ డాక్టరున్నారా?' ఆత్రంగా అడుగుతున్న అతన్ని చూచి మనసులో మరింత విసుక్కుంది రాధ

ఫామిలీ డాక్టర్! తమకా అదృష్టం కూడామా తేరగా పెట్టించిన గవర్నమెంటు హాస్పిటలూ అందులో పోసే ఎర్రనీళ్ళూ తమకు గతి! ప్రయివేటు డాక్టర్ని పెట్టుకునే స్తోమతుందా తమకు ? అయినా ఎవరు చూస్తే తనకెందుకూ? ఒక్కసారి పరిచయ మవగానే ఏమిటో ఆ చనువు? తన దారిని తను పోకూడదూ? యక్ష ప్రశ్నలు వేయకుండా! ఆలోచిస్తున్న ఆమెను చూచి 'ఏం? నా ప్రశ్నకు జవాబు చెప్పలేదేం?' అన్నాడు సుధాకర్

"అబ్బే! ఏముందండీ! ఏదో మామూలు జ్వరమేగా! అంతగా ఎక్కువయితే సాయంత్రం హాస్పిటలుకి తీసుకెడతాను అంతమాత్రానికే డాక్టరెందుకూ!' అంది రాధ లేని నవ్వు తెచ్చుకుంటూ

"భలేవారే ! వర్షం వెలవలేదు కదా! మిమ్మల్ని డ్రాప్ చేసినట్లూ ఉంటుందీ! మీ తమ్ముడిని చూసినట్లూ ఉంటుంది!' అని ఆమె సమాధానానికి ఎదురు చూడకుండా, కారు వెనకడోర్ తీసి నుల్చున్నాడు సుధాకర్

ఇంక ఏమీ చెయ్యలేక, మాట్లాడకుండా వెనక సీట్లో కూర్చుంది రాధ నెమ్మదిగా డ్రైవ్ చేస్తూ ఆమెనేమిటో అడుగుతున్నాడతను కానీ అతనడిగేదేమి ఆమెకు వినిపించటంలేదు ఆమె మనసంతా ఇంటి మీదే ఉంది అమ్మ ఏమనుకుంటుందీ? పరాయి మొగాడితో కార్లెక్కి షికార్లు కొడుతోంది! అనుకోదూ! అబ్బే! అమ్మ ఎపుడూ అట్లా అనుకోదు. అమ్మకు తన మనసు తెలియదూ! తన కోసం ఎదురు చూస్తూ ఉంటుంది. వేణు ఏడ్చి ఏడ్చి పడుకునుంటాడు పోన్లే! సమయానికి దేముడల్లే వచ్చాడితను లేకపోతే తను ఎప్పటికి చేరేదో ఇంటికి ఆలోచనల్లో మునిగిన ఆమె "మీ ఇల్లేదీ!''అన్న సుధాకర్ మాటలకు ఈ లోకంలోకి వచ్చింది అపుడే తమ వీధిలోకి వచ్చేసింది కారు ఆరోజు యధాలాపంగా తమ వీధి పేరు తెలుసుకున్నాడతను

"అదిగో! ఆ పెద్దజాజి పందిరి లేదూ! అదే మా ఇల్లు " అంది రాధ కారు వారి ఇంటి ముందాగింది

రాధ కోసం ఎదురు చూస్తున్న జానకమ్మ, తమ ఇంటి ముందర కారు ఆగడం చూచి లేచి నుల్చుంది

ముందుగా కారు దిగిన కూతుర్ని చూచి తెల్లబోయింది జానకమ్మ

"రండి! డాక్టరుగారూ!''అని తను ముందుగా లోపల కెళ్ళింది రాధ

జానకమ్మ హడావిడిగా లోపల కెళ్ళి ఇంట్లో ఉన్న ఒక్క కుర్చీ గుడ్డతో తుడిచి వేణు మంచానికి దగ్గరగా వేసింది ఆమె మనసు కూతురి పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. తనతో, వేణుని మరపించేందుకు అన్నమాట అక్షరాలా నిజమైంది వేణూ కోసం రాధ డాక్టరుని తీసుకొచ్చింది పిచ్చిపిల్ల! దాని కెంత ప్రేమో తమ్ముడంటే! రాల బోతున్న కన్నీటిని కొనగోటితో తుడుచుకుంది జానకమ్మ

"లోపలకు రండి బాబూ! ఇలా కూర్చోండి!" అని కుర్చీ చూపిందామె నెమ్మదిగా లోపలకొచ్చి కూర్చున్నాడు సుధాకర్ వేణు నిద్రపోతున్నాడు జానకమ్మ సుధాకర్ని పరీక్షగా చూస్తోంది

పచ్చగా దబ్బపండు చాయ ఆరడుగుల విగ్రహం నొక్కుల జుట్టూ, తెల్లని బట్టలతో రీవిగా కుర్చీలో కూర్చున్న అతను ఆమె కంటికి తన పాలిట భగవంతునిలా కనుపించాడు ఏ తల్లి కన్నబిడ్డో! అదృష్టవంతురాలు అలాంటి కొడుకు ఒకడుంటే చాలు! కన్నతల్లి మనసులో పన్నీరు చల్లటానికి 'అమ్మా!' అన్న రాధ పిలుపు విని నెమ్మదిగా లోపల కెళ్ళింది జానకమ్మ

'చూడమ్మా! కొంచెం టీకి నీళ్ళు పెట్టు! నేను రమణత్తా వాళ్ళింటి కెళ్ళి కాసిని పాలు తెస్తాను ఆయన కూర్చున్నారా?' అంది రాధ

"ఆ కూర్చున్నారు కానీ, నువు త్వరగా రా ఆయన్ను ఒక్కర్నీ కూర్చో బెట్టటం బాగుండదు' అని వంటింట్లోకి వెళ్ళిపోయింది జానకమ్మ.

మంచం దగ్గర కొచ్చి ఒకసారి వేణూ ముఖంలోకి చూచి తిరిగి కుర్చీలో కూర్చున్నాడు సుధాకర్

కాసేపట్లో రెండు చేతుల్లో రెండు కప్పుల టీ, తెచ్చి ఒకటి సుధాకర్ కిచ్చి రెండోది వేణు కిచ్చేందుకు అతన్ని లేపింది రాధ

నెమ్మదిగా, ఇటు తిరిగి "వచ్చావా? అక్కా! ఆకలేస్తోందే! అమ్మనడిగితే అన్నం తినకూడదం దక్కా!'' అన్నాడు వేణు సుధాకర్ని చూడకుండా.

బ్రెడ్ తెచ్చాను వేణూ! ముందు కొంచెం టీ త్రాగు! అమ్మ రొట్టె కాలుస్తోంది. తిందువుగాని! అంది రాధ.

"నెమ్మదిగా మంచం మీద కూర్చుని టీ త్రాగేందుకు తలెత్తిన అతను సుధాకర్ను చూచి. ఎవరో అర్థం కాక అక్క ముఖంలోకి చూచాడు ప్రశ్నార్థకంగా.

"డాక్టరుగారు వేణూ! నిన్ను చూచేందుకు వచ్చారు '' అంది రాధ.

"నమస్కారం డాక్టరు గారూ!'' వినయంగా రెండు చేతులూ జోడించాడు వేణు

ప్రతి నమస్కారం చేసి .. "ఇపుడెలా ఉంది బాబూ! నీ ఒంట్లో' ప్రేమగా అడిగాడు సుధాకర్.

"గుండెలు మండుతున్నాయి డాక్టరుగారూ ! ఆకలో. మరేమిటో చెప్పలేకుండా ఉన్నాను ఏదో చెప్పలేని బాధ ఒక్కోసారి కడుపులో నొప్పి కూడ వస్తోంది " నీరసంగా సమాధానం చెప్పాడు వేణు.

"ఎన్నాళ్ళ నుంచి వస్తోందమ్మా.. జ్వరం?" జానకమ్మను అడిగాడు సుధాకర్

"పదిహేను రోజుల నుంచీ బాబూ! అయినా.. అంతో ఇంతో అని తిరుగుతున్నాడు మరీ నాలుగు రోజుల నుంచీ మూసిన కన్ను తెరవటంలేదు. ఈరోజు కాస్త కళ్ళు తెరచాడు లేచిన దగ్గరనుంచీ ఒకటే గొడవ అన్నమో రామచంద్రా అని ఏం చెయ్యనూ! ఒట్టి మొండిఘటం '' కొడుకువంక ఆప్యాయంగా చూస్తూ.. అంతా వివరించింది జానకమ్మ

"వేణూ కెన్ని సంవత్సరాలండీ!'' అడిగాడు సుధాకర్

"పదిహేడు వెళ్ళి పద్దెనిమిది వస్తుంది రేపు మార్చికి '' నెలతోసహా వివరంగా చెప్పింది జానకమ్మ.

వేణూ పల్స్ చూచి. "సరేనమ్మా! రెండు గంటల కోసారి టెంపరేచర్ చూచి నోట్ చేయండి మందు పంపిస్తాను మళ్ళీ సాయంత్రం వస్తాను. అన్నట్లు మీరు ఆఫీసు కెళ్ళరూ! మరి! ' రాధకేసి తిరిగి అడిగాడు సుధాకర్

"వెళ్తాను! ఇప్పటికే లేటయిపోయింది " అంది రాధ

'అదేమిటే! అన్నం కూడ తినలేదు ఈ ఒక్క రోజూ సెలవుపెట్టు' అంది జానకమ్మ కంగారుగా.

'బావుందమ్మా! నువు చెప్పేది! నిన్న లేటు! ఈ రోజు పూర్తిగా మానితే ఇంకేమయినా ఉందా! అయినా నాకసలు ఆకలేలేదు అంతగా అయితే రెండింటికి వస్తానులే!' అంది రాధ

'ఒద్దులెండి! ఒక్క రోజు వెళ్ళకపోతే ఏం కొంపలంటుకోవు! నేను చెబుతాలెండి రామంతో, మీతమ్ముడికి జ్వరం అని మరి నే వస్తానూ!' రాధకు మాట్లాడేందుకు అవకాశం ఈయకుండా గబగబా వెళ్ళి కారులో కూర్చున్నాడు సుధాకర్

'మంచిది బాబూ! మీ ఋణం తీర్చుకోలేము దేముడల్లే వచ్చారు.' అంది జానకమ్మ

రాధ ముఖంలోకి చూస్తూ 'వస్తా రాధా !' అన్నాడు కారు స్టార్టు చేస్తూ. సుధాకర్

'నమస్కారమండీ! మామీద దయతో మాఇంటికి వచ్చారు! మెనీమెనీ థాంక్స్! అంది రాధ చేతులు జోడించి

"నో మెన్షన్ ప్లీజ్ .. అంటూ సాగిపోయాడతను

"ఎంత మంచి మనసు కలవాడో! దేముడల్లే

లిచ్చాడు వేయేళ్ళు వర్ధిల్లాలి'' అంటూ కూతురి ముఖంలోకి చూచింది జానకమ్మ

రాధ గుమ్మాన్ని కానుకుని జాజి పందిరి ఆకుల్లోంచి జారే నీటి బొట్ల వంక చూస్తూ. అలానే నిలుచుండిపోయింది, గుమ్మంలో

''అదేమిటే! అలా నిలుచున్నావూ! పోయి స్నానం చేసిరా! రెండు మెతుకులు తిందువుగానీ!'' అని వంట ఇంట్లోకి వెళ్ళింది జానకమ్మ

ఒక్కసారి బరువుగా నిట్టూర్చి లోపలి కెళ్ళింది రాధ

* * *

డ్రైవర్ తెచ్చిన పళ్ళబుట్ట చూచి బయట కొచ్చింది రాధ అపుడే కారులోంచి దిగుతున్నాడు సుధాకర్ అతన్ని చూచి 'నమస్కారం!' అంది రాధ ప్రతినమస్కారం చేసి 'వేణూకెలా ఉంది? రాధా!' అన్నాడు సుధాకర్ లోపల కొస్తూ

''అలానే ఉంది డాక్టర్‌గారూ! నాకేమిటో, భయంగా ఉంది రాత్రంతా వూపిరి సలపలేదు, దగ్గుతో ఏం చేయమంటారు? రేపటితో నా లీవు కూడ అయిపోతుంది ఏం చేయనూ?'' గుడ్ల నీరు కుక్కుకుంటున్న రాధను చూచి అప్రయత్నంగా ముందర కొచ్చి తన కర్చీఫ్‌తో ఆమె కన్నీరు తుడిచాడు సుధాకర్

''ఫరవాలేదు రాధా! ఈరోజు ఎక్స్‌రే తీస్తాము నువ్వే భయపడితే ఇక అమ్మగారి సంగతి చెప్పాలా? అన్నట్టు ఆవిడేం చేస్తున్నారు' అంటూ లోపలి కొచ్చాడు సుధాకర్

అతన్ని చూచి జానకమ్మ బావురుమంది, నా బిడ్డను రక్షించు బాబూ! అంటూ

''మరేం ఫర్వాలేదమ్మా! నేనున్నానుగా! ఎందుకంత భయం? వేణూకి త్వరలో నయమైపోతుంది'' అంటూ ఆమె నోదార్చాడతను కాసేపు ఎవరూ మాట్లాడలేదు వేణు మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కుని ఒక బత్తాయి పండు ఒలిచి పూసలు తీసి నెమ్మదిగా వేణు చేత తినిపించసాగాడు సుధాకర్

# విడిన మబ్బుతెరలు

ఆప్యాయంగా తినిపిస్తున్న అతన్నీ, అమృతంలా తింటున్న తమ్ముడినీ మార్చి మార్చి చూడ సాగింది రాధ

'ఏమిటీ ఈ అనుబంధం? ఎందుకతని కింత జాలి తమ మీద? ఎలా తీర్చుకుంటుందతని ఋణం? బలవంతంగా తన చేత శలవు పెట్టించాడు ఆఫీసుకి వేణూకి ఇంజక్షన్లూ, మందులూ కూడ అతనివే ఇంతవరకూ ఒక్క పైసా కూడ ఈయలేదు ఎలా అతనికి డబ్బు ఈయటం? పళ్ళూ, రొట్టెలూ కూడా అతనే తెస్తున్నాడు అనవసరంగా ఖర్చు పెడుతున్నాడు తమ కోసం స్నేహితుడుగా పరిచయమైన ఇతను ఆత్మబంధువులా ఆదరిస్తున్నాడు ఒక్కసారి పరిచయానికే అందరి హృదయాల్లో హత్తుకుపోయాడు ఎలా అతన్ని విడదీయటం? రేపటినుంచి తను ఆఫీసుకు వెడుతుంది అమ్మకేం తెలియదు అందుకని హాస్పిటల్లో చేరుస్తానని అంటే? అప్పటికి సగం గొడవ తీరుతుంది మందులూ, ఇంజక్షన్లూ, ఆయన తేనక్కరలేదు. మిగతావి నెమ్మదిగా చూచుకోవచ్చు'

''ఏం రాధా? ఆలోచిస్తున్నావు?'' అన్న సుధాకర్ మాటలకు 'అబ్బే! ఏంలేదు! తమ్ముడి గురించే!' అంది రాధ

''మరేం ఫర్వాలేదు రాధా! కానీ కొద్దిగా అనుమానంగా ఉంది టి బి ఏమో అని అయినా ఫర్వాలేదు అందుకే ఈరోజు ఎక్స్‌రే తీయిస్తాను ఈ విషయం అమ్మగార్కి తెలియనీకు! కంగారు పడతారు'' అన్నాడు సుధాకర్ రాధ కొక్కదానికే వినిపించేటట్టుగా రాధ సరేనన్నట్టుగా తల ఊపింది

వేణు నిద్రపోతున్నాడు ''మరి నే వెళ్ళొస్తానమ్మా! మధ్యాన్నం ఎక్స్‌రే తీయిస్తాను మరేం భయంలేదమ్మా! మీ రనవసరంగా కంగారుపడకండి!'' లంటూ బయటకు నడిచాడు సుధాకర్.

''కారెక్కి ఇక వెళ్ళొస్తా రాధా! భయపడకు! అమ్మగార్కి ధైర్యం చెప్పు'' అన్నాడు సుధాకర్

''అలాగే అని అతను వెళ్ళిపోయే దాకా గుమ్మంలో నుల్చుని భారంగా నిట్టూరుస్తూ.. లోపలి కెళ్ళింది రాధ.

''రాధా! అన్నం తిందువుగాని! రామ్మా!'' అంది జానకమ్మ ''నా కాకలిగా లేదమ్మా! నువు భోంచేసేయి నేను కాసేపాగి పెట్టుకుతింటాలే!'' అని. వేణు మంచం మీద కూర్చుంది రాధ

కూతురి ముఖంలోకి చూస్తూ గుమ్మంలోనే చతికిలబడింది జానకమ్మ

వేణు! ఆడుతూ పాడుతూ అస్తమానం అల్లరి చేసే వేణు ఎలా అయిపోయాడు? ఏమీ తెలియని వేణు నిశ్చింతంగా నిద్రపోతున్నాడు బక్కచిక్కిన శరీరం బల్లిలా మంచాని కంటుకుపోయింది ఇంజక్షన్లతో అతని కండరాలు తూట్లు పడుతున్నాయి నవ్వుతూ కబుర్లు చెబుతూ. బాధే తెలియకుండా ఇంజక్షన్ చేస్తాడు సుధాకర్. అతనున్నంతసేపూ ఏ బాధా తెలియదు అతను వెళ్ళిన మరుక్షణం ఇంజక్షన్ల బాధ, దగ్గు, గుండె నొప్పి ఊపిరాడనీయవు అతన్ని బాధతో గిలగిలలాడుతూంటే కన్నీళ్ళు కార్చటం మినహా మరేం చేయలేని నిర్భాగ్యులు ఆ తల్లీ బిడ్డలు ఆ కన్నీరే దేముడు వారికిచ్చిన వరం

తమ్ముడి ముఖంలోకి చూస్తూ నెమ్మదిగా అతని ప్రక్కనే పడుకుని నిద్రపోయింది రాధ.

''అన్నం కూడా తినకుండా అలానే నిద్రపోయిన కూతుర్ని చూచి భారంగా నిట్టూర్చింది జానకమ్మ

* * *

''సుధా! అన్నానికి రా! బాబూ!'' అంటూ ముందర హాల్లోకి వచ్చింది సుధాకర్ తల్లి అన్నపూర్ణమ్మ

''ఇదుగో! వస్తున్నానమ్మా!'' ఒక్కొక్క రోగినీ ఒక్కోరీతిగా వోదారుస్తూ అనునయిస్తూ తల్లికి సమాధానం చెప్పాడు సుధాకర్ వివిధ ప్రశ్నలతో అతన్ని విసిగిస్తున్నారు రోగులు అందులో పల్లెటూరి ప్రజ మరీను అడిగిందే అడిగి అడిగిందే. అడిగి అతనీ వోర్పునూ సహనాన్ని పరీక్షిస్తున్నారు. అయినా విసుగుకోకుండా వారి ప్రశ్నలకు సమాధానాలిచ్చి వారిని తృప్తిగా పంపేశాడు అందరూ వెళ్ళిపోగానే చేతివాచీ కేసి చూసుకున్నాడు టైము ఒంటి గంట దాటుతోంది తల్లి తన కోసం ఎదురు చూస్తూంటుందని. నెమ్మదిగా లేచి లోపలి కెళ్ళాడు సుధాకర్

భోజనానికి కూర్చోబోతున్న అతను కాంపౌండర్ పిలుపు విని మళ్ళీ హాలులోకి వచ్చాడు

'మీకు ఫోన్‌కాల్ వచ్చిందండీ అన్నాడు కాంపౌండర్ రిసీవర్ చేతిలోకి తీసుకుని ''హల్లో! డాక్టర్ సుధాకర్ స్పీకింగ్! ఎవరండీ!'' అన్నాడు సుధాకర్

అవతలి సమాధానం విని కంగారుగా 'వస్తున్నాను రాధా! నువు అక్కడే ఉండు!' అని రిసీవర్ కిందుంచి గబగబా మెడిసిన్ బేగందుకుని షెడ్‌లోకి పరుగెత్తాడు సుధాకర్

కార్లో కూర్చుని స్టార్టు చేయబోతున్న అతన్ని చూచి 'సుధా.. భోంచేసి వెళ్ళకూడదూ!' అంది

జూకాపా డిగ్రీ పుచ్చుకున్న వెంటనే
ఏం చక్కా ఉద్యోగం లో చేరేశామో....



అన్నపూర్ణమ్మ గుమ్మంలో నుల్చుని

'లేదమ్మా! చాలా సీరియస్ కేసు! నేను వెళ్ళక పోతే చేయి జారిపోతుంది! అన్నాని కేముంది? నువు ఫోంచేసేయమ్మా!'' ఆమె సమాధానం వినకుండానే అతని కారు బ(రున దూసుకుపోయింది

*　　　*　　　*

ఆఫీసు ఆవరణలో కంగారుగా అటూ, ఇటూ తిరుగుతోంది రాధ ఆమెకు ఏడుపు తరువాయిగా ఉంది కళ్ళ వెంట నీరు కారుతూంటే కొనగోటితో తుడుచుకుంటూ బలవంతగా దుఖాన్ని దిగమింగుకుంటోంది

వీధిలో కారు ఆగిన చప్పుడు కాగానే పరుగు పరుగున గేటు దగ్గరకు వచ్చింది రాధ. సుధాకర్ కారులోంచి దిగుతున్నాడు. అతన్ని చూడగానే.. అప్పటినుంచీ.. ఆపుకున్న దు:ఖం కట్టలు తెగిన వదిలాగా.. పొంగసాగింది. బావురుమని ఏడుస్తూ రెండుచేతులూ.. ముఖాన కప్పుకున్న:. ఆమెను..ఎలా వోదార్చాలో.. అతని కర్థంకాలేదు.

నెమ్మదిగా.. ఆమె భుజం మీద చేయి వేసి.. దగ్గరకు తీసుకుని.. చేతులు ,ముఖం మీదనుంచీ తీసి ''ఏడవకు! రాధా! మరేం ఫర్వాలేదు! నేను లేనూ! పిచ్చిపిల్లా!' అంటూ ఆమెను నడిపించుకుంటూ వెళ్ళి కారులో కూర్చో బెట్టాడు సుధాకర్.

మరుక్షణం రాధా వాళ్ళ ఇంటి ముందర ఆగింది కారు. రాధా వాళ్ళ ఇంటి పక్కలవాళ్ళతో ఇల్లంతా నిండిపోయింది. అందర్నీ తప్పించుకుని.. లోపల కెళ్ళిన సుధాకర్.. రాధలు బొమ్మల్లా.. అలానే నిలుచుండిపోయారు.

పక్కఇంటి ముసలమ్మ .. అపుడే జానకమ్మ ముఖాన గుడ్డ కప్పుతోంది.

వేణు మంచం మీద స్పృహ తప్పి పడి ఉన్నాడు. అతని మంచం (ప్రక్కనే రక్తంతో నిండిన పళ్ళెం ఉంది. నిర్జీవంగా వేణు మంచం (ప్రక్కనే పడి ఉంది జానకమ్మ.

''ఉన్న కూతురు కూడా దగ్గర లేకుండా దిక్కు లేని చావు చచ్చిందమ్మా! కొడుకు సరేసరి! ఉండీ లేనట్టే! ఏమిటో! వెధవ (బతుకులు! (పొద్దుట నన్ను పిలిచి తన గోడంతా వెళ్ళబోసుకుంది. నిక్షేపంలా ఉంది అపుడు! అందుకే అన్నారు, వాన రాకడా, (ప్రాణంపోకడా తెలియదని. ఏదో ఆబిడ్డలిద్దర్నీ పెట్టుకుని గుట్టుగా కాలం వెళ్ళదీస్తోంది. నిజంగా నోట్లో నాలుక లేదంటే నమ్మ! మహా ఇల్లాలు! పిల్లల్ని దిక్కులేనివార్ని చేసిపోయింది. ఏమిటో? పాపం!ఆపిల్లలేమవుతారో?'' సానుభూతిగా ఉపన్యాసం దంచేసింది ఒక ఇల్లాలు.

అందరూ తలోక మాటా, అంటున్నారు. వారు మాట్లాడుకునేవి గానీ అడిగేవి కానీ, రాధకి వినుపించటంలేదు. ఆమె మనసు గంట కిందట జరిగిన సంఘటనను పదేపదే తలచుకుంటోంది.

ని(ద పోతున్న తనను లేపి .. అన్నం తిందువు గాని.. లేచి స్నానం చేయమ్మా! పన్నెండు దాటుతోంది.. అని అమ్మ.. వేణు మంచం (ప్రక్కనే కూర్చుంది. తను బద్ధంకగా లేచి.. బాత్ రూమ్ లోకి వెళ్ళింది స్నానానికి. తన స్నానం పూర్తి కానే లేదు. కెవ్వున కేక విని.. గబగబా..చీర చుట్టబెట్టుకుని హాల్లోకి పరుగెత్తుకొచ్చింది వేణు గుక్క తిప్పుకోకుండా విపరీతంగా దగ్గుతున్నాడు ఆయాసంతో వాడి గుండెలు అదిరి పడుతున్నాయి ఉన్నట్లుండి వేణు బళుక్కున కక్కాడు దోసెడు రక్తం పళ్ళెంలో పడింది దాన్ని చూడగానే అమ్మ కళ్ళు చెదిరిపోయాయి భయంతో కెవ్వున కేక పెట్టింది ఈ లోపల వేణు స్పృహ తప్పి మంచం మీద వాలిపోయాడు ఏమిటమ్మా? ఏమయింది? అని ఆ(తంగా అడుగుతున్న తనను చూచి 'రాధా! డాక్టరు గార్ని పిలుచుకు రా వేణూ రక్తం కక్కుకున్నాడు త్వరగా!.వెళ్ళు!' అంటూ స్పృహ కోల్పోయింది అమ్మ అంతే! తను ఆఫీసు కొచ్చి.. సుధాకర్‌కి ఫోన్ చేసింది, త్వరగా రమ్మని, ఇంతలో ఈ అనర్థం జరిగిపోయింది

వెక్కివెక్కి ఏడుస్తూ.. జానకమ్మ మీద వాలిపోయింది రాధ "అమ్మా!'' అంటూ.

ఎటూ తోచక ఏమీ చేయలేక అలా చూస్తూ నిలుచుండి పోయాడు సుధాకర్

''ఏం చేస్తామమ్మా! లే తల్లీ! లే! నీ కోసం కలవరించి కలవరించి పోయిందమ్మా! ఎంత

[illegible]? [illegible] సహాయాన్ని లేకుండా బయటకు ఎందుకు పంపాడో? ఆ భగవంతుడు? ఏం చేస్తామమ్మా? అంతా విధి! లేచి. ఆ పిల్లాడి సంగతి చూడండి! అసలే జబ్బు మనిషి. హటాత్తుగా తెలిస్తే. ఇపుడేమన్నా అవచ్చు!'' అంటూన్న ఒక ఇల్లాలి మాటలు విని. సుధాకర్ ఉలిక్కిపడ్డాడు.

* * *

స్వయంగా ఒక పిల్లాడిని కారులోంచి దింపి భుజాన వేసుకొస్తున్న కొడుకుని చూస్తూ బొమ్మలా గుమ్మంలో నిలుచుండి పోయింది అన్నపూర్ణమ్మ.

తల్లిని కూడా గమనించే స్థితిలో లేని సుధాకర్ 'రంగయ్యా!' అని కాంపౌండర్ని పిలుస్తూ లోపల కెళ్ళాడు. అతని వెనకనే లోపలకు నడిచింది అన్నపూర్ణమ్మ ఆమె కేమీ అర్థం కావటంలేదు సుధాకరెపుడూ పేషంట్లనలా ఇంటికి తీసుకురాలేదు! అయినా ఎవరీ పిల్లాడు? సుధ తనంత తానే తీసుకువచ్చిన ఈ అబ్బాయెవరో? ఏమీ అర్థంకాక కొడుకు చేసే చర్యలను గమనిస్తూ అలానే ఉండిపోయింది అన్నపూర్ణమ్మ

కాంపౌండర్ సహాయంతో ఒక బెడ్ తయారు చేసి దాని మీద వేణూని పడుకోబెట్టాడు సుధాకర్. వేణూకి స్పృహ రాలేదు అతన్ని జాగ్రత్తగా, చూస్తూండమని కాంపౌండర్‌కి అప్పగించి వెను తిరిగాడు సుధాకర్

'ఏమిటి సుధా! ఇదంతా?' కొడుకు ముఖంలోకి చూస్తూ అడిగింది అన్నపూర్ణమ్మ

"అమ్మా వివరాలన్నీ తర్వాత చెబుతాను చెబుదామనుకుంటూనే అశ్రద్ధ చేశాను క్షమించు! ఇప్పుడేమీ అడక్కు! కానీ. నాతో ఒక్కసారి

# విడిన మబ్బుతెరలు

రావమ్మా! ఆశగా తల్లి ముఖంలోకి చూస్తూ అడిగాడు సుధాకర్.

"ఎక్కడికి సుధా?" ఆశ్చర్యంగా అడిగింది అన్నపూర్ణమ్మ

"ఈ బాబు పేరు వేణు! ఇతనికి క్షయ! ఆ సంగతి హటాత్తుగా తెలిసి ఇతని తల్లి గుండె ఆగి మరణించింది ఇందాక నాకు ఫోన్ చేసింది ఇతని అక్క ఆయాచితంగా ఆమె పరిచయం అయింది ఎందుకో వారి కుటుంబం చూడగానే నా మనసు అర్థంకాని వేదనతో నిండిపోయింది కడుపు నిండా అన్నంలేక పోయినా కన్నతల్లి ఒడిలో ఆదమరచి నిద్రపోయే ఈ పిల్లల్ని వదలి ఆతల్లి కూడా వెళ్ళిపోయింది బంధువు లెవరూ లేరట! ఆమె పేరు రాధ తల్లి చనిపోయిందని తెలిస్తే వేణు ఏమవుతాడోనని ఇక్కడకు తీసుకువచ్చానమ్మా! రాధ ఒక్కతే ఉందక్కడ! కాస్త నువ్వొచ్చి ధైర్యం చెబితే కొంచెం తేరుకుంటుంది అందుకని ఒక్కసారి రావమ్మా! నా మాట కాదనకు!'' కొడుకు పడే బాధ చూచి "సరే! పద!" అంటూ అతని వెనుకే బయటకొచ్చింది అన్నపూర్ణమ్మ

"రంగయ్యా! అతనికి మెలకువ వచ్చి తనెక్కడుందీ తెలుసుకుని కంగారు పడుతాడేమో! ఏవో మాటలు చెప్పి ఒక స్లీపింగ్ టాబ్లెట్ మింగించు! డిస్పెన్సరీకి ఫోన్‌చేసి ఒక నర్స్‌ని రమ్మని చెప్పు!'' అంటూ కార్లో కూర్చున్నాడు సుధాకర్ అతని వెనుకనే వచ్చి తను కూడా కొడుకు ప్రక్కనే కూర్చుంది అన్నపూర్ణమ్మ

కార్లోంచి దిగి గుమ్మంలో అడుగు పెట్టిన అన్నపూర్ణమ్మ జానకమ్మ శవాన్ని చూచి జానీ. అంటూ పెద్ద కేకపెట్టి.. జానకమ్మ మీద వాలి పోయింది తల్లి మీద పడి వెక్కెక్కి ఏడుస్తూన్న రాధ, తల్లి వెనకే వచ్చిన సుధాకర్ ఆ ఇంట్లో ఉన్న ఇరుగుపొరుగువారూ అందరూ అలా, బొమ్మల్లా నిలుచుండి పోయారు

"జానకీ! ఎంత పని చేశావు! జానీ! ఎన్నాళ్ళకు కనుపించావు? నిన్నిలా చూస్తానని కలలో కూడా. అనుకోలేదమ్మా! జానీ! నా వంక చూడవూ! నేనూ జానీ! నీ అనూని! ఒక్కసారి కళ్ళు తెరవ్వూ! నా మాట వినవూ! జానకీ! నా పిచ్చి జానీ!'' అంటూ, జానకమ్మ ముఖాన్ని రెండు చేతులతో పైకెత్తి. మాటి మాటికీ ముద్దు పెటుకుంటూ బోరున ఏడుస్తోంది అన్నపూర్ణమ్మ

"ఏమిటిది? అమ్మకేం పిచ్చి పట్టలేదు కదా! తెల్లబోయి అనుకుని చూస్తున్నాడు సుధాకర్

'ఎవరీమె? అమ్మ ఆమెకు తెలుసు కాబోలు! ఎలా ఏడుస్తోందో!' అంత ఏడుపులోనూ ఆమెనే చూస్తూ అలానే ఉండిపోయింది రాధ

"బాబూ! సుధా! ఇలారా! " ఏడుస్తూ పిలుస్తూన్న తల్లి పిలుపు విని ముందర కొచ్చాడు సుధాకర్

"సుధా! ఈమె ఎవరో తెలుసా? మీ అత్త బాబూ! మీ తండ్రి తోబుట్టువు! పెద్దల పరువు ప్రతిష్ఠల పేరుతో అమానుషంగా బలి అయిన అమాయకపు జీవి అపుడపుడు నేను చెబుతూండేదాన్నే! మీ అత్త ఆదర్శాలు, ఆశలూ! ఆమే! ఈమె! ఒక కంచంలో తిని, ఒక మంచంలో పరుండే మమ్మల్ని విధి, క్రూరంగా విడదీసింది బాబూ! అదంతా ఒకపెద్ద గాథ"

* * *

'అనూ వో అనూ!' నురగలు కక్కుతూ పరుగెత్తు కొచ్చిన జానకి గుమ్మంలోనే ఆగిపోయింది అత్తను చూచి

"ఏం? ఎందుకు జానీ! అనూ నిద్రపోతోంది! ఏం కావాలి? అంది'' అన్నపూర్ణమ్మ తల్లి దానమ్మ.

"ఏం లేదత్తా! ఆడుకుందామనీ!'' నసుగుతూ. గుమ్మంలోనే నుల్చుంది జానకి "లోపల కెళ్ళి, లేపమ్మా! ఎండలో తిరుగుతూందని నేనె పడుకోమన్నాను ఇపుడు కొద్దిగా చల్లబడిందిగా! జాగ్రత్త! చెరువుల కేసి వెళ్ళకండేం?'' అన్న అత్త మాటలకు. అలాగే అత్తా అంటూ హుషారుగా ఇంట్లోకి దూసుకుపోయింది జానకి

గదిలోకి పోబోయిన జానకి తన జడ నెవరో పట్టుకు గుంజటం చూచి గబుక్కున వెనక్కు తిరిగింది తలుపు వెనక దాక్కున్న రామం చంగున బయటకొచ్చాడు అతన్ని చూచి బెణికిపోయింది జానకి ఏం? అనూని పిలవటాని కొచ్చావా? నన్ను పిలువక్కర్లేదూ! అయినా నువు పిలిచే దేమిటిదే! నేనే సమయానికి వచ్చి అన్నీ స్వాహా చేయకపోతేనా. నా పేరు రామం కానేకాదు! ఏం? అర్థమయిందా? వస్తా మరీ! అంటూ ఆమె నెత్తి మీద ఒక మొట్టికాయ వేసి తుర్రున బయటకు పరుగెత్తాడు రామం నెమ్మదిగా తల తడుముకుంటూ లోపలకు నడిచింది జానకి.

(ఇంకా వుంది)

ఏమిటీ! పిల్లంతా క్యాంకర్లు తిరిగే చేదు మందిస్తే- అమృతంలా వుందంటున్నావ?



# వారఫలం

**31-5-1968 శుక్రవారం మొదలు**
**6-6-1968 గురువారం వరకు**

**మేషం:** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి వస్తుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

**వృషభం** వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు నూతనవ్యవహారాలు శ్రమమీద ఫలిస్తాయి స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణించగలదు సజ్జనసాంగత్యం లభిస్తుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి దైవకార్యాలు నెరవేరుతాయి

**మిథునం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి బంధువుల వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కర్కాటకం** వృత్తివ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి సంతోషకరమైన వార్తలను వింటారు

**సింహం** ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే చికాకులు యేర్పడతాయి మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది సాటివారిలో గౌరవం లభిస్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది అధిక వ్యయం జరుగుతుంది

**కన్య** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు కలుగుతాయి సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది అలంకార వస్తువులు కొంటారు

**తుల.** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రబల్యాలు బాగా ఉంటాయి సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి బంధువులకు సహాయం చేస్తారు వారం ఆఖరులో వృత్తివ్యాపారాల్లో చికాకులు కలుగుతాయి

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది రావలసిన డబ్బు సమయానికి అందుతుంది నూతనవ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి విలాసవస్తువులు కొంటారు

**ధనుస్సు** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చెయడానికి ప్రయత్నిస్తారు సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు సంతోషకరమైన వార్తలను వింటారు.

**మకరం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి అధికవ్యయం జరుగుతుంది

**కుంభం** వ్యాపారంలో సాటివారితో పోటీపెరుగుతుంది ఇతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి వారం ఆఖరులో చికాకులు ఏర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**మీనం** మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాటివారితో మాట పటింపులు తగవు ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు.

—మహేష్



# ముగ్గురు మూర్ఖులు
# సమర్థులు




మహేష్

■ 'రైతు సోదరులారా.'

మన కమ్యూనిస్టుల రాజ్యం వస్తే ప్రతికుటుంబానికి అయిదెకరాల పొలం ఒక పాడ ఆవును యిస్తాం. అలాగ పంచిపెట్టడానికి యిక్కడ ఉండే పొలం చాలకపోతే మన రష్యానుంచి దిగుమతిచేసి పంచి పెడతాం.'

అని యెన్నికల్లో వాగ్దానాలు చేయగల సమర్థులు మనదేశంలో ఉన్నారు' అన్నాడు చిదంబరం.

'ఎన్నికల వాగ్దానాలు యెన్నివిధాలుగా అయినా ఉండవచ్చు' నంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

ఒకచోట యెన్నికలసభ యేర్పాటు చేయబడింది. అభ్యర్థి మిగిలిన నాయకులూ, కూడా సభకు వచ్చారు. సభ ప్రారంభం అయ్యే సమయంలో ఆ ఊళ్లోనే ఒకచోట యిళ్లకు నిప్పు అంటుకొంది.

'ఆ అగ్నిప్రమాదానికి కారణంయేమిటి?' అని అభ్యర్థి తన పక్కనున్న స్నేహితుణ్ణి అడిగాడు.

'షార్టు సర్క్యూట్ అయి ఉండవచ్చును.'

షార్టు సర్క్యూట్ అంటే యేమిటి?'

'ఎలక్ట్రిక్ వైరింగు లోపం'

'లోపం అయితేయేం? షార్టు సర్క్యూట్ అయితే అగ్నిప్రమాదం జరగాలా?'

'షార్టు సర్క్యూట్ అయితే నిప్పు పుడుతుంది. అది నేచురల్‌లా.' అని ఆ స్నేహితుడు సమాధానం యిచ్చాడు.

వెంటనే అభ్యర్థి లేచి, తన ఉపన్యాసం యిలాగ ప్రారంభించారు.

'మహా జనులారా!'

'షార్టు సర్క్యూట్ అయితే నిప్పు పుడుతుందనీ, అది నేచురల్‌లా అనీ నాకు యిప్పుడే తెలిసింది. ఈ లా వల్ల చాలా ప్రమాదం ఉంది. నన్ను గనుక మీరు శాసనసభకు పంపినట్లయితే ఆ నేచురల్ లాకు సవరణ ప్రవేశపెట్టి అగ్ని ప్రమాదాలు జరగకుండా చూడగలను.'

ఇంకొక సభలో ఒక నాయకుడు ఉపన్యసిస్తున్నాడు. అక్కడకు చేరిన విద్యార్థులు 'ఉయ్‌వాంట్ పాలిటెక్నిక్' 'పాలిటెక్నిక్ కావాలి' అంటూ ఇంగ్లీషులోను, తెలుగులోనుకూడా నినాదాలు చేయడం ప్రారంభించారు.

పాలిటెక్నిక్ అంటే ఏమిటో ఆ నాయకునకు తెలియదు. తెలియని విషయాలను గురించి మాట్లాడకపోవడం సామాన్యుల లక్షణంగాని రాజకీయ నాయకుల లక్షణం కాదుగదా! వెంటనే అతనికి పట్టణంలో చూసిన టెక్నికలర్ సినిమాలు జ్ఞాపకానికి వచ్చాయి. అప్పుడు ఆ నాయకుడు విద్యార్థుల నినాదాలకు యిలాగ సమాధానం యిచ్చాడు.

'మన దేశానికి విదేశీమారకం తక్కువగా ఉంది. అందుచేత పాలిటెక్నిక్ దిగు

పాత్ర చేసికొనడానికి అవకాశం లేకపోతుంది అని గవర్నమెంటు చెబుతుంది. ఈ ఎన్నికల్లో.. మా పార్టీ అధికారంలోనికి వచ్చినట్లయితే విదేశీ సహాయంతో యిక్కడనే పాలీటెక్నిక్ సినిమాలు తయారయ్యే యేర్పాటు చేస్తాం, లేదా పట్నాల్లో మాత్రం ఆడుతున్న టెక్నికలర్ సినిమాలు యిక్కడకూడా ఆడే యేర్పాటు చేస్తాం'

'అని ఉపన్యసించగల నాయకులుకూడా లేకపోలేదు' అన్నాడు చూడామణి

'ఈ విషయంలో కేవలం రాజకీయ నాయకుల్నే అనవక్కరలేదు పోలీసులు కూడా యీ విషయంలో యే మాత్రం వెనుకబడరు' అని చంచలావు చెప్పడం ప్రారంభించాడు

ఒకప్పుడు పోలీసులు కనిపించిన ప్రతి కమ్యూనిస్టును అరెస్టు చేస్తున్నారు ఆ సందర్భంలో పోలీసు అధికారులు ఒక ఆసామీని కమ్యూనిస్టు అని అరెస్టు చేయబోయారు అప్పుడు ఆ ఆసామీ నేను కమ్యూనిస్టును కాదు యాంటీ కమ్యూనిస్టును అని కేకలు వేశాడు.

పోలీసు అధికారి దానికి వెంటనే యిలాగ సమాధానం యిచ్చాడు :

'నువ్వు వట్టి కమ్యూనిస్టువో? యాంటీ కమ్యూనిస్టువో? అది మాకు అక్కరలేదు నువ్వు యేదో ఒక కమ్యూనిస్టువేకదా! అందుకే నిన్ను అరెస్టు చేస్తున్నాం.'

'ఇదేకాదు ఇంతకంటే ప్రఖ్యాతమైన ఉదంతాలు పోలీసులను గురించి చాలా ఉన్నాయి' అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు

'ఒకప్పుడు ఒక ఊళ్లో హత్యజరిగింది హంతకుడని పోలీసులు అనుమానించిన ఆసామీ పరారీ అయిపోయాడు అతని యింటిని సోదాచేయగా, అతని ఫొటోలు దొరికాయి. వివిధకోణాలనుంచి తీసిన ఆరు ఫొటోలను పోలీసులు స్వాధీనం చేసికొన్నారు వాటికి కాపీలు తీయించారు. ఆ ఫొటోల్లో ఉన్న ఆసామీ కన్పించినట్లయితే అరెస్టు చేయవలసినదని చుట్టుపక్కల నున్న పోలీసు స్టేషన్లకు ఉత్తరాలు రాశారు ఉత్తరంతోపాటు ఆరు ఫొటోలను పంపించారు

మూడవనాటికి ఒక పోలీసు స్టేషన్నుంచి జవాబు వచ్చింది. అందులో యిలాగ ఉంది

'మీరు రాసిన ఉత్తరం, ఫొటోలు చేరాయి. మీరు పంపిన ఫొటోల్లో ఉన్న వాళ్లలో నలుగురను అప్పుడే అరెస్టు చేసివేశాం మిగిలిన యిద్దరిమీదా కూడా నిఘావేసి ఉంచాం. వాళ్ళను యీ రాత్రికి గాని రేపు ఉదయంగాని అరెస్టు చేయగలం.

'ఒకసారి ఒక సినిమాతార తన బంగారపు గొలుసును యెవరో దొంగిలించారని పోలీసులకు ఫిర్యాదు చేసింది సామాన్యుల వ్యవహారాల్లాగ సినిమాతార రిపోర్టును నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు కదా' అందుచేత పోలీసులు ఆ రిపోర్టు విషయంలో అహోరాత్రాలు కృషిచేయడం ప్రారంభించారు

ఇంతలో సినిమాతార పోలీసు స్టేషనుకు ఫోను చేసింది.

'హలో! యిన్స్పెక్టరుగారూ! నా బంగారపు గొలుసు మా యింటోనే దొరికింది అందుచేత కంప్లయింటును విత్‌డ్రా చేసికొంటున్నాను'

'అదేమిటండీ? ఇప్పుడు మీరు కంప్లయింటు విత్‌డ్రా చేసికొంటే యెలాగ? అప్పుడే నలుగుర్ని అరెస్టు చేశాం అందులో యిద్దరిచేత నేరాన్ని ఒప్పించేశాం కూడా' అని పోలీసు స్టేషన్నుంచి సమాధానం వచ్చింది

'పోలీసులే కాదు. మిగిలిన శాఖలకు చెందిన ఉద్యోగులు కూడా చాలా కథలను సృష్టించారు' అంటూ చిదంబరం చెప్పడం ప్రారంభించాడు

ఒక గుమస్తా కార్తీక సోమవారానికి శెలవు కావాలని పై అధికారిని అడిగాడు

ఎప్పుడు పడితే అప్పుడు శెలవు యివ్వడానికి వీల్లేదు అయినా, గత సంవత్సరం కార్తీక సోమవారానికి శెలవు యిచ్చారా? అని అధికారి గుమస్తాను ప్రశ్నించాడు

'లేదు సార్! గత సంవత్సరం కార్తీక సోమవారం ఆదివారంలో కలసిపోయింది అందుచేత వేరే శెలవు యివ్వలేదు' అని గుమస్తా వినయవిధేయతలతో సమాధానం యిచ్చాడు

'అలాగైతే ఫరవాలేదు ఈ సంవత్సరం మీరు శెలవు తీసికొనవచ్చు' నంటూ ఆఫీసరు శెలవు మంజూరు చేశాడు.

మరొక ఆఫీసులో పై అధికారి ఆఫీసు రికార్డును తనిఖీ చేస్తున్నాడు. రికార్డు రూములో ఒకమూల చాలా పాతరికార్డు కన్పించింది ఆ రికార్డునంతా తగలపెట్టేయమని అధికారి ఉత్తరువు చేశాడు

పదిరోజులు పోయినతరువాత అధికారి తాను చెప్పిన రికార్డును తగలపెట్టేశారా? అని రికార్డు రూము అధికారిని ప్రశ్నించారు.

'నిన్ననే తగులబెట్టించి వేశాను సార్! ఆ రికార్డుకు అంతటికీ మళ్ళీ కాపీలు తీయించడంలో కొంచెం ఆలస్యం జరిగింది అంతే సార్' అని రికార్డురూము అధికారి సమాధానం యిచ్చాడు

ఒకప్పుడు రాష్ట్రస్థాయి అధికారి ఒకరు దిగువ ఆఫీసును తనిఖీ చేయడానికి వచ్చారు ఆ ఆఫీసులో యెవరెవరు యే పని చేస్తున్నదీ ఆఫీసరు తనిఖీచేయడం ప్రారంభించాడు. ఒక గదిలో యిద్దరు గుమస్తాలు కూర్చొని ఉన్నారు వారు యే పనీ చేయడంలేదు

'ఏం పని చేస్తున్నావ్?' అని అధికారి ఆ యిద్దరు గుమస్తాల్లో ఒకరిని ప్రశ్నించాడు

'ఏం లేదు సార్! గోళ్లు గిల్లుకొంటూ కూర్చున్నాను.' అని ఆ గుమస్తా సమాధానం యిచ్చాడు

అయితే నువ్వేం చేస్తున్నావ్? అని అధికారి రెండవ గుమస్తాను ప్రశ్నించాడు.

'నేనూ అంతేసార్!' గోళ్లు గిల్లుకొంటూ కూర్చున్నాను,' అని రెండవ గుమస్తా సమాధానం యిచ్చాడు

'అంతా యిలాగే ఉంది. ఒకరు చేసే పనిని యిద్దరు చేయడంవలన గవర్నమెంటు డబ్బు దుర్వినియోగం జరుగుతుంది.' అని అధికారి వ్యాఖ్యానించాడు.

'దిగువ ఆఫీసర్లంతా మంత్రులు చెప్పినట్లు చేసేవారే కదా' ఆ మంత్రుల గురించే చాలా కథలు ఉన్నాయంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'మనం యిప్పుడు వెంటనే ఢిల్లీ వెళ్ళే విమానాన్ని అందుకోవాలి' అన్నాడు ఒక మంత్రి తన సెక్రటరీతో.

'వీల్లేదు సార్! విమానం యింకొక యిరవై నిమిషాల్లో బయల్దేరుతుంది. మనకారు ఎయిర్‌పోర్టుకు చేరుకోవడానికే ముప్ఫై నిమిషాలు పడుతుంది' అని శ్రెకెటరీ సమాధానం యిచ్చాడు

'అయితే రెండుకార్లు పెట్టవయ్యా!' అని మంత్రి శ్రెకెటరీకి ఆర్డరువేశారు.

## సమర్థులు

ఒకప్పుడు ఒకమంత్రి ఆపరేషను చేయించుకోవలసి వచ్చింది మంత్రి ఆపరేషను బల్లమీద పడుకొన్నాడు మర్యాదకుగాను డాక్టరు యిలాగ అన్నాడు–సర్! డూ యూ లైక్ టు హేవ్ లోకల్ ఎనెస్తీషియా?

దానితో మంత్రికి చాలాకోపం వచ్చి డాక్టరుతో అన్నాడు 'వై లోకల్? యూ ఫెలో మై శ్రెకెటరీ హి విల్ యెరేంజ్ సమ్ యింపోర్టెడ్‌స్టఫ్'.

మంొకమంత్రికి చదవడంరాదు. అందుచేత శ్రెకెటరీయే ఉత్తరాలను చదివి విన్పిస్తుండేవాడు ఒకనాడు శ్రెకెటరీ యేదో పనిమీద శెలవు పెట్టాడు. ఆవేళ కేంద్రంనుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఉత్తరంమీద ముద్రను చూస్తే అది వెరీ అర్జెంటులాగ కన్పించింది మంత్రి వర్యునకు.

ఎవళ్లకు బడితే వాళ్లకు ఉత్తరాల్ని చూపించకూడదు అయితే అప్పుడు యేం చేయాలి? అని మంత్రివర్యుడు ఆలోచించగా ఆతనికి ఒక ఉపాయం తట్టింది

మర్నాడు శ్రెకెటరీ మామూలుగా ఆఫీసుకు వచ్చాడు అంతకు ముందు రోజున వచ్చిన ఉత్తరాన్ని చూశాడు ఆ రహస్యపు ఉత్తరాన్ని యెవరు చదివారు? అని శ్రెకెటరీ మంత్రిని ప్రశ్నించాడు.

గుమస్తా సుబ్బయ్యచేత నేనే చదివించాను కాని ఉత్తరంలోని విషయాలు అతనికి తెలియకుండా చేశానులే అని మంత్రి సమాధానం యిచ్చాడు

'అదెలాగ సాధ్యం?'

'అక్కడే ఉంది మనతెలివి అంటూ మంత్రి పుంగవుడు విజయగర్వంతో ఒకసారి సకిలించి యిలాగ సమాధానం యిచ్చాడు

సుబ్బయ్యను ఒంటరిగా నా గదిలోనికి రమ్మనమని కబురు పంపించాను అతను రాగానే కిటికీ తలుపులుకూడా మూయించి వేశాను అప్పుడు సుబ్బయ్యచేతికి ఉత్తరాన్ని యిచ్చి వెంటనే అతని రెండుచెవులూ గట్టిగా నా చేతులతో మూసివేశాను అప్పుడు సుబ్బయ్యను ఉత్తరాన్ని చదవమన్నాను సుబ్బయ్య ఉత్తరాన్ని చదివాడుగాని తాను చదివినదాన్ని వినలేక పోయాడు అందుచేత అతనికి ఉత్తరంలోని విషయం యేమిటో తెలియదు!

'ఇప్పటికే చాలా ఆలస్యం అయింది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు ●



ఇదుగో—నిన్నే— ఇవాళ తెల్లారగట్టే కాస్త నన్నులేపాలి బోలెడు పనుంది ఎందుకూ ఏమిటీ అని అడగొద్దు నాకు పనుంది అంతే

అయినా— శీతాకాల ప్పొద్దేమో, లేచేటప్పటికి మరి పొద్దెక్కి పోతూందోయ్ గట్టిగా చలేనా ఒదలకుండా, వెధవ గడియారం తొమ్మిది చూపిస్తూవుంటే ?—

మీ వాళ్ళకి ఉత్తరం రాసి చాలాకాలమయిందా?— పాపం, ఏమనుకుంటారో వాళ్లు? —ఇంకా ఇలాంటివే చాలా వున్నాయ్, పెండింగులో వాడెవడో చాలాకాలానికి పెళ్లి చేసుకున్నాడు మరొకడికి లేకలేక ఇంతకాలానికో అమ్మాయి పుట్టింది ఇంకొకడు జీవితంలో చిన్న విషాద ఘట్టంలో పడ్డాడు వీళ్ళందరికీ ఏదోకాస్త హుషారుగా ఉత్తరాలు రాయకపోతే ఎలా, చెప్పూ?

ఎంతపెందరాళే లేచి తెమిలినా, ఆఫీసుకి కాస్తోకూస్తో లేటవుతూనే వుంది నాకంటే మా బాస్సే ఆలస్యంగా వస్తాడు కనుక ఏదో పరవాలేకపోతూంది.

టంగ్ . టంగ్ టంగ్ టంగ్ ! ..

టంగ్ .. టంగ్ . టంగ్ టంగ్ . ...

అప్పుడే అదుగో, తొమ్మిది కొట్టినట్టుందీ!— పెందరాళే పడుకుంటేగాని పెందరాళే లేవలేను నే పడుకుంటున్నా నువ్వూ పని తెముల్చుకు చప్పున పడుకో ఆ డిటెక్టివ్ నవలలు పెట్టుకు అర్ధరాత్రిదాకా కూచోక— పెందరాళే లేపూ—వూ?—

అబ్బా—పోదూ!— నాకింకా నిద్దర బద్దకం తీరలే నే లేవను అయినా, ఈ చలిలో ఇంత పొద్దున్నే లేచి ఏం చెయ్యాలి, చెప్పూ ఉత్తరాలా?— తరవాత రాస్తాలేద్దూ, తీరిగ్గా మీవాళ్లకా?— నువురాసెయ్యకూడదూ? ఏమోబాబు, నేలేవనుగాక, లేవను

నన్ను చంపకా మరీ అంతలా పీక్కుతింటే ఎలా చెప్పూ పగలల్లా ఆఫీసులో సున్నమై వస్తానా?— కాస్తంతయినా విశ్రాంతి ఒద్దూ?—ఇప్పుడింత పెందరాళే లేస్తే, ఆఫీసులో కునికి పాట్లొస్తాయ్ వుహు— నే లేవనేలేను

ఇదుగో— నామాట వింటావ్?— ఇంత చలిలో నువు మాత్రం లేచి ఏం చెయ్యాలి? నాకు చలి మరీ ఎక్కువగా వుందిగానీ— నువ్వూబజ్జో—

ఏవోయ్, టయిమెంతయిందీ?— అబ్బా, ఇంతపొద్దెక్కి పోయిందేమిటి చెప్మా, ఆ!— అప్పుడే ఎనిమిది!!— ఏమిటిదీ, ఇదుగో— నీకేమైనా మతిపోయిందా? ఇంతపొద్దెక్కేదాకా నన్నెందుకు పడుకోనిచ్చావ్?— పెందరాళే, తెల్లారగట్టే లేపలేక పోయావూ?— ఏవిటీ?— నేను లేవలేదంటావా?— ఆ?— నేలేవలేనన్నానా?— ఒకవేళ నేను లేవనంటే అంతే?—అలా వూరుకోవటమే? నీకు బాధ్యతలేదూ?—

ఇలా నీతో మాటాడుతూ కూచుంటే అయినట్టే— నాపని నేనిదిగో వస్తున్నాగాని, మువ్వెళ్లి వడ్డనకానియ్




ఎక్కడ
లైఫ్‌బాయ్ వున్నదో
అక్కడ ఆరోగ్యము వున్నది

లైఫ్‌బాయ్ తో స్నానము మీకు అత్యంత ఆరోగ్యవంతమైన హాయి గొలుపుతుంది. లైఫ్‌బాయ్‌లో ఉత్తమమైన సబ్బులో వుండ వలసిన అన్ని సుగుణములే గాక ఇంకా ఎన్నియో వున్నవని మీరు తెలిసికొందురు.

**లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది**

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

L. 51. 140 TL




# హృదయం చిగిర్చింది

కె.రామలక్ష్మి

**జ రి గి న క థ**

రమ బావగారు ఆమెని కాలేజీ లేడీస్ హాస్టలులో చేర్చి వెళ్లిపోతాడు వార్డెను సరళని పిలిచి రమని పరిచయం చేస్తుంది సరళ చలాకీపిల్ల రమతో బాగా స్నేహం ఏర్పరచుకుంటుంది కొత్తగా వచ్చిన లెక్చరరు రామారావు రమపై మోజు చూపిస్తూ వుంటాడు రమా, సరళా ఇద్దరూ ఆ విషయాన్ని గ్రహిస్తారు రమతో రామారావును కలిపి కాలేజీ పిల్లలు అల్లరి చేయడం మొదలెడతారు. రామారావు సరళని రమ దగ్గరికి రాయబారం పంపుతాడు తల్లికి సుస్తీ చేసిందని విన్న రమ చూసిరావడానికి వెళ్తుంది బావతో రామారావు సంగతి చెప్పి అతన్ని ఒప్పిస్తుంది రమ రామారావు లిద్దరికీ రిజిస్ట్రార్ ఆఫీసులో వివాహం అయిపోతుం పాపని కూడా తమవద్దే వుంచుకుంటారు బయటివారి మాటిపోటి మాటలకి రామారావు బాధపడతాడు భార్యాభర్తల ఇద్దరి మధ్యా కొంచెం మనస్పర్థలు ఏర్పడినా సర్దుకుపోసాగారు

## 8

తను చెప్పకుండా తన మనస్సు ఎప్పుడు అర్థం చేసుకుంది యీ రమ! నిట్టూర్చాడు రామారావు

“నేని ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను రమా” తాపీగా సర్దుకు కూర్చుంటూ చెప్పాడు

“ఎందుకని?” ఆత్రంగా అడిగింది రమ

“ఇప్పుడిక అడ్డు ప్రశ్నలు వేయక నే చెప్పింది విను తరువాత నీ నిర్ణయాలు చెప్పు” ఆమె చేయి తన చేతితో నిమురుతూ చెప్పడం ప్రారంభించాడు రామారావు.

“చిన్నప్పటి నుంచీ నాది చాలా గమ్మత్తయిన తత్వం రమా, ఎదుటివాడు పది ప్రశ్నలు వేస్తే వాకేం సమాధానం చెప్పాలో తెలియని అవస్థలో పడిపోతాను నాకు చిన్నతనంలోనే నాన్నగారు పోయారు అమ్మ చాటున పెరిగి పెద్దవాణ్ణయిన వాణ్ణి అందుకే కాబోలు స్వతహాగానే పిరికితనం ఎక్కువ అయింది నిన్ను యీ చిన్నప్పుడు, నిన్ను నా మనస్సులోంచి తిప్పుకో లేనప్పుడు, నా మనస్సు యావత్తూ నువ్వు ఆక్రమించుకున్నప్పుడు నాలో కొంచెం ధైర్యం వచ్చింది నిన్ను ఎలాగైనా పొందాలని నేను పడ్డ తాపత్రయం నీకు తెలుసు కాని నీ విజస్థితి తెలిసినప్పుడు పిరికివాడిలా పారిపోవాలనుకున్నాను రెండు రోజులు మనస్సులో ఆలోచనలు మంటలు రేపాయి కాని కోరిక బలం ఆరోజు తెలిసింది నిన్ను వదులుకోలేను తెగించనేను ఏది కష్టం? కష్టమైన నిర్ణయమే నా కోరిక అయింది అందుకే మీ ఊరు వచ్చాను సుందరం నిజంగా నాకు ఇష్టే సన్నిహితుడయ్యాడు అతనిది వజ్రసంకల్పం అలాంటి మానసిక దారుఢ్యం నా కుంటేనా అనిపించింది నగమే జీవిస్తున్న నేను నీతో సంపూర్ణ జీవనాన్ని చూశాను కాని చుట్టూ మనుషులిలా ముళ్ల కంచెలా తయారు అవుతారన్నది ఊహించలేకపోయాను రమా, అది నా కూడుకుంటున్న ధైర్యాన్ని దెబ్బకొట్టింది. పిరికివాడిలా ప్రవర్తించాను కాని ఒసారి ధైర్యం చేశాక పిరికితనం నిలవలా అందుకే పూర్తిగా ఆలస్యం కాకుండానే నిర్ణయం చేసుకోగలిగాను” ఆగాడు రామారావు

అతని ముఖం కేసి చూస్తూ ఆలా నిశ్శబ్దంగా వింటూంది రమ

“నేను ఉద్యోగం మానేశాను ఉత్తరాదిలో వో యూనివర్శిటీకి వ్రాశాను అక్కడి నుంచి ఆర్డరు రావచ్చు అది వచ్చేలోగా వో నెలాపదిహేను రోజులు హాయిగా మీ ఊళ్లో గడుపుదాం అందుకే సుందరాన్ని రమ్మని వ్రాశాను “చెదిరిన రమ ముంగురులు సవరిస్తూ చెప్పాడు రామారావు,

“మేష్టారూ!” అంది రమ

“ఏమిటి రమా, నన్ను ఇంకా నమ్మలేక పోతున్నావా?” అడిగాడు రామారావు

“లేదు లేదు ఇలా ఎన్నాళ్లు తప్పించుకు పారిపోగలం?” మాటిగా యుస్తూ అడిగింది రమ

“తప్పించుకు పారిపోవడం కాదు రమా, నీకూ నాకూ విశ్రాంతి చిక్కడం కోసమే కొత్త వాతావరణంలో కొత్త మనుషుల మధ్య మనం హాయిగా ఊపిరి తీసుకోవచ్చు మన సంగతులు వాళ్లకి పాత సంగతులైపోతాయి”

“అయినా పిరికిగా పారిపోవడమా?” నీరసంగా అంది రమ

“మనం పారిపోవడం లేదు రమా, అలా పారిపోదలిస్తే పల్లెకి వెళ్లిపోయి పాతుకు పోదుం కాని అలా చెయ్యడం లేదుగా?”

“మీ ఇష్టం మీరేం చేస్తే అది నేను సిద్ధంగా ఉన్నాను” అంది రమ రామారావు చేతిని తన రెండు చేతులలోకి తీసుకుంటూ

‘రమా నువ్వు దేవతవి నాకీ అవకాశా న్నిచ్చావు రెండురోజుల నుంచీ నేను యమబాధ పడుతున్నాను రమా, నిన్నూ పాపనీ నొప్పించి, నన్ను నేనే బాధ పెట్టుకున్నాను నన్ను క్షమిస్తావు కదూ?”

“మనం ఇద్దరం ఎదగాలిగా! ఇవన్నీ తప్పవు” గోముగా అంది రమ

“సుందరం బావతో మీరీ విషయాలు చర్చించనని మాట యివ్వండి” అంది

“ఇవి చర్చించాలని కాదు నేరమ్మన్నది నా ఉద్యోగంలో మార్పు సంగతి చెప్పి నిన్ను అక్కడికి పంపాలని అతనొస్తే నా ధైర్యం ఇనుమడిస్తుందని” కూర్చోబోయింది రమ.

‘వద్దు ఈ పూటకి అన్నీ నేనే చేస్తాను రేపు నీపని నువ్వు చేసుకుందువు గాని” అని లేవబోతున్న రమని పడుకోపెట్టేశాడు రామారావు వంటింట్లోకి వెళ్లి స్టౌవెలిగించాడు నీళ్ల పెట్టి హార్లిక్స్ కలిపి యిచ్చే లోపల వో నాలుగు సార్లైనా రమని అడిగాడు అదెక్కడుంది? ఇదెక్కడుంది అంటూ

తలగడాలు ఎత్తుగా పెట్టుకుని జారబడి, కూర్చుంది రమ వేడిగా హార్లిక్స్ తాగుతూ

“నా కిప్పుడు భుజాల మీద నుంచి భారం తొలగిపోయినంత తేలికగా ఉంది రమా” అంటూ పక్కనే కూర్చున్నాడు రామారావు కాళీగ్లాసు పక్కన పెట్టి అతని భుజంపై తలవాల్చిపడుకుంది రమ ఆమెకీ గుండెల మీది బరువు దింపినట్టుంది

రెండురోజులు గడిచేసరికి పాప ఆరోగ్యం బాగుపడింది రమ కూడా లేచి తిరుగుతూంది వాతావరణంలో నిరుత్సాహం తొలిగిపోయి, కొత్త ఉత్సాహం గూడు కట్టుకుంటూంది. రామారావు రిలీవ్ అయిపోయాడు రోజుకి కొందరు స్నేహితులు పార్టీలిచ్చి వీడ్కోలు చెప్తున్నారు రోజూ సాయంత్రాలు విద్యార్థులు వచ్చి కబుర్లు చెప్పి పోతున్నారు. వాళ్ల మధ్యకి వెడుతూ సరదాగా తిరుగుతూంది పాప వచ్చిన వాళ్లకి బొమ్మలు, పుస్తకాలు, లక్కపిడతలు తీసుకెళ్ళి చూపిస్తూంటుంది వచ్చీరానీ మాటలతో చేతులు తిప్పుకుంటూ ఏవేవో చెప్పేస్తూ ఉంటుంది దాని కబుర్లకి, చేష్టలకి గట్టిగా నవ్వుతూ ఉంటాడు రామారావు రమని పిలిచి చూడమంటూ ఉంటాడు

స్థలం మార్పుతో విశ్రాంతి కల్గుతుందన్న నమ్మకం తోచడంతో రామారావు కొత్త మనిషిగా తయారవడం గమనించక పోలేదు రమ ఆమె హృదయం భారం తీరి, కొత్త జీవితం కోసం కుతూహలంగా ఎదురు చూస్తూంది ఇంత సులభంగా తనను పీడిస్తున్న సమస్య పరిష్కారం అవుతుందని అనుకోలేదు రమ ఇదెంతటి విపరీతాలకి దారి తీస్తుందో అని బెంగపడిపోయింది ముసురుకున్న విషాద మేఘాలు ఇంత సులభంగా విచ్చిపోతాయని ఊహా మాత్రంగానైనా అనుకోలేదు అందుకే రామారావు తన నిర్ణయం చెప్పినప్పుడు తన ఉత్సాహాన్ని ఒక్కసారి చెప్పలేకపోయింది

ఈ వారం పదిరోజులలో రామారావు రమా ఎన్నడూ లేనంత సన్నిహితం అయారు మనస్సు విప్పి తమ కోరికలు, ఆశలు ఆశయాలు కలబోసుకున్నారు ముందున్నది బంగారు బాట ఇక దాని వెంట సాగిపోవడమే అన్నంత సంతోషంగా ఉన్న ఊరు వదలడానికి ఎదురు చూసు న్నారు

సుందరం ఆవేళ పదిగంటల వేళ వచ్చి దిగాడు అతను కూడా చాలా హడావిడిగా ఉన్నాడు

"మిమ్మల్ని ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా ఉర్లో దింపేయాలి రమ" అన్నాడు రమ అందిస్తున్న కాఫీ గ్లాసు ఒక చేత్తో అందు కుంటూ.

"ఏం అంత ఖంగారు?" అడిగింది రమ కాళ్లకు చుట్టుకున్న పాపని ఎత్తుకుంటూ

"ఏముందీ, మీరక్కడ ఉండగానే నేనూ జానకీ ఊళ్లు తిరిగి వద్దామని"

"అవును బావా, పాపం జానకి ఆ యింట్లో అడుగు పెట్టాక ఎక్కడికీ వెళ్లిన పాపాన పోలేదు కదూ" అంది రమ

"జానకి ఎప్పుడూ ఆసంగతి అనలేదు రమా, ఆ విషయంలో నిజంగా నేను అదృష్టవంతుణ్ణి" కాఫీగ్లాసు కింద పెట్టి పాపని అందుకున్నాడు సుందరం

"జానకి విషయంలో మనం అందరం అదృష్ట వంతులమే బావా, జానకీ లేకపోతే అమ్మ ఏమై పోయేదో" అంది రమ

పాప నెత్తుకుని సుందరం హాల్లో కూర్చున్నాడో లేదో రామారావు బయటి నుంచి వచ్చాడు సుంద రంతో కబుర్లలో పడ్డాడు

జీవితంలో మనస్సు ఇంత తేలిక పడడం అంటే ఏమిటో ఇప్పుడు తెలుస్తోంది సుందరం గారూ' యధాలాపంగా అన్నాడు రామారావు

"మనం ఢీకొనే దాకా సమస్యల నిజస్వరూపం అర్థంకాదు మేష్టారూ, ఢీకొన్నాక గాని వాటి పరి ష్కారాన్ని గురించి ఆలోచించడానికి ఉండదు కదా?" అన్నాడు సుందరం

"బాగా చెప్పారు నేను చాలా ధైర్యం చేశాను అనుకున్నాను రమని పెళ్లి చేసుకుని కాని నిజంగా ఎంతటి పిరికివాణ్ణో పాప తెలియ చెప్పింది! జీవి తంలో ఒక ముందడుగు వేశామంటే అటుపై ప్రతి అడుగూ ముందడుగే అవుతుందని ఊహించ లేకపోయాను నా మనస్సుని చిత్రవధ చేసుకోడమే కాదు రమని కూడా బాధ పెట్టాను" దీర్ఘంగా నిట్టూర్చి కుర్చీలో జేరపడ్డాడు రామారావు

"ఇంక మీ ముందుది వెల్లుబాటే మేష్టారూ, కొత్త వాతావరణంలో మీ జీవితాలు మూడు పూవులూ ఆరుకాయలుగా సాగిపోతాయని నా నమ్మ కం ముందు రెండు నెలల పాటు పల్లెలో ఉండి విశ్రాంతిగా ఉండండి నేనూ జానకీ ఆ వంకని పోలిడేకి వెడతాం" నవ్వుతూ అన్నాడు సుందరం

"అద్భుతంగా ఉందీ ఎరేంజిమెంటు, మేం ఎంతో తొందరగా అక్కడికి వస్తే మీరంత త్వరలో విహారయాత్రకి బయలుదేరుతారన్న మాట ఈ సంగతి రమకి చెప్పారంటే ఈరోజే ప్రయాణం కట్టేసునుగా!" గట్టిగా నవ్వేశాడు రామారావు

రామారావు అన్నట్లుగానే రమ మరునాటి ఉద యానికే సామానులు బండి కెక్కించడానికి సిద్ధం చేసేసింది లారీ మాట్లాడి ఉదయాన్నే సుందరం సామాను పంపించేశాడు ఇల్లు యింటాయన కప్పగించి మధ్యాహ్నం రెండు గంటల బస్సుకి, బయలుదేరారు ముగ్గురూ.

సరళా కొంతమంది స్నేహితులూ, కొందరు విద్యార్థులూ ఉపాధ్యాయులూ సాగనంపడానికి బస్సు దగ్గిరకి వచ్చారు పట్నానికి గుడ్‌బై చెప్ప డంలో రామారావుకి బాధ అనిపించలేదు

ఎక్కినవాళ్ల మనస్సునిబట్టి ఉంటుంది కాబోలు కాలం పోకడ బస్సు ఆగమేఘాల మీద ప్రయాణం చేస్తోందా అనిపించింది రమకి లంత త్వరగా వచ్చే సింది ఊరు.

* *

ఇల్లు శుభ్రం చేసి రమకోసం తూర్పు వైపు గది సిద్ధం చేసిందిజానకి విశాలమైన మంచంమీద పాలనురుగులాంటి తెల్లని దుప్పటి పరిచింది గోడ వారగా పాప కోసం చిన్న మంచం వేసి పక్క వేసింది. కిటికీ కెదురుగా టేబులు వేసి కుర్చీ వేసింది బల్ల మీద లాంతరు వెలిగించడానికి సిద్ధంగా ఉంచింది గోడకి బుడ్డి దీపం తగిల్చింది

రమావాళ్లూ గుమ్మంలోకి రాగానే ముందువచ్చి పాపని అందుకుంది జానకి జానకి ఎంతో ఉత్సా హంగా ఉంది "ఎలాఉంది పాప?" అంటూ లోప లికి దారి తీసింది

తల్లిదగ్గిరకి వెళ్లి కూర్చుంది రమ ఆమె మనస్సు ఎంతో తేలికగా ఉంది "నాకు చాలా సంతో



# హృదయం చిగిర్చింది

షంగా ఉందమ్మా, నన్నుగురించి నువ్వు బెంగపడ కూడదు" అంది ఆప్యాయంగా

అంతా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేస్తూంటే; పాపని ఒళ్లో కూర్చోపెట్టుకున్న రమ తల్లికి ఆనందంతో కంట నీరువచ్చింది 'ఇంత సరదాగా యీ ఇంట్లో అంతా ఉండిఎన్నిరోజులైంది' అనుకున్నారామె

స్వంతయింట్లో స్వేచ్ఛగా గట్టిగా మాట్లాడుతూన్న రమని చూసి సన్నగా నవ్వుకున్నాడు రామారావు "ఎంతసన్నిహితులమైతే మటుకు మనిషిని మనిషి అర్థం చేసుకుందుకు టైంపడుతుంది" అనుకున్నాడు తెల్లని పక్కమీద పడుకుంటూ తమలపాకులు పళ్లెంలో పెట్టి పట్టుకొస్తూ రమ అంది 'అప్పుడే పడుకున్నారా? జానకి ఈ తమలపాకులు వేసుకోకపోతే మనిద్దరం దెబ్బలాడుకున్నాం అనుకుంటుంది!' అంటూ నవ్వుతూ మంచంపట్టెమీద కూర్చుంది ఒక్కొక్క ఆకుకీ సున్నం రాసి చీల్చి అతని నోటికందిస్తూ కబుర్లు చెప్తూంది అన్నీ వింటూ ఏవేవోలోకాలలో విహరిస్తున్నాడు రామారావు "పాప ఏది?" అడిగాడు "అమ్మమ్మ దగ్గిర పడుకుని నిద్రపోయింది" అంటూ దీపంచిన్నది చేసింది రమ

రామారావుని ఇంటికి మగదిక్కుగా చేసి జానకిని తీసుకుని బయలుదేరాడు సుందరం జాగ్రత్త, అంటూ ఒకటికి పదిసార్లు హెచ్చరించారు రమతల్లి

* * *

సుందరం జానకీ వెళ్లిన దగ్గర నుంచీ ఇంటి బాధ్యత రమకి, పైపనుల బాధ్యత రామారావుకి వచ్చింది పొలాలు రైతులు, పనిపాటలు చేయించడం అంటే రామారావుకిప్పుడు సరదాలేదు ఆపని తెలియదుకూడా అందుకే తన పొలాలపని పూర్తిగా పైవాళ్లకి అప్పగించి చేతులు కడుక్కున్నాడు ఇక్కడ సుందరం అలాకాదు పాలేరు చేతపని చేయించుకోడమే కాదు పాలేరు కుటుంబం అంతా కూడా తన బాధ్యతగానే పరిగణిస్తాడు కాబోలు! రోజుకి ఒకళ్ళువచ్చి సుందరం కోసం అడిగి పోవడం చూస్తుంటే అంతే అనిపించింది రామారావుకి

'చూడూ బాబూ ఎవరో సుందరం కోసంవచ్చారు' అని పిలిచారు రమతల్లి

ఆవచ్చింది మునసబు దగ్గిరనుంచి వచ్చిన పెద్దమనిషి "ఈవారంలో రాతకోతలు అయిపోవాలన్నాడే" అన్నాడు—సుందరం ఊళ్లో లేడనివిని

'వచ్చేస్తారు వచ్చాక గాని పని జరగదు' అని ఖచ్చితంగా చెప్పేశాడు రామారావు

ఇంట్లో రమ వచ్చింది బయటికి

"అమ్మాయిగారా!" అంటూ ఆశ్చర్యపడ్డాడా పెద్దమనిషి

"ఏం గోపన్న బాబూ, ఏమిటి? సంగతేమిటి?" అడిగింది రమ

'ఏం లేదమ్మా, నువ్వున్నావని తెలియదు నష్టపడ్డినా చాలు సంతకాలు సుందరంబాబు నాలుగెకరాలు బేరం చేశాడు చిట్టితల్లికోసం అదే రాతకోత అవ్వాలి కాగితాలు పట్టుకొస్తాలే' అంటూ వెళ్లిపోయాడు

'ఏమిటమ్మా గోపన్న బాబు చెప్తూంట?' కుతూహలంగా తల్లి నడిగింది రమ

'నీ శిస్తుతో పొలం కొంటున్నాడు సుందరం' అన్నారామె

"నాకెందుకమ్మా పొలం?" ఆశ్చర్యంగా అడిగింది రమ

"నాకేం తెలుసుతల్లీ, మీనాన్న సుందరానికిసగం ఆస్తి రాశారు అంచేత నీవంతుగా వాడు చెయ్యి పెట్టనన్నాడు అదంతా నీ డబ్బే' అని సుందరం పొలాల విషయంలో ఎంత అభివృద్ధి సాధించాడో చెప్పారామె

'సుందరం బావ చూశారా? మనపాపకోసం పొలం బేరం చేశాట్ట' అంటూ రామారావుకి విశేషాలు చెప్పింది రమ

* * *

పల్లెటూళ్లో ఎలా పొద్దు పోతుందో తెలియకుండా కాలం గడిచిపోతోంది

ఏ ఊళ్లో ఉంటే అక్కణ్ణుంచి ఒక కార్డురాసి పారేస్తున్నాడు సుందరం

పగలంతా ఆపనీ యీపనీ చూడ్డం సాయంత్రం అయేసరికి పాపని నడిపించుకుని అలా పొలాలగట్లమ్మట తిరిగి రావడం దినచర్యగా తయారైంది

దంపతుల మనస్సులు తేలిక కావడంలో చీకూ చింతాలేకుండా కాలం సాగిపోతోంది "పల్లీ కొత్త పూళ్లో ఇబ్బంది పడవలసి వస్తుంది" అంటూ రమ తల్లి ఎన్నో రకాల పూరగాయలు, ఒడియాలు సిద్ధం చేయడం ప్రారంభించారు ఆడదాని చాపల్యం ఎక్కడికి పోతుంది? రమకూడా పాతవి మార్చికొన్నీ, కొత్తవికొన్నీ నగలూ అవీ చేయించడం ప్రారంభించింది

ఈ హడావుడి అంతా సరదాగా చూస్తూ కాలం నిశ్చింతగా గడుపుతున్నాడు రామారావు "ఇదిగో యీ మాదిరి బాగుంటుందా" అంటూ మధ్యనేదో ఒక సూచనకోసం వస్తూండే రమని చూస్తే అమితమైన అభిమానం పుట్టుకు వస్తూంది రామారావుకి.

"నువ్వేం పెట్టుకున్నా ఒకటే" అన్నాడు సరదాకి.

"అంటే ఏది పెట్టుకున్నా బాగుండదనా?" రెట్టించింది

"నువ్వేం పెట్టుకున్నావో నేను చూస్తేగా!" నవ్వుతూ అన్నాడు రామారావు

"మీరెందుకు చూస్తారులెండి!" మూతిముడుచుకుంది రమ

"నేను నిన్నే చూస్తానురమా, నువ్వు ఏంపెట్టుకున్నావని చూడను" అన్నాడు— దూరంగా పోతున్న రమని దగ్గిరికి లాక్కుంటూ

పల్లెటూరిలో విశ్రాంతిగా ఉంటూ తింటూ తిరుగుతున్న రామారావు కాలం స్తంభించి పోయింది అనుకున్నాడు కాని అది చాలా త్వరగా గడిచిపోవడం గుర్తుకిరాలేదతనికి! ఆరోజు పోస్టులో వచ్చిన ఆర్డరులో రెండునెలలూ గడచిపోయినట్టు గుర్తుకి వచ్చింది

"అప్పుడే రెండునెలలు గడచి పోయాయా?" [illegible] ఆశ్చర్యం ప్రకటించాడు.

"నేను అన్నీ సర్దేశాను ఇక సుందరం బావ జానకీ రాగానే మనం ప్రయాణం కావడమే" అంది రమ

పోనీ నేను ముందు వెళ్ళి ఇల్లూ వాకిలీ చూసి నీకు రాయనా?" అనుమానంగానే అడిగాడు రామారావు

వద్దు వద్దు ఇద్దరం కలిసే వెళ్ళిపోదాం! ఏ వారంరోజులు యిబ్బందిపడ్డా ఇల్లు అదే దొరుకుతుంది" అంది రమ

"నీ యిష్టం రమా" అన్నాడు రామారావు

అనుకున్నట్టుగానే ఆ ఆదివారంనాడు సుందరం జానకీ దిగారు జానకి ముఖం చూడగానే కనిపెట్టింది రమ—ఎంత ఎంజాయిచేసిందో— యీ రెండునెలలూ

రాత్రి భోజనాల దగ్గిర రహస్యంగా అడిగింది జానకిని

'ఏంకథ?' అని

ఇంతట్లోకే సుందరం అక్కడికి రావడంతో రమ సిగ్గుపడి అవతలికి వెళ్ళిపోయింది

ఏమిటి జానకీ రమ అడుగుతోంది?" పీటవాల్చుకు వంటింట్లో కూర్చుంటూ అడిగాడు సుందరం

'ఏంలేదు' నవ్వుతూ అనేసినా జానకి బుగ్గలు ఎర్రబడ్డాయి

'పోనీలే మీ స్నేహితురాళ్ళ రహస్యాలు మాకెలా తెలుసాయిగాని, నాకూ రామారావుకూ కొంచెం కాఫీనీళ్ళు పోయి అలా తిరిగి వస్తాం' అడిగాడు

కాఫీగ్లాసులు రెండుచేతులా పట్టుకుని ఇవతలికి వచ్చాడు సుందరం రామారావూ తనూ కాఫీముగించి అలా తిరిగిరావాలని ప్లాను

"నువ్వేం పని చెప్పకపోతే మేం అలా తిరిగివస్తాం" అన్నాడునవ్వుతూ రమతో

వెళ్ళిరండి బావ, మరీ ఆలస్యం చెయ్యకండి" అంటూ సాగనంపింది వాళ్ళని యిక జానకితో హాయిగా బాతాఖానీ కొట్టవచ్చునని

అదే ఉద్దేశ్యంతో తిన్నగా వంటింట్లోకి వడిచి ఇందాకా సుందరం కూర్చున్న పీటమీద కూర్చుంది రమ జానకివంట పనిలో నిమగ్నమైపోయింది

వోయి నేనిక్కడో మనిషిని ఉన్నాను,చూశావా" అంది రమ

"మరి రేపొద్దున్నేవెళ్ళి పోతానుకదా సంగతులు చెప్పవా?"

ఏముంటాయి చెప్పడానికి రమా నేనూ మీ బావా పుణ్యక్షేత్రాలన్నీ తిరిగాం మీ బావగారు చెప్పారు— ఆదివిహారయాత్రకాదు తీర్థయాత్రలని!" నవ్వుతూ బదులు చెప్పింది జానకి

'రెండింటి ధ్యేయం ఒక్కటే అయినప్పుడు యాత్ర పేరు ఏదైనా ఒకటే జానకీ'

'నాకూ ఆనమ్మకం దొరికింది బావెప్పుడూ అంటిముట్టనట్టుంటే నాకర్థం అయ్యేదికాదు కాని యిప్పుడాయన్ని పూర్తిగా అర్థం చేసుకున్నాను రమా నీకోసం ఆయన ఎంతటి త్యాగానికైనా సిద్ధమే ఎప్పుడవసరం అయినా గుర్తుంచుకో"

"జానక ఒకరి త్యాగాలతో అవసరం లేకుండా పోవచ్చుగాకి ఈ మధ్యలో ఎంతటి తుఫాను వచ్చిందో దాన్ని ఇద్దరం కలిసి ఎలా ఎదుటుబడో నిలభామో తలుచుకుంటే— ఇకమేం ఇద్దరం మా సమస్యలని పరిష్కరించుకోగలమని నాకు నమ్మకం కల్గింది" అంటూ సంగతులన్నీ జానకి ముందు వెళ్ళకక్కి తేలికగా నిట్టూర్చింది రమ

"అందుకే నువ్వు అప్పటికీ ఇప్పటికీ ఏం మారలేదు అంటారు బావ నీకేం కావాలో నాకు తెలియదని అది తెలిసేదాకా ఎవరికీ విశ్రాంతి ఉండనివ్వదనీ అన్నారు తెలుసా?"

"బావకీ అసంగతి బాగా తెలియాలి జానకీ ఏ కష్టంవచ్చినా సుఖం వచ్చినా బావే చూశాడు'

ఆసంగతే చెప్పారు అందుకే నువ్వు స్థిరపడితేగాని మా జీవితాలు స్థిరపడవన్న సత్యం ఎప్పుడూ జ్ఞాపకం చేసుకుంటూ ఉండు రమా మీ బావలాంటి వ్యక్తులు చాలాఅరుదు వారు స్వార్థాన్ని కపోతంగా ప్రేమని చూడకలరు అంటూనే స్టౌ ఆర్పేసింది జానకి— వంటపని అయిపోయినట్టుంది పాపకిచిన్నగిన్నెలోకి అన్నంతీసి కలిపింది దానికి వేడివేడిగా బువ్వపెట్టి నిద్రపుచ్చేసరికి రామారావూ, సుందరం తిరిగి వచ్చారు

అంతా సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు ముగించారు మరునాటి సాయంత్రం దాకా రైలులేకపోయినా ఉదయం తొమ్మిదిదాటగానే మంచిదని అప్పుడే ప్రయాణ ముహూర్తం పెట్టించారు రమతల్లి

తెల్లవారి త్వరగా లేవాలంటూ అంతాత్వరగా నిద్రకి ఉపక్రమించారు

పల్లెటూళ్ళలో తెల్లవారడం ఒట్టే తెలుస్తుంది. పట్నాలలో లేపితే లేవనివాళ్ళకి పరిహితం పల్లెలో దానంతట అదే తెలివివచ్చేస్తుంది అన్నిరకాల వింత ధ్వనుల సమ్మేళనం మనం ఇంకెక్కడా వినలేం. దూరంలో ఎక్కడో ఉండిఉండి ఏ కాకి అరుస్తుంది ఎక్కడో ఏ కోడీ కొంపలంటుకున్నటు కొక్కొరొకో అంటూ అదేపనిగా పాతరికార్డులాగా



మేలిముసుగులో మహదానందం (ఫోటో: బ్రహ్మదేవ్)

కూస్తోంది ఆవులు, దూడలు వాటి అరుపులువీటి మధ్య పాలెళ్ళ హడావిడి ఇంటిల్లిపాది ఆర్డర్లు— అన్నీ ఒక స్వరమేళం

మంచి ముహూర్తానికి పదినిముషాలు ముందరే అంతా తయారై పోయారు చివరి క్షణంలో జ్ఞాపకానికి వచ్చేవీ చేయవలసినవీ చెకచెక చేస్తోంది జానకి

తల్లి పాదాలకు వంగి దండం పెట్టింది రమ 'వెళ్ళివస్తానమ్మా'అని

"క్షేమంగా వెళ్ళిరాతల్లీ, సెలవులకి తప్పకుండా రండి అన్నారామె

"వెళ్లొస్తామండీ" అంటూ అత్తగారికివీడ్కోలుచెప్పాడు రామారావు

"వెళ్ళిరాబాబూ, జాగ్రత్తగా వెళ్ళిరండి"అన్నా

# హృదయం చిగిర్చింది

రమె

ఆమె గంభీరంగా నిలబడిన ధోరణి చూసి 'మానసికంగా అత్తయ్య ఎంతఎత్తు పెరిగిందీ!'అని ఆశ్చర్యపోయాడు సుందరం

సామానులు క్లుప్తంగా పాక్ చేసింది రమ అంతాకలసి బస్సులో పట్నానికి బయలు దేరారు — రైలుకి అందుకోడానికి

కొద్ది గంటలకే కదా అని రిటైరింగు రూము తీసుకున్నాడు రామారావు వూళ్ళో దిగుతూనే సరళ కోసం కబురంపాడు

రిటైరింగు రూములోనే కూర్చుని కబుర్లు చెప్పుకున్నారంతా.

సాయంత్రం టిక్కెట్టు అయిపోయింది రైలు కోసం అంతా ప్లాటుఫారంమీద చేరారు పాప అన్నీ వింతగా చూస్తోంది సుందరం రైల్లో సామాను పెట్టిస్తున్నాడు

"అంతదూరం వెళ్ళిపోతే నన్ను మరిచిపోతావా?" కంటతడిపెట్టుకుంటూ రమ భుజంమీద చేయి వేసింది సరళ

స్నేహితురాలి నడుంమీద చేయివేసి దగ్గరికి తీసుకుంది రమ

ఇద్దరూ కంటతడిపెట్టుకుని మౌనంగా ఉండిపోయారు

"అక్కడా కాలేజీయే సరళా, సెలవలూ అవీ ఉంటాయి!" నవ్వుతూ అన్నాడు రామారావు

ప్లాటుఫారంమీద అందరినీ వింతగా మెరిసే కళ్ళతో చూస్తుంది పాప

రమ కంపార్టుమెంటులోకి వెళ్ళి కూర్చుంది. కటికీలోంచే కబుర్లు చెప్తోంది టైమైంది మీరూ ఎక్కేయండి"అని హెచ్చరించాడు సుందరం.

రామారావుకూడా రైలు ఎక్కాడు

కిటికీ కటకటాలలోంచే పాపని ముద్దులాడుతూంది సరళ

పక్కనే నిలబడ్డ వో ముత్తయిదువు అదిచూసి 'ఎవరిపాప అమ్మా?' అంది 'మా అక్కపాపండీ, దూరం వెళ్ళి పోతూంది'అంది సరళ తడుముకోకుండా "ఎన్నాళ్లయిందమ్మా పెళ్ళయి?" అడిగిందావిడ కుతూహలంగా

"నాలుగేళ్ళయింది బామ్మగారూ, ఈసారి బాబుతోనే ఎస్తుంది మాఅక్క"అంది సరళ రమకేసిచూసి చిలిపిగా నవ్వుతూ

రైలు పెట్టెలు నెమ్మదిగా కదలడం ప్రారంభించాయి కనిపించినంత దాకా సరళ చేయి వూపుతూనే ఉంది రమచేయికి తన చేయి జతకలిపి వూపాడు రామారావు

రైలు మళుపు తిరిగింది

తన సీటులో కూలబడింది రమ "రమా పాప అప్పుడే జోగుతోంది పక్కవేయి" అన్నాడురామారావు

పాపకి సీటుమీద పక్కవేసి, దొర్లిపోకుండా తలగడా అటు పెట్టింది పాపని పడుకోపెట్టింది

"రమా ఇలారా, నాపక్క కూర్చో" అంటూ ఆహ్వానించాడు రామారావు

వెళ్ళి అతని పక్కనే కూర్చుంది

రమచేయి తన చేతిలోకి తీసుకున్నాడు "రమా, నేను తీసుకున్న నిర్ణయంలో నాకు దృఢ విశ్వాసం ఉంది మన ముందుబాట సుగమంగా సాగిపోవాలంటే మనంపడ్డ మన క్లేశాన్ని మరచిపోవాలి మరిచిపోతావుకదూ!మీ ఇద్దరి బాధ్యతా నాపై పెట్టి నిశ్చింతగా ఉంటావుకదూ?"

"ఒకరొకరు క్షమించుకుందాం మాష్టారూ!" అంది నవ్వుతూ రమ

'ఇప్పుడే నిజంగా మన హృదయాలు చిగిర్చాయి రమా, కొత్త జీవితంతో అవి మారాకు తొడుగుతాం? ఎన్నో వసంతాలు తప్పకుండా చూస్తాయి. అవునా?"

▌ రమ ఏం సమాధానం చెప్తుంది?

తృప్తిగా నిట్టూర్చి రామారావు భుజంపై తల ఆన్చింది. (అయిపోయింది) ●



## గొల్లభామ

ఎంత అమాయకమైన పేరు! ఇలాటి మోసకారి జీవికి అటువంటి పేరు నిజంగా అన్యాయమే ఇంగ్లీషులోకూడా దీన్ని 'ప్రార్థించే మేంటిసు' అంటారు దానికి బదులు 'భక్షించే మేంటిసు'అంటే బాగుంటుందేమో.

సాధారణంగా ఆకుపచ్చగా, ఆకును పోలి ఉంటుంది వేరు రంగుల్లోకూడా ఉంటాయి. తల చక్కగా ఇటూ అటూ తిప్పుతుంది. పెద్ద కళ్ళు ఈ రెండు గుణాల్లో గొల్లభామే! అయితే ముందు జత కాళ్ళు రెండూ రెండు కత్తెరలే. వాటికి వాడి ముళ్ళుంటాయి. సాధారణంగా ఆ రెండు కాళ్ళూ పైకి ఎత్తి దగ్గరగా చేరుస్తుంది, నమస్కారం చేస్తున్నట్లుగా. అందుకే ప్రార్థించే జీవి అన్నారు. కాని అంతా మోసం. మరొక పురుగు తిండానికి ఎక్కడ చిక్కుతుందాని కాచుకొని ఉంటుంది.

పిల్లి ఎలకను పట్టే చాతుర్యం కన్నా మిన్నగా చూపిస్తుంది దగ్గరగా పురుగు వాలితే, నెమ్మదిగా పిల్లిలాగా పోయి, అడకత్తెరలో బిగించేస్తుంది!

—జమ్మి కోనేటిరావు




■ ఉత్తరదేశపు రాజును, ఆ దేశపు సైన్యాధిపతి చంపివేసి, రాజ్యాన్ని ఆక్రమించుకొన్నాడు నాలుగైదు సంవత్సరాల వయస్సు కలిగిన ఉత్తర దేశపు రాజు కుమారుడు సైన్యాధిపతి చేతికి చిక్కాడు.

ఉత్తరదేశపు మంత్రి చాలా కష్టం మీద ఆరాజ్యంనుండి బయట పడ్డాడు అతను మల్లన్న మంత్రిని కలుసుకొని, జరిగిన సంగతినంతా తెలియజేశాడు. ఉత్తరదేశపు సైన్యాధిపతిమీద దండ యాత్ర చేయడానికి కొంత సైన్యాన్ని యివ్వవలసినదిగా అతను మల్లన్న మంత్రిని కోరాడు

సైన్యాధిపతి మీద అప్పుడు దండెత్తినట్లయితే అతను రాజకుమా రునకు హాని కల్గించవచ్చునని మల్లన్న మంత్రి అభిప్రాయపడ్డాడు అందుచేత యుద్ధ మార్గం కంటే యుక్తి మార్గమే మంచిదని మల్లన్నమంత్రి ఉత్తరదేశపు మంత్రికి బోధించాడు తరువాత యేమి చేయాలో కూడా మల్లన్నమంత్రి అతనికి చెప్పి, పంపి వేశాడు.

కొంతకాలం పోయిన తరువాత ఉత్తరదేశపు మంత్రి మారు వేషంలో ఉత్తరదేశపు సైన్యాధిపతి వద్దకు వెళ్ళి యిలాగ అన్నాడు.

'ప్రభూ ! నేను ధన్వంతరి అనే వైద్యుణ్ణి చాలాకాలం నేను కృషి చేసి, 'అమృత రసాయనం' అనే ఔష ధాన్ని తయారుచేశాను దీనిని సేవిం చినవారికి వార్ధక్యం ఉండదు దీర్ఘా యుర్దాయం కలుగుతుంది. తమరు దీనిని స్వీకరించి నాకు తగిన ధనాన్ని యివ్వవలసినదిగా కోరుతున్నాను.'

దీర్ఘాయుర్దాయం అనగానే సైన్యాధిపతికి ఆశ కలిగింది అయినా వచ్చిన వైద్యుడు కొత్తవాడు అందు చేత వెంటనే ఔషధాన్ని తీసికొనడం మంచిదికాదు అప్పుడు సైన్యాధిపతి 'ఆ ఔషధంలో కొంత మోతాదును తీసికొనవలసినదిగా ధన్వంతరిని కోరాడు

సైన్యాధిపతి కోరిన ప్రకారం ధన్వంతరి కొంచెం మందును అందరూ చూస్తుండగా నోట్లో వేసికొన్నాడు. దానివల్ల అతనికి హాని యేమీ కలగ లేదు. అప్పుడు సైన్యాధిపతికి ధన్వం తరిమీద నమ్మకం కలిగింది. సైన్యాధి పతి ఆ మందు వేసికొన్నాడు. తరువాత కొద్దిసేపట్లోనే సైన్యాధిపతి మర ణించాడు.

వెంటనే మంత్రి తన మారువేషాన్ని తీసివేశాడు. అంతవరకూ సైన్యాధిపతి యెడల భయంతో ఉన్న పౌరులందరూ మంత్రికి జయ జయ ధ్వానాలుచేశారు మంత్రి అప్పుడు రాజకుమారునకు పట్టాభిషేకం చేశాడు. రాజకుమా రుడు పెద్దవాడు అయ్యేవరకూ మంత్రి రాజ్యభారాన్ని వహించాడు.

'ధన్వంతరికి హానిచేయని ఔషధం సైన్యాధిపతిని యెలాగ చంపగలిగిందని రాజు మల్లన్న మంత్రిని ప్రశ్నించాడు అందుకు మల్లన్నమంత్రి యిలాగ సమాధానం చెప్పాడు.

'ప్రభూ! ఉత్తరదేశపుమంత్రి ముందుగా కొంచెం కొంచెం మోతా దుతో విషాన్ని తన శరీరానికి అల వాటు చేసుకొన్నాడు తరువాత అతను సైన్యాధిపతివద్దకు విషాన్ని తీసికొని వెళ్ళాడు. మంత్రి శరీరానికి విషం అలవాటు కావడంవలన అది అతనికి హాని చేయలేదు. సైన్యాధిపతి ఆ విషాన్ని మింగి మరణించాడు

మల్లన్న మంత్రియుక్తిని రాజు యెంతగానో మెచ్చుకొన్నాడు.●









ఉదయం ఎనిమిదన్నర గంటలయింది. రేణుకాదేవి వంటా, వార్పూ ముగించుకుని ముందు గదిలోకి వచ్చి వాలు కుర్చీలో కూర్చుంది. ఆ తర్వాత భగవద్గీత చేత బట్టుకుని చదువ నుపక్రమించింది. ఐతే ఆవిడ దృష్టినీ, మనసునూ దానిపై లగ్నం చెయ్యగల్గినదల్లా పదినిముషాలు! ఆవిడ దృష్టీ, మనసూ చెదరటానికి హేతువల్లా పిచుకలగోల. చిరాగ్గా తలెత్తి ఆవిడ వేంవైపు చూడనే చూసింది. కొద్ది గజాల దూరంలో ఓ పిచుకపిల్ల ఎగరటానికి ప్రయత్నంగా కుప్పిగంతులు వేస్తున్నది. దాని చుట్టూ రెండు పెద్ద పిచుకలు 'కిచకిచ'లాడుతూ ఎగురుతున్నాయి. ఆ పెద్దవాటిని చూసి, 'తల్లి పిచుకా, తండ్రి పిచుకా కాబోలు' అనుకున్నది రేణుకాదేవి. కొద్ది క్షణాలు గడిచాక పెద్ద పిచుకలు రెండూ కిటికీలోంచి బయటకు వెళ్ళిపోయాయి. రేణుకాదేవి భగవద్గీత బల్లమీద పెట్టి, ఆ పిచుక పిల్లవైపు కుతూహలంతో కళ్ళింతవి చేసుకుని చూడసాగింది. ఆ పిచుకపిల్ల ముద్దొస్తున్నది. కుడివైపు రెక్కల మీద తెల్లని రంగు. బెదురు బెదురుగా చూస్తున్న కళ్ళు. 'పాపం ఇంకా పసిముండ. రెక్కలింకా పూర్తిగా విడలేదు కాబోలు.. అప్పుడే ఎగరాలన్న తహతహ' అనుకున్నది రేణుకాదేవి. ఇంతలో పెద్ద పిచుకలు రెండూ వచ్చి పిల్ల పిచుకదగ్గర వాలి, వంతులవారీగా దాని నోటికి ఆహారాన్ని అందించసాగాయి. పిల్లపిచుక 'కిచకిచ' లాడుతూనే అవి అందించిన ఆహారాన్ని కడుపులో వేసుకుంటున్నది. ఆహార మందించాక పెద్ద పిచుకలూ రెండూ కొద్ది క్షణాలు 'కిచకిచ' లాడాయి. 'నేనూ ఉన్నానంటూ' పిల్ల పిచుకా 'కిచకిచ' లాడింది. పెద్ద పిచుకలు రెండూ వెళ్ళిపోయాయి. పిల్లపిచుక ఎగరటానికి తిరిగి ప్రయత్నాలు మొదలెట్టింది.

గోడ గడియారం గంటలు విన్పించడంతో ఉలిక్కిపడి దానివైపు చూసింది రేణుకాదేవి. తొమ్మిది గంటలయింది. కంగారు కంగారుగా లేచి వంటగది వైపు దారి తీసిందావిడ. కంచంలో అన్నం వడ్డించుకుని కూర్చుంది. రెండు ముద్దలు

దిగ (మింగిందో లేదో ఆవిడకు పిచుకపిల్ల గుర్తుకొచ్చింది పాపం రెక్క లింకా పూర్తిగా విడలేదు, ఎదగటానికి పూర్తిగా రాదు! పసితనం మనిషికైతేనేం, పక్షికైతే, జంతువుకైతేనేం—ఒకటే. ఆ వయసులో పోషణ భారమంతా జన్మకు కారకులైనవారిది ఆ పిచుకపిల్లను గురించి ఆలోచిస్తూంటే ఆవిడ మనసు మరో దారిన పోసాగింది. గతమంతా తెరలు తెరలుగా కళ్లముందు మెదలసాగింది మరిక అన్నం సహించింది కాదు కంచంలో చెయ్యి కడుక్కుని, ఆ ఎంగిలి కంచం తూముదగ్గర పెట్టేసింది, పమిటచెంగుతో చేతులు తుడుచుకుంటూ ముందు గదిలోకి వచ్చింది. అప్రయత్నంగా గడియారంవైపు చూసింది. తొమ్మిదింబావు దాటింది పిచుక పిల్లవైపు చూసింది. అదింకా నేలమీదే వుంది అయితే గెంతడంలేదు, ముడుచుకుని కూర్చుని బెదురుబెదురుగా నలుమూలలా చూస్తున్నది. దాన్ని చూస్తూంటే రేణుకాదేవికి జాలిపుట్టుకొచ్చింది. 'పాపం ఆకలి తీరలేదు కాబోలు తల్లిపక్షీ, తండ్రిపక్షీ ఎక్కడికి వెళ్లాయో......' అనుకుని లోపలకి వెళ్లింది నాలుగు అన్నం మెతుకులు గుజ్జుగాచేసి ఓసీసా మూతలో వేసింది, మరో సీసామూతలో కాసిని నీళ్లుపోసింది అవి రెండూతెచ్చి పిచుకపిల్లదగ్గర పెట్టింది. అయితే పిచుకపిల్ల వాటివైపు కన్నెత్తి చూడలేదు

'అదే తింటుంద'నుకుని వెనుదిరగబోయేంతలో నల్లపిల్లి గుర్తుకొచ్చింది ఆవిడ మనసు అవ్యక్తమైన బాధతో నిండిపోయింది పిచుకపిల్ల ఎగరలేదు ఆ నల్లపిల్లి కంటబడితే దాన్ని 'స్వాహా' చెయ్యకుండా వుండదు అంతేకాక, తలుపు మూస్తే చాలు ఎలుకలు స్వైరవిహారం మొదలెడతాయి అవి చూసినా, పిచుక పిల్లను ప్రాణాలతో వుండనియవు ఉన్న ఒక్క కిటికీ మూసేసి నల్లపిల్లి బారి నుండి రక్షించగలదు ఎలుకల బారినుండి దాన్ని రక్షించాలంటే బల్లమీద పెట్టాలి వంగుని పిచుక పిల్లను చేత్తో ముట్టబోయి, చెయ్యి వెనక్కు తీసేసింది రేణుకాదేవి నరుడి స్పర్శకు బండరాళ్లకూడా కరుగుతాయంటారు! అందువల్ల దిన పత్రిక మడిచి, దాని సహాయంతో బల్లమీద కెక్కించాలన్న నిర్ణయానికి వచ్చింది అయితే అది అంత సులభమైనపనిగా తోచిందికాదు పిచుకపిల్లను పత్రికమీదకు ఎక్కించబోతే క్రింద కెగుర్తోంది చివరికి కెలాగైతేనేం విజయాన్ని సాధించింది రేణుకాదేవి! పిచుకపిల్ల ప్రక్కనే అన్నం వున్నమూతా, నీళ్లున్నమూతా పెట్టింది 'తనకేం పట్టన'ట్లు మరోవైపు చూస్తూ ముడుచుకుని కూర్చుంది పిచుకపిల్ల 'తినకే చేస్తుంద'న్న నిర్ధారణకు వచ్చి లోపలి గదిలోకి దారితీసింది రేణుకాదేవి ఆదరాబాదరాగా బట్టలు మార్చుకుంది జుత్తుసరిచేసుకోడానికి అద్దంముందుకు వచ్చి నిలబడింది ఆ అద్దంలో వెనుక గోడకు వేళ్లాడగట్టిన ఫోటో ప్రతిబింబం కన్పిస్తున్నది కొద్దిక్షణాలు తన ప్రతిబింబాన్ని చూసుకుంది రేణుకాదేవి పేలవమైన కళ్ళు ... అక్కడక్కడ నెరసిన కేశాలు ముడతలుపడ్డ చెక్కిళ్లు ఫోటో ప్రతిబింబంపై ఆవిడదృష్టి మరలింది. అది తన పెళ్లినాటి ఫోటో భర్త ప్రక్క తను .మెడలో గులాబీపూల చెమికీదండ . నుదుట రూపాయికాసంత కుంకుమ బొట్టు.. ఒత్తయిన నల్లని తలకట్టు... పాలరాతికన్న నునుపైన చెక్కిళ్ళు ..... భవిష్యత్తుపై తియ్యని కలలుగనే కళ్ళు... ఇప్పుడవేమీలేవు కళ్ళు భవిష్యత్తుపై తియ్యని కలలు కనవు . . దీర్ఘమైన నిట్టూర్పు విడిచి, ఆర్ద్రమైన కళ్ళు తుడుచుకుంది. ఆ గదితలుపులువేసి, ముందు గదిలోకి వచ్చింది. కిటికీ తలుపులు మూసేసి, పెద్ద పిచుకలు రావడానికి వీలుగా 'వెంటిలేటర్' తెరచింది గొడుగు చేతబట్టుకుని, ఇంటికి తాళంవేసి, రెండో అంతస్థునుండి భారంగా అడుగులువేస్తూ మెట్లుదిగి రోడ్డుమీదకువచ్చి రిక్షా ఎక్కింది. రిక్షా ఎక్కినా, ఇంటికి దూరమవుతున్నా, ఆవిడ మనసుకు ఆలోచనలు మాత్రం దూరమయ్యాయికాదు ఆలోచిస్తున్నంతలో రిక్షా హైస్కూలుముందు ఆగింది రిక్షావాడికి డబ్బులిచ్చి స్కూలు ఆవరణలోకి చూసింది ఎక్కడా పిల్లలు లేరు 'లేటయ్యాను' అనుకున్నది రేణుకాదేవి సుమారు పాతికేళ్ల సర్వీసులో ప్రప్రథమంగా తను లేటయింది! ఓ చిన్న పిచుకపిల్ల మూలంగా తను లేటయింది!

'ఎటెండెన్సు రిజిస్టరు'లో సంతకం చెయ్యడానికి 'హెడ్మిస్ట్రెస్' గదిలోకి దారితీసింది దినపత్రిక చదువుకుంటున్న 'హెడ్మిస్ట్రెస్' సుమతీదేవి ఆవిడవైపు చూసి

'ఏమిటి రేణుకాదేవిగారూ. ఆశ్చర్యంగా వుందే . . ఎన్నడూలేనిది మీరు లేటయ్యారేమిటి?...వొంట్లోకాని బావుండలేదా...' అన్నది.

ఆవిడ ప్రశ్నకి సమాధానమల్లా — రేణుకాదేవి పెదాలపైన మెదిలిన జీవంలేని చిరునవ్వు !

'ఇవాళ మొదటి పీరియడు వర్కుందా?...'

సమాధానంగా తలవూపింది రేణుకాదేవి

'మీకు వంట్లో బావుండకపోతే శాంతని తీసుకోమంటాము మీ క్లాసు ... 'రెస్టు' తీసుకోండి...'

'రెస్టు.. నా జీవితానికి రెస్టు...' అని లోలోపలే అనుకుని, చిరునవ్వు తెచ్చిపెట్టుకుని,

'ఫర్వాలేదు.. ఆ కూర్చునేదేదో క్లాసులోనే కూర్చుంటాను' అంటూ 'కామన్ రూము' వైపు దారితీసింది రేణుకాదేవి.

ఆవిడవైపే చూస్తూ వుండిపోయింది సుమతీదేవి

'కామన్ రూము'లో ఓ గ్లాసుడు నీళ్ళు త్రాగి సెవన్త్ క్లాసు వైపు దారితీసింది రేణుకాదేవి అంతవరకూ వరండాలో జత కూడి రణగొణ ధ్వనులు చేస్తున్న 'సెవన్త్' క్లాసు అమ్మాయిలు ఆవిడ రాకను గమనించి ఒకొక్కరే క్లాసులోకి వెళ్లసాగారు. రేణుకాదేవి క్లాసులోకివచ్చి తన కుర్చీలో కూర్చుంది. 'ఎటెండెన్సు' తీసుకుని, ఒక్కసారి చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంది బోర్డుమీద నాలుగు లెక్కలువ్రాసి, చెయ్యమని చెప్పి కుర్చీలో కూర్చుని క్లాసు పిల్లలవైపు చూడసాగింది. తెల్లని పరికిణీలూ...తెల్లని జాకెట్లూ...గులాబీరంగు వోణీలూ ... పసితనం చిందులు త్రొక్కుతున్న ముఖాలూ ... తియ్యని కలలుగనే కళ్ళూ ఆరోజుల్లో...

'రేణుకి పధ్నాలుగు నిండాయి ... దాని వయసు పిల్లలందరూ పెళ్లిళ్ళయి కాపు

# రెక్కలొచ్చిన పక్షి

రాలకు వెళ్ళారు ... మీరుమాత్రం దాని పెళ్లిసంగతి పట్టించుకోరు ... వే నెత్తీ, నోరూ బాదుకోవడమే కన్పిస్తోంది ...' అనేది అమ్మ.

'ఇప్పుడు దాని వయసేమీ మించి పోలేదు ... ఆ 'ఎస్సెల్సీ' పూర్తవనీ ... 'రాజకుమారుడు' లాంటి వరుడ్ని తీసుకొస్తాను..' అనేవాడు నాన్న అన్నయ్యా, వదినా నాన్న మాటకు వంత పాడేవారు

'మీ రందరూ ఒకటే నే నొక్కర్తినీ ఒకటి. ' అంటూ అక్కడనుండి వెళ్లి పోయేది అమ్మ.

ఆ తర్వాత ఏడాదికి తను 'ఎస్సెల్సీ' పాసయింది. అన్నమాట నిలబెట్టుకున్నాడు నాన్న ఆయనతెచ్చిన వరుడు నిజంగా రాజకుమారుడే. ఆయనపేరు ప్రకాశరావు ... సుమారు ఇరవైరెండేళ్ళ వయసు మద్రాసులో ఏదో కంపెనీలో ఆఫీసరు ... ఆయనలో ఆకర్షణలు ... విశాలమైన నల్లటి కళ్ళూ...పెదాలపై ఎల్లవేళలా నాట్యమాడే చిరునవ్వూ. ఆ రదుగుల భారీ విగ్రహ మాయనది ఆయనలో ఎంత ఆకర్షణవుందో, అంతకు రెట్టింపు హృదయ వైశాల్యముంది కట్నం విషయం నాన్న మాట్లాడబోయి నప్పుడు వారించి, 'మీ అమ్మాయే నాకు మీరిచ్చేకట్నం' అన్నారట ఆమాట నాన్న చెప్పినప్పుడు తనెంతగా మురిసిపోయింది !

తనపెళ్లి ఎంతో వైభవంగా జరిగింది ఆ తర్వాత కొద్దిరోజులకు కాపురానికి మద్రాసు వెళ్లిపోయింది. అసలు అమ్మనీ, నాన్ననీ, వదినీ, అన్నయ్యనూ వదలి వెళ్ళాలంటేనే బెంగగావుండేది కానీ ఆయన సాన్నిధ్యంలో కొద్ది రోజుల్లోనే తనవాళ్లనందర్నీ మరువగల్గింది ఆయన ఆఫీసుకు వెళ్లిన క్షణంనుండీ నిముషాలూ, క్షణాలూ లెక్కపెడుతూ, మాటిమాటికీ గడియారం వంకచూస్తూ ఆయన రాక కోసం ఎదురుచూసేది సాయంత్రం వచ్చి రాగానే దగ్గరకు తీసుకోబోతూంటే కోటు నలిగి పోతుతదనో, టై నలిగి పోతుందనో అనేది తను. 'అది నీకంటే ఎక్కువా ఏమిటీ' అంటూ మరింత దగ్గరగా తీసుకుంటూంటే, తప్పించుకుందా మనుకుంటూనే ఆ బలమైన హస్తాలమధ్య 'బంది' అయిపోయేది ఆ తర్వాత ఆయనకు రోజూ ఇచ్చే బహుమానం ఇవ్వాల్సిందే! ఆయన సాన్నిధ్యంలో నిముషాలు క్షణాలుగా, గంటలు నిముషాలుగా దర్లిపోయేవి.

ఎంత ఆఫీసరయితేనేం. ఉత్త అమాయకపు మనిషి.. ఉత్త పిరికిమనిషి ఓ రోజు ఉదయం తిన్నది వమనం చేసుకుంటే ఎంత కంగారు పడిపోయారు? ముఖంలో చెమటలు కళ్లల్లో భయం కాళ్లల్లోవణుకు .. 'ఇదేం జబ్బుకాదనీ, అనవసరంగా కంగారు పడద్దనీ' చెబితే వినిపించుకుంటేకద ... ఆదరా బాదరాగా బట్టలు మార్చుకుని లేడిడాక్టరు దగ్గరకు పరిగెత్తారు. పావుగంటలో లేడిడాక్టరు 'స్టెతస్కోపు' వూపుకుంటూ వచ్చింది. పరీక్షించి, శుభాకాంక్షలు అందజేసి, 'మీ ఆయన ఉత్త పిరికి మనిషి సుమండి ' 'మా ఆవిడకు వంట్లో బావుండలేద'ని, కంగారుపెడితే ఏమో నను కుని, పేషంటుని పరీక్షచేస్తూ మధ్యలో వచ్చేశాను ఏమయితేనేం అలాంటి భర్తను పొందగలిగిన నువ్వు చాలా అదృష్టవంతురాలివమ్మా..' అంది లేడీ డాక్టరు దిగాలు ముఖంవేసుకుని బయట నిలబడ్డ ఆయన్ని చూడగానే ఆవిడకు తమాషా చెయ్యాలనిపించింది కాబోలు, సీరియస్‌గా ముఖంపెట్టి 'మీ ఆవిడ్ని మీరు శ్రమపెట్టకూడదు . వేళకు మందులివ్వాలి .. ఆవిడచేత వంట చెయ్యించకూడదు ..' అంటూ ఫక్కున నవ్వేసింది విషయం అర్థంగాక ఆయన తికమక పడిపోతూంటే ఇక బావుండదను కుంది కాబోలు, 'అయ్యా ప్రకాశరావు గారూ కొద్దినెలల్లో మీరు తండ్రి కాబోతున్నారు' అంది ఆ సాయంత్రం తనను వంట చెయ్యనిస్తేకద తనే చెయ్యి కాల్చుకున్నారు తీరా నోటబెట్టాక, ఆయన ముఖం చూస్తే తనకే జాలేసింది 'మనకి వంటరాదు మీ అమ్మని రమ్మని వ్రాయి . లేకపోతే మా అమ్మని రమ్మని వ్రాస్తాను...' అన్నారు

విషయం తెలియడమే తరువాయి, తనను పుట్టింటికి తీసుకెడదామని అమ్మా, నాన్నా వచ్చారు. ఆ మాటె నాన్న ఆయన దగ్గర అన్నప్పుడు 'రేణూని ఇప్పుడప్పుడే పంపను...

మీరే ఇక్కడ వుండిపొండి.' అన్నారట. చివరి కెలాగయితేనేం ఏడోనెల రాగానే పంపడానికి ఒప్పుకొన్నారుట అలుడి దగ్గర మాట తీసుకుని నాన్న వెళ్లిపోయాడు అమ్మమాత్రం తనకు సాయంగా వుండిపోయింది. ఆయన ఆఫీసుకు వెళ్లడమే తరువాయి తన ఆలోచనలన్నీ కలుగబోయే శిశువుపై మళ్లివి ఆయనలాంటి కొడుకు కావాలి తనకు. మరి ఆయనకేమో తన లాంటి అమ్మాయి కావాలట! అయితే తనకుమాత్రం అబ్బాయే పుడతాడనిపించేది ఏడోనెల రాగానే నాన్న వచ్చి, తననూ, అమ్మనూ విజయవాడ తీసుకెళ్లాడు పుట్టింట్లో తనకేం లోటు? కాలు కదపాల్సిన అవసరంలేదు అయితేనేం తన మనసుమాత్రం ఆయనవైపే పోయేది రెండేసిరోజులకో ఉత్తరం వచ్చేది ఆవెంటనే తను సమాధానం వ్రాయవల్సిందే కాని పక్షంలో టెలిగ్రాము వచ్చేది. ఓసారి ఆయనె వచ్చేశారు!

ఏ విధమైన ఆందోళనా లేకుండా ప్రసవమయింది. మనవడు పుట్టాడని అమ్మా, నాన్నా; అల్లుడు పుట్టాడని అన్నయ్యా, వదినా సంబర పడిపోయారు తను కోరుకున్నది ఫలించింది అయితేనేం తనకంతగా సంతోషం కలుగలేదు సరికదా ఆయన కోరినట్లు అమ్మాయే పుడితే బావుండు నన్పించింది కొడుకు పుట్టాడని తెలియడమే తరువాయి బయల్దేరి వచ్చారు ఆయనున్న రెండురోజులూ తనకు 'టైమే' తెలియలేదు 'నీమాటే నెగ్గింది రేణూ. వచ్చేసారైనా కూతుర్ని కనకబోతే నేమారుకునేది లేదు' అన్నారాయన సిగ్గుతో తలగడలో ముఖం దాచేసుకుంది తను! 'వాడంతా నీ పోలికే రేణూ..' అన్నవి ఆయన మాటలు తనకుమాత్రం వాడంతా ఆయనపోలికే కన్పించేది

పసివాడికి మూడోనెల నిండడమే తరువాయి ఆయన దగ్గరకు వచ్చేసింది ఆయన కాలక్షేపమల్లా కొడుకుతో.. ఆఫీసుకు వెళ్లేవరకూ ఆయన చంక దిగేవాడు కాదు వాడు! సాయంత్రం ఇంటికి రాగానే మళ్లీ ఆయనదరి జేరేవాడు. ఆయన పనల్లా వాడి కదలికలు గమనించడం–బోసినవ్వులు నవ్వితే ఓవింత. బోర్లా పడితే ఓ వింత...పాకడానికి ప్రయత్నిస్తే ఓ వింత. పదో నెల తిరిగేసరికల్లా బోర్లా పడ్డాడు ఏడాది, తిరిగేసరికల్లా 'ఊఁ ఆఁ హా గా.' అంటూ తనలో తను మాట్లాడటం నేర్చాడు వాడి మాటలు తమకు కర్థమయి లేకద ఏడిస్తే ఆకలేస్తోందనీ, ఆటలాడడం మానేస్తే నిద్ర వస్తోందనీ అర్థం చేసుకోవడమే ఆ తర్వాత తన చిర కుచ్చెళ్లు పట్టుకుని నిలబడ్డం నేర్చాడు. వాడి నోటంట మొదట వెలువడిన మాట 'అమ్మ' ఆ క్షణాన తన తనువు పులకరించింది. అప్పుడు ఆయన చిరుకోపం తెచ్చుకుని 'నీకు అమ్మ ఎక్కువయిందట్రా.' 'నాన్న' 'అను' అంటూ కొంటెగా వాడి బుగ్గ గిల్లినప్పుడు వాడి నోటంట 'నాన్న' అన్నమాట రాలేదు కానీ, సప్తస్వరాలూ వెలువడ్డాయి! వాడ్ని వూరుకో బెట్టడానికి ఆయన సతమతమవుతూంటే తను పొట్ట పట్టుకుని మరీ నవ్వింది! నెలలు గడిచాక వాడికి చాలా మాట లొచ్చాయి; 'నాన్న' అన్నది కూడా వచ్చింది. ఆ తర్వాత తనంత తాను నిలబడ్డం నేర్చాడు, ఆ తర్వాత నాలుగడుగులూ వేశాడు. ఆ తర్వాతర్వాత చేతికి దొరికినంత వేగంతో పరుగిడడం నేర్చాడు ఆయన్నీ, తననూ మూడు చెఱువుల నీళ్ళు తాగిస్తే కానీ చేతి కందేవాడు కాదు!

'వాడికి ఏ పేరు పెట్టాలన్న ప్రశ్న ఉదయించినప్పుడు 'మీ నాన్న పేరూ వద్దు. మా నాన్న పేరూ వద్దు...ఓ చిన్న పేరు నీకు నచ్చింది చెప్పు' అన్నా రాయన.

'నాకు నచ్చితే సరా. మీకు నచ్చొద్దూ...' అన్నది తను.

'నీకు నచ్చింది నాకూ నచ్చుతుందిలే...

'వాడు మన ఇంటి వెలుగు...'భాస్కర్' అంటే ఎలా వుంటుంది?..'

'ఫస్టుగా వుంటుంది వాడి పేరు భాస్కర్.'

తన పేరు పెట్టనందుకు మామగారికి కోపం వచ్చింది, నాన్నకీ కోపం వచ్చింది. ఆయన మాత్రం చలించలేదు పైగా నవ్వేస్తూ 'మీ నాన్నకీ, మా నాన్నకీ వాళ్ల పేర్లు పెట్టలేదని కోపం వచ్చింది... అంచేత నువ్వు మరో ఇద్దరు కుర్రాళ్లని కనేస్తే, వాళ్ల ముచ్చట తీర్చేయచ్చు రేణూ' అంటూ కొంటెగా తన కళ్లల్లోకి చూసినప్పుడు, తనక ఎక్కడ లేని సిగ్గు ముంచుకొచ్చింది, ఆయన వక్షంపై తల వాల్చేసింది!

నెలలూ సంవత్సరాలూ దొర్లిపోయాయి.

ఓ రోజు సాయంత్రం భారంగా అడుగులు వేస్తూ ఇంటి కొచ్చారు. పెదాలపై చిరునవ్వు లేదు, కళ్లల్లో కొంటెతనం లేదు. ఇల్లు చేరగానే అడిగే బహుమానం అడగలేదు ఆదుర్దాగా వెళ్ళి నుదుట చెయ్యి వేసి చూసింది వళ్లు వేడిలేదు. తేలిగ్గా వూపిరి తీసుకుని 'అలా వున్నారేం.' అంది 'తలనొప్పిగా వుంది రేణూ' అన్నారాయాన 'ఫ్లాస్కు'లో కాఫీ కప్పులో



# రెక్కలొచ్చిన పక్షి

[పోసి ఇచ్చేది. డాక్టరుకోసం కబురంపితే వారించారు ఆ రాత్రి నాలుగు మెతుకులు కొరికి నిద్రపోయారు మరునాటి ఉదయానికి సలసల కాగే జ్వరం థర్మామీటరులో చూస్తే నూట నాలుగు డిగ్రీలు వణికే కాళ్ళతోవెళ్ళి డాక్టర్ని పిల్చుకు వచ్చింది డాక్టరు ఆయన్ని పరీక్షించి మరేం భయంలేదని చెప్పాక ఆదుర్దా తగ్గింది ఆ రోజంతా డాక్టరు చెప్పిన మందులు వేళ ప్రకారం ఇస్తూ, ఆయన మంచందగ్గరే గడిపింది తను రాత్రికి తగ్గలేదు మరునాటికీ తగ్గలేదు నాలుగైదు రోజులు గడిచిపోయాయి డాక్టరు ఏ రోజుకారోజు మందులు మారుస్తున్నా ఫలితం లేదు

ఓ రోజు రాత్రి తనను దగ్గరకు పిలిచి, ఆలోచనల్లో పడిపోయారాయన ఆయన దేన్నిగురించి ఆలోచిస్తున్నారో తనకు అర్థమయింది కాదు చివరకు ఆయన పెదాలు కదిలాయి, 'రేణూ నాకీ జ్వరం తగ్గుతుందనే నమ్మకం తగ్గుతోంది బ్రతికి బయటపడతానో లేదో. భగవంతుడనే వాడు లేడేమో. ఉంటే నీకు ఇలాంటి శిక్ష విధిస్తాడా? భాస్కర్‌కి మర్వా. నీకువాడూ. రక్షకులు.' ఆయన నోరు మూసేసింది. 'భగవంతుడనే వాడు వున్నాడు. ఆయన దయామయుడు మీకు తప్పకుండా తగ్గుతుంది' అన్నది తను ఆ తర్వాత పెరట్లోకివెళ్ళి వెక్కివెక్కి ఏడ్చింది అదే రాత్రి ఏదైతే జరుగకూడదని దేవుణ్ని ప్రార్థించిందో అదే జరిగింది తనరూపమే మారింది. తన జీవితమే విషాదమయింది అందరూ వచ్చారు ఆ మరునాటి మధ్యాహ్నానికి ఆయన్ను ఓ పిడికెడు బూడిదపాలు చేశారు మిగిలిందేమిటి? ఖాళీ మందు సీసాలు బ్యాంకులో డబ్బు... హృదయంలో శ్రావణమేఘాలు..

తనకిక మద్రాసులో ఏముంది? భాస్కర్‌తో తండ్రివెంట పుట్టింటికి వచ్చింది తన వయసు ఇరవైరెండేళ్ళ జీవితంలో ఎన్నోవంతు పూర్తయిందో? ఆయనకుమాత్రం నూరేళ్ళూ నిండిపోయాయి కళ్ళుమూస్తే కలల్లోకి వచ్చేవారాయన. భాస్కర్‌ని చూస్తుంటే ఆయనే కళ్ళముందు మెదిలేవారు తన ఆలోచనలు పలువిధాల సాగిపోయేవి. క్షణక్షణానికీ ఆయనే జ్ఞప్తికి వస్తూంటే, ఆయన లేకుండా తను జీవించలేదనిపించేది. ఆత్మహత్యకు ఎన్నోసార్లు ప్రయత్నించింది. ఆ సమయానికి నాన్నో, అమ్మో, అన్నయ్యో, వదినో అడ్డు తగిలేవారు ఎవరుచెప్పినా, సారాంశమొకటే — 'ఆ పసికందును తల్లిలేని వాడుగా చెయ్యకు' అవును వాళ్ళమాటలు నిజం వాడికోసం తను బ్రతకాలి వాడిరూపమంతా ఆయనే తనకొక పని అప్పగించి వెళ్ళారాయన వాణ్ని తీర్చి దిద్ది వృద్ధిలోకి తీసుకురావాలి అప్పుడే ఆయన ఆత్మకు శాంతి లభిస్తుంది వాడికోసం తను బ్రతకాలి అయితే వాడివయసు నాలుగేళ్ళు వాడు ఎప్పటికి పెద్దవాడవను? వాణ్ని ఏవిధంగా వృద్ధిలోకి తీసుకురాగలదు? తన ఆర్థిక స్థితేమిటి? బ్యాంకులో నాలుగువేల చిల్లర కూర్చుని తింటే అవి ఎంతకాలం రాగలవు? పోనీ ఉద్యోగంలో చేరదామంటే తన అర్హతలేమిటి? 'ఎస్సెల్సీ'...'ఎస్సెల్సీ' చదువుతో ఏం ఉద్యోగం వస్తుంది? భాస్కర్ సంపాదనపరుడయ్యేంత వరకూ తనూ వాడూ అన్నయ్యమీద ఆధారపడవల్సిందేనా? సంఘంలో స్త్రీ పుట్టింటికి పసుపు కుంకుమతోవస్తే ఓ దారి తల చెడి వస్తే మరోదారి. అన్నయ్యా, వదినల్లాంటి వాళ్ళు లోకంలో అరుదుగా కన్పిస్తారు వాళ్ళకు కావాల్సిందల్లా తనూ, తన కొడుకూ కులాసాగా వుండడమే ఎంత చెట్టుకు అంతగాలి' అన్నారు అప్పటికే అన్నయ్యకు ఇద్దరు కొడుకులు వదిన మళ్ళీ కడుపుతోంది మరో ఇద్దరు పుట్టుకువస్తే తనూ, తన కొడుకూ వాళ్ళకు భారంకాదా?

తను ఒక స్థిరనిశ్చయానికి వచ్చింది. అర్హతలు పెంచుకోవాలి తను చదువుకోవాలి అంతేకాక మెదడుకి పరిశ్రమ అవసరం పనీపాటా లేక తిని తిరిగితే మనసు గతంమీదకు మళ్ళుతూనే వుంటుంది మనసులో వున్నది అన్నయ్యకు చెప్పింది అన్నయ్య అంగీకరించాడు తన తీరికవేళల్లో తెలియనివి బోధించేవాడు

అన్నయ్యకు కూతురు పుట్టింది భాస్కర్‌కి పెళ్ళాం పుట్టిందని సంబరపడింది తను అన్నయ్యా, వదినా సరేసరి; 'అల్లుడు అల్లుడంటూ' వాడికి తగని గారం చేసేవారు అన్నయ్యకూతురికి శకుంతల పేరు పెట్టారు

సంవత్సరాలు గడిచాయి. తను బి ఏ. పాసయింది. భవిష్యత్తుపై తన ఆందోళన మాయమయింది. తన కాళ్ళమీద తను నిలబడగలదు! భాస్కర్‌ని వృద్ధిలోకి తీసుకురాగలదు, వాడు చదువుతానన్నంతవరకూ తను చదివించగలదు! ఉద్యోగంలో చేరాలన్న నిర్ణయానికి వచ్చింది అన్నయ్యతో చెప్పినప్పుడు చాలా బాధపడ్డాడు 'నిన్నూ, వాణ్నీ పోషించలేనా? వాడు నాకు పైవాడా? వాడికి చదువు చెప్పించలేనా?' అంటూ మథనపడ్డాడు 'అది కాదన్నయ్యా ఉద్యోగం చెయ్యకపోతే చదివిన చదువుకు సార్థకమేమిటి? అంతేకాక ఏదో వ్యాపకం వుంటే మనసులో ఎలాంటి ఆలోచనలూ రావు' అంది అన్నయ్య సమాధానం చెప్పలేదు వాడి మౌనమే అంగీకారంగా తీసుకుంది తను హైస్కూల్లో 'టీచరు'గా చేరింది

క్రమక్రమంగా గతమనే అద్దంపై ధూళిపడి, గతం అదృశ్యమవసాగింది. భాస్కర్ స్కూలు రెండే తనకు కావాల్సినవి ఇంటిదగ్గరున్నంతసేపూ తను చూసేదల్లా వాడి బాగోగులు స్కూల్లోవున్నంతసేపూ పిల్లలచదువు భాస్కర్ రూపురేఖల్లోనేకాక తెలివితేటల్లో కూడా తండ్రి పోలికే ప్రతీక్లాసూ 'ఫస్టు'గానే చ్చేవాడు వాడు పరీక్షలు అలాపాసవుతే తనకింక కావాల్సినదేమిటి?

మరికొన్ని సంవత్సరాలు గడచిపోయాయి. అమ్మా, నాన్నా ఒకరివెంట ఒకరు ఎరలోకాలకు పయనమై వెళ్ళిపోయారు.

శకుంతల - అన్నయ్యకూతురు— రోజురోజుకీ మరింత అందంగా తయారయింది. అది తనకోడలు కావడమే తనకు కావాల్సింది అంతేకాక అన్నయ్యా వదినాకూడా వాడిమీదే ఆశలు పెట్టుకున్నారు. శకుంతల అందమూ, అందాన్ని మించిన మంచితనమూ తనను ఎప్పుడూ ఆకర్షించేవి. ఇక భాస్కర్‌కికూడా అదంటే ఎంత ఇష్టమో తనకు తెలుసు!

భాస్కర్ పెద్దవాడయిన కొద్దీ తండ్రి పోలికలు, వాడిలో మరింత ప్రస్ఫుటంగా

కన్పించేది. అదే నడక.. అదే నవ్వు. అవే కళ్ళు వాడి మనసెంత సున్నితమైనది? తనకు తలనొప్పివస్తే విల విల్లాడి పోయేవాడు!

పంధొమ్మిదేళ్ళకల్లా బి. ఏ. ఫస్టుక్లాసులో పాసయ్యాడు తర్వాత 'ఎమ్మే' చదవమని ప్రోత్సహించింది తను అయితే 'నీకు దూరంగా వెళ్ళడం నాకిష్టం లేదమ్మా' అని వాడు అన్నప్పుడు తను వాడి ముఖంలోకి చూడలేకపోయింది. తనకు మాత్రం వాడు దూరంగా వెళ్ళడం ఇష్టమా? కానీ వాడు పెద్ద చదువు చదవాలి; పెద్ద ఉద్యోగం చెయ్యాలి అదే తన జీవిత లక్ష్యం వాడి మనసు మార్చడానికి నవ్వు తెచ్చిపెట్టుకుని, వాడ్ని కవ్వించాలని 'నాకు దూరంగా వెళ్ళడం ఇష్టంలేదా? లేక శకుంతలకు దూరంగా వెళ్ళడం ఇష్టంలేదా?..' అంది నువ్వెప్పుడూ ఇంతే నమ్మా' అంటూ చిరుకోపం తెచ్చుకున్నాడు ఇటు వాడి మనసూ, అటు శకుంతల మనసూ తనకు తెలుసు ఒకరి కొకరంటే ఎంత ఇష్టమో తెలుసు తనకూ, అన్నయ్యకూ, వదినకూ మాత్రం కావల్సిందేముంది? తామందరూ వాళ్ళిద్దరినీ దంపతులను చెయ్యడానికే ఎదురు చూస్తున్నారు వాడి చదువై, ఉద్యోగంలో చేరితే శుభ ముహూర్తం నిశ్చయించడానికి సిద్ధం!

ఆ రోజు వాడు మద్రాసు వెళ్ళే రోజు— అన్నయ్య రిక్షా వచ్చిందనీ, రైలుకి టైమయి పోతూందనీ కంగారు పడుతున్నాడు శకుంతల సిగ్గుకొద్దీ బయటకు వచ్చిందికాదు ఇక వాడు రిక్షా ఎక్కబోతూంటే తనే అడిగింది 'శకుంతలతో చెప్పావా?' అని 'చెప్పొస్తానమ్మా.' అంటూ లోపలికెళ్ళాడు పావుగంట గడిచినా వాడి పడడే! వాళ్ళ సంభాషణ తన చెవుల్లో పడకపోయినా వూహించుకోగలదు ప్రేమికుల ఎడబాటు భరించలేనిది.

నాలుగు రోజులు సెలవులొస్తే చాలు విజయవాడ వచ్చేసేవాడు ఉన్న నాలుగు రోజులూ ఎంత ఉత్సాహంగా వుండేవాడు! సెలవులై మద్రాసు వెళ్ళిపోయేరోజు దిగాలుగా వుండేవాడు మద్రాసు చేరాక రెండు రోజులకో ఉత్తరం—తనకు కాదు!— శకుంతలకి! ఆ వెంటనే శకుంతల సమాధానం పోస్టులో పడాల్సిందే! తను పెళ్ళయ్యాక ప్రేమించింది వాళ్ళ సంగతి వేరు ఎంత ప్రేమించుకుంటే మాత్రం అంత పెద్ద ఉత్తరాలు వ్రాసుకోడానికి విశేషాలేముంటాయి? అదేమాట శకుంతలతో అంటే 'పో అత్తయ్యా' అంటూ 'తుర్రు' మనేదేకాని సమాధానం చెప్పేది కాదు

రెండేళ్ళు గడిచాయి భాస్కర్ 'ఎమ్మే' ఫస్టుక్లాసులో పాసయ్యాడు. తను తేలిగ్గా నిట్టూర్చింది; అన్నయ్య సంతోషించాడు, శకుంతల మురిసిపోయింది!

ఆ తర్వాత కొద్ది రోజులకు వాడికి ఢిల్లీలో మంచి ఉద్యోగం వచ్చింది అయితే వాడు ఆ వుద్యోగంలో చేరడం తనకు సుతరామూ ఇష్టంలేదు ఎక్కడ ఢిల్లీ— ఎక్కడ విజయవాడ? తన కొడుకు అంత దూరం వెళ్ళడం ఇష్టం లేదు తనకు వాడు దూరమయితే భరించలేదు అయితే వాడు మాత్రం ఢిల్లీ వెళ్ళడానికి ఉత్సాహమే చూపించాడు తనకు వాడి మనసు అర్థమయింది మద్రాసులో వున్న రెండేళ్ళలో చాలా మారిపోయాడు వాడిలో మునుపటి పిరికితనంలేదు తనను నొప్పించడానికి చాలా ప్రయత్నించాడు ఉద్యోగికి దూరభారమేమిటమ్మా? 'గెజిటెడ్ ఆఫీసరు' ఉద్యోగమమ్మా ఇంత మంచి ఉద్యోగం మనం కావాలనుకున్నప్పుడు రావద్దుటమ్మా..' అన్నవి వాడి మాటలు 'అలాటి ఉద్యోగం మద్రాసులో రాకపోదు.' అంది తను ఇక చేసేదేదీ లేక మావయ్య సహాయాన్ని అర్థించాడు. అన్నయ్యకూడా వాడినే సమర్థించాడు ఆ వుద్యోగంలో చేరద్దని శాసించలేకపోయింది వెంటనే పెళ్ళిచేసుకోమని కోరింది అప్పటికి శకుంతల 'పియూసీ' చదువుతోంది. 'శకుంతలకి ఆ 'పియూసీ' పూర్తవనీయమ్మా ఎప్పటికైనా నేనే కద చేసుకునేవాడ్ని.' అన్నాడు వాడు. 'ఇంకేంతే అక్కయ్యా దాని చదువు ఆర్నెల్లలో అయిపోతుంది కద వాడు చేసుకుంటానన్నప్పుడు తొందరపడటమెందుకు?.' అన్నాడు అన్నయ్య

ఆర్నెల్లు ఎంతలో తిరుగుతాయనుకుంది తను అయితే ఆ ఆర్నెల్లే చెప్పనన్ని మార్పులు తెచ్చింది. వాడు ఢిల్లీ వెళ్ళాక మొదటి రెండునెలలూ వారానికో ఉత్తరం వ్రాసేవాడు ఆ తర్వాత పదిహేను రోజులు ఉత్తరం రాకపోతే కంగారుపడింది. టెలిగ్రాము ఇద్దామనుకుంటూంటే ఉత్తరం వచ్చింది పదిరోజులు జ్వరంవచ్చి, తగ్గిందట—ఇంటివాళ్ళు చాలా మంచివాళ్ళనీ, ఎల్లవేళలా తనదగ్గర ఎవరో ఒకరు వుండి తనకు సపర్యచేసేవారనీ వాళ్ళు చేసిన సహాయానికి తను ఋణం తీర్చుకోలేననీ, ఏమేమో వ్రాశాడు. ఆయింటి



ఆయన మొదట పూలకొట్టు పెట్టి దివాలా తీశాడు ఆ తర్వాత కట్టెలకొట్టు పెట్టి లక్షలు సంపాయించాడు

వాళ్ళకు తను మనసులోనే ధన్యవాదాలు అర్పించింది. ఆ తర్వాత ఉత్తరం—తన హృదయానికేకాదు—శకుంతల హృదయానికికూడా కామబాణం—అందలి సారాంశం—ఇంటి వారమ్మాయి సునీతను పెళ్ళిచేసుకోవాలన్న నిశ్చయానికి వచ్చాడట! శకుంతల మాటేమిటి? దానికి లేనిపోని ఆశలెందుకు కల్పించినట్లు? తనూ, అన్నయ్యా వాడిమనసు మార్చాలన్న నిశ్చయంతో ఢిల్లీ వెళ్ళారు శతవిధాల చెప్పి చూశారు వాడి మనసుమాత్రం మారలేదు ఇంటివాళ్ళు చూడబోతే పంజాబీలు, అదేమాట తనంటే నువ్వు వందేళ్ళ వెనుకనున్నావమ్మా ..ఆంధ్రులేమిటి? పంజాబీలేమిటి? మనందరమూ భారతీయులం ..' అన్నది వాడి సమాధానం. అవే మాటలు మరొకరి నోటంటవస్తే తను అభినందించేదేమో? వాడి మనసు మారదని తెలిశాక, తనూ, అన్నయ్య తిరిగివచ్చారు ఆ తర్వాత కొంతకాలానికి ఆ సునీతను పెళ్ళిచేసుకున్నానని వ్రాశాడు శకుంతల పగలూ, రాత్రి ఏడ్చింది అది పైకి ఏడ్చింది; తను లోలోపలే ఏడ్చింది ఒదే తేడా! అంతవరకూ అన్నయ్య మేనల్లుడిమీద భరోసాతో కూతురికి సంబంధాలు చూడలేదు ఆ మేనల్లుడు చేసిన ఘనకార్యం తెలిశాక, సంబంధాలు చూడటం మొదలెట్టాడు రెండునెలలు తిరక్కుండానే మంచి సంబంధం ఖాయంచేసి పెళ్ళి చేసేశాడు. శకుంతల కాపురానికి వెళ్ళిపోయింది

అన్నయ్యకు హైదరాబాదు ట్రాన్స్‌ఫర్ అయింది వదినని తీసుకుని హైదరాబాదు వెళ్ళిపోయాడు తనుమాత్రం విజయవాడలోనే వుండిపోయింది

భాస్కర్ ... నవమాసాలూ మోసి కని పెంచిన ముద్దుబిడ్డ — ప్రాణంకన్న మిన్నయైన భాస్కర్ .. వాడి సుఖంకన్న తను కోరుకునేదేమిటి? తను ఏంచేసినా వాడి సుఖాన్ని, భవిష్యత్తునూ దృష్టిలో పెట్టుకునే చేసింది. వివాహవిషయంలో తన అభిమతానికి వ్యతిరేకంగా ప్రవర్తించి ఉండవచ్చు. అయితే ఈ చిన్న విషయానికి వాడితో సంబంధం తెగతెంపులు చేసుకోగల్గిందా? లేదు! వాడి సుఖాన్నే కాంక్షించింది క్షేమ సమాచారాలు తెలియనప్పుడు

# రెక్కలొచ్చిన పక్షి

విలవిల్లాడింది ఇక వాడుకూడా 'తల్లి జీవించివుంద'న్న సత్యాన్ని మరువలేదు తరచుగా ఉత్తరాలు వ్రాసేవాడు. తనుకూడా వాడిక్షేమాన్ని, కోడలుక్షేమాన్ని కోరుతూ ఉత్తరాలు వ్రాసేది. వాడి ఉత్తరాలు చూసినప్పుడల్లా తనకు అన్పించేది — 'భాస్కర్ మారలేదు వాడికి తల్లిపై వుండే ప్రేమ రవంతకూడా తగ్గలేదు ఇప్పటికీ వాడు కోరుకునేది తల్లిసుఖమే'

'మనిషి' అన్నాక వయసు పైబడిన కొద్దీ జవసత్వాలు క్షీణించడం సహజం స్కూల్లో వున్నంతసేపూ నోరు చించుకుని ఇంటికి వచ్చేసరికి నీరసమూ, విర్లిప్తతా తనను ఆవరించుకునేవి ఉద్యోగం! తనసలు ఉద్యోగంలో ఎందుకు చేరింది?— స్వశక్తితో కొడుకును వృద్ధిలోకి తీసుకురావాలని. వాడు వృద్ధిలోకి వచ్చాడు తన లక్ష్యం సిద్ధించింది. తనకిక ఉద్యోగం చెయ్యాల్సిన అవసరమేమిటి? వాడుతనకు పూటకింత తిండిపెట్టలేడా? వాడివంచన బ్రతుకు తెల్లవారితే అంతేచాలు!

ఉద్యోగం మానెయ్యాలన్న కోరిక రాను రాను బలపడింది కొడుకు అభిప్రాయం తెల్సుకుని మానెయ్యాలని నిశ్చయించుకుంది. నెలరోజులు సెలవుపెట్టి 'ఢిల్లీ'కి ప్రయాణమయింది. భాస్కర్ స్టేషనుకు వచ్చాడు.

రెండుమూడు రోజుల్లోనే ఆయింట్లో వ్యక్తుల మనస్తత్వాలు తెలిసివాయి: భాస్కర్ — వాడికి తల్లిపై మునపటి ప్రేమానురాగాలు లేవు నోటంట యాంత్రికంగానే మాటలొస్తాయి వాటిలో తల్లిపై ప్రేమవుండదు. సునీత — ఆ పిల్లకు తను పరాయిది సర్వసాధారణంగా తనను తప్పించుకునే తిరుగుతుంది ముఖకవళికల్నిబట్టి తనక్కడ వుండడం ఆమెకు ఇష్టంలేదని తెలుస్తుంది అయినప్పటికీ— తను పెద్దది వాళ్ళిద్దరూ చిన్నవాళ్ళు! తను సర్దుకుపోతే సమస్యలుండవు.

ఓ రోజు తన మనసులో వున్నది కొడుక్కి చెప్పింది కొద్ది క్షణాలు వాడు మాట్లాడలేదు ఆ తర్వాత లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకుని 'చాలాకాలంగా నువ్వొక దినచర్యకి అలవాటు పడ్డదానివి. ఇప్పుడు ఆ వుద్యోగం మానేస్తే పగలంతా నీకేంతోస్తుందమ్మా? ... నువ్విక్కడకు రావడం నాకూ ఇష్టమే నిన్ను పోషించలేనూ? ఒక్కవిషయం మాత్రం నువ్వు గుర్తుకి తెచ్చుకోవాలి నీ కోడలు పంజాబీ అమ్మాయి వాళ్ళ ఆచారాలు వేరు; మన ఆచారాలు వేరు నువ్వు సర్దుకుపోగలవని నాకు తోచడంలేదు, నీకుతోస్తే అలాగే రావచ్చు' అన్నాడు వాడి మాటలు విని నిశ్చేష్టురాలయింద తను! తన కొడుకేనా అలా మాట్లాడింది? వాడిమనసు తెలిసింది సూటిగా కాకపోయినా మరోలా తన అనంగీకారాన్ని వ్యక్తంచేశాడు! వాడిక్కి తల్లి తనఇంట్లో వుండడం ఇష్టంలేదు

ఇది తప్పకుండా తెలుగు సినిమా షూటింగే!



తనకు వాడి ఇంట్లో స్థానంలేదు!

నెల్లాళ్ళు ఢిల్లీలో వుందామని వెళ్ళిన తను పదిరోజుల్లో తిరిగి విజయవాడ చేరుకుంది!

ఒకసారి తనకు చాలా జబ్బు చేసింది అన్నయ్యా, వదినా హైదరాబాదునుండి వచ్చారు భాస్కర్‌కి 'టెలిగ్రాము' వెళ్ళింది వాడి రాకకోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూసేది తను ప్రాణంపోయేముందు వాడ్ని ఒక్కసారి కనులారా చూస్తే తన కంతే చాలు! వైద్యంచేసిన డాక్టర్లు తను బ్రతికి బయటపడుతుందని అనుకోలేదు తను బ్రతికింది! తనది మొండిప్రాణం! భాస్కర్ మాత్రం రాలేదు తనకు పూర్తిగా నయమయ్యాక వాడిదగ్గర్నుండి ఉత్తరం వచ్చింది సారాంశం—సెలవు దొరక్క రాలేకపోయాడట! పూర్తిగా తనకు నయమయిందని తెలుస్తాడట! చేసేది ఎంత పెద్ద ఉద్యోగమయితే మాత్రం—తల్లికి జబ్బుగా వుందంటె ఆఫీసువాళ్ళు సెలవు మంజూరు చెయ్యరా? అసలు కారణం—సెలవు దొరక్కపోడంకాదు, రావాలని అన్పించకపోడమే!

ఆ సంఘటనతో తన మనసు విరిగిపోయింది వాడింతగా మారిపోడానికి కారణమేమిటి? కోడలా? శకుంతలే తనకు కోడలయిన పక్షంలో తన జీవితం ఎంత చక్కగా నడిచేది? వాడ్ని ఢిల్లీ ఉద్యోగంలో చేరద్దని శాసించ వల్సింది. లేకపోతే వాడు ఢిల్లీ వెళ్ళేముందే పెళ్ళి చెసెయ్యాల్సింది ఇప్పు డేమనుకుని లాభం?

ఇప్పుడు తన సంగతి వాడి కక్కర్లేదు ఆర్నెల్లకోసారి 'ఎలా వున్నావ'ంటూ ఓ వుత్తరం ముక్క వ్రాస్తాడు అక్కడికేదో తనకు వంట్లో బావుండకపోతే వచ్చి చూసేటట్టు! తల్లిని ఏమాత్రం సుఖపెట్ట గల్గింది వాడకి మాత్రం తెలియదా? ఈ సువిశాల విశ్వంలో తను ఏకాకి తనకొడుకే తనవాడుకాదు! అత్తమామల పైవున్న అభిమానంలో పదో వంతుకూడా తనపైలేదు తనూ, వాడూ—ఎవరికి వారే

రెండు మూడేళ్ళలో తను రిటైరవుతుంది ఆ తర్వాత తనజీవితం? ఆయనే వుంటే వాడిలా తయారయ్యేవాడా? వాడ్ని ఎంత ముద్దుచేసి పెంచింది?

ఇంతలో 'బెల్లు'యింది రేణుకాదేవి ఆలోచనలకు అంతరాయం కల్గింది పుస్తకాలూ, 'ఎటెండెన్సు రిజిస్టరూ' చేతబట్టుకుని 'కామన్ రూము' చేరుకుందావిడ

ఒక్క పావుగంటసేపు నుదుటిన చెయ్యి పెట్టుకుని, కళ్ళు మూసుకుని కుర్చీలో కూర్చుంది రేణుకదేవి క్లాసులనుండి వచ్చే టీచర్లనూ, క్లాసులకుపోయే టీచర్లనూ ఆవిడ గమనించడంలేదు ఆవిడ మనసంతా చెప్పలేని వ్యథతో నిండివుంది ఓ ప్రక్క తన సంగతి పట్టించుకోని కొడుకు — ఇంకో ప్రక్క అయిదేళ్ళ పాటు కాపురంచేసి తన మానాన తన్నొదిలి పరలోకాలకు చేరుకున్న భర్త—ఇద్దరికీ చెడ్డ తను ... తర్వాత క్లాసులేదు, ఆ తర్వాత క్లాసువుంది. ఈ విధమైన మానసిక క్షోభతో తను పాఠం చెప్పగలదా? చెప్పలేదు! ఉత్తినే క్లాసులకువెళ్ళి కూర్చునే కన్నా, సెలవుతీసుకుని ఇంటికి వెళ్ళడమే ఉత్తమం

రేణుకాదేవి భారంగా అడుగులువేస్తూ 'హెడ్మిస్ట్రెస్' గదిలోకి వచ్చింది సుమతీదేవి తలెత్తి ఆవిడవైపు చూసి కుర్చీ చూపింది రేణుకాదేవి చేతిరుమాలుతో ముఖాన్ని తుడుచుకుంటూ అతి మెల్లిగా అన్నది!

'వంట్లో బావుండలేదు. ఇంటికి వెళ్ళిపోతాను ..'లీవ్‌లెటర్' ఇద్దామని వచ్చాను'

'మీరు వచ్చినప్పుడే మిమ్మల్నిచూసి అనుకున్నాను, మీకు వంట్లో బావుండలేదని. . వంట్లో బావుండనప్పుడు స్కూలుకి ఎందుకొచ్చారండి 'లీవ్‌లెటర్' సంగతి తర్వాత చూడచ్చుకానీ ముందు ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. సాయంత్రం ఇంటికి వెళ్తూ నేవొచ్చి చూస్తాను ...' అన్నది సుమతీదేవి

'ప్యూన్'ని పిలచి రిక్షా తెమ్మని చెప్పింది సుమతీదేవి కొద్ది నిముషాల్లో



రిక్షా వచ్చింది. సుమతీదేవి దగ్గర సెలవు తీసుకుని రిక్షా ఎక్కింది రేణుకాదేవి.

రిక్షా ఇంటివైపు సాగుతూంటే రేణుకాదేవికి పిచుకపిల్ల గుర్తొచ్చింది ఎలావుందో ఏమిటో? ఎగరడానికి ఇంకా తాపత్రయ పడుతోందేమో...నల్లపిల్లి?... పెద్ద పిచుకలు ఇంట్లోకి రాడానికి వీలుగా 'వెంటిలేటర్' తెరచిపెట్టింది తను నల్ల పిల్లి ఆ 'వెంటిలేటర్లో'ంచి ఇంట్లోకి ప్రవేశించివుంటే? ఆ ముద్దొచ్చే పిచుకపిల్ల ఆ మాయాదారి నల్లపిల్లికి ఆహారమయిందేమోనన్న ఆలోచన వస్తేనే చాలు వళ్ళు జలదరిస్తోంది. పిచుకపిల్ల క్షేమంగా వుండాలి!

రిక్షా ఇంటిముందు ఆగడమే తరువాయి దిగి, రిక్షావాడికి డబ్బులిచ్చి వడి వడిగా మెట్లు ఎక్కసాగింది రేణుకాదేవి తాళం తీసి, తలుపులు తోసింది ఆతృతగా బల్లవైపు చూసింది. దానిమీద అన్నం మెతుకులూ, నీళ్ళూ వున్న మూతలు మాత్రం వున్నాయి కానీ. కానీ. పిచుకపిల్లలేదు! హృదయానికి ముల్లు గుచ్చుకున్నట్లు విల విల్లాడింది రేణుకాదేవి. ముద్దొచ్చే పిచుకపిల్లను మాయదారి నల్లపిల్లి పొట్టన బెట్టుకుంది! మరిక ఆలోచించలేక కుర్చీలో కూలబడి కళ్ళు మూసుకుంది

కొద్ది క్షణాలు గడిచాయో లేదో 'కిచ కిచ' మన్నశబ్దం విన్పించడంతో కళ్ళు తెరచి; కళ్ళింతవి చేసుకుని నలుమూలలా చూడసాగింది రేణుకాదేవి 'వెంటిలేటర్' గూట్లో పిచుకపిల్ల! మరింత పరీక్షగా చూసింది రేణుకాదేవి కుడిప్రక్క తెల్లని రంగు! అనుమానంలేదు అదే పిచుకపిల్ల! తేలిగ్గా నిట్టూర్చింది రేణుకాదేవి ఇంతలో పెద్ద పిచుకలు రెండూ 'కిచ కిచ' లాడుతూ పిచుకపిల్ల దగ్గరకు వచ్చాయి. వాలినట్లే వాలి అవి రెండూ 'తుర్రు' మన్నాయి పిచుకపిల్ల రెక్కలు విదిల్చింది. రేణుకాదేవి వింతగా దానివైపు చూస్తూ నిలబడింది పిచుకపిల్ల 'కిచ కిచ' మంది; పెద్ద పిచుకల్ని అనుసరించింది ఎగిరిపోతున్న పిచుకపిల్లను చూస్తూ 'రెక్కలొచ్చిన పక్షి తత్వమే అంత' అనుకుని గాఢమైన నిట్టూర్పు విడిచింది రేణుకాదేవి. ●

# లేఖా వాణి




'పుష్పరాజ్' మైథిలి, ఇనమలకుదురు

ప్ర: రేడియోవారు 'పొదుపు మన ముఖ్య కర్తవ్యం' అని ఘోషిస్తున్నారు గదా; మరి నేను కార్డుపై వ్రాస్తే మీదాకా చేరుతుందా. చేరినా మీరు సమాధాన మిస్తారా?

జ: పొదుపును మరీ అదుపులో పెట్టడం అధర్మం.

వి సుధాకరరెడ్డి, హైద్రాబాదు

ప్ర. పద్మశ్రీ నందమూరి తారక రామారావుగారిపై మీ అభిప్రాయం ఏమి?

జ నందనవనంలో వెలసిన పారిజాతం.

ప్ర: ఒకప్పుడు చెలికత్తెగావేసిన మీరు, నేడు రాజకుమారిగా వేస్తున్నారు కదా! మీరు ఒకవేళ ఎప్పుడయినా చెలికత్తె వేసిన పాత్రగల సినిమా చూస్తే ఎలా ఫీలవుతారు?

జ. ఏమీ ఫీలవను.

బహుమతిపొందిన ప్రశ్న

డి. పి. వి, వెల్లటూరు

ప్ర: సినిమాచూసే ప్రేక్షకునికి నిజమైన రిలీఫ్ ఎప్పుడొస్తుంది, వాణిశ్రీగారు?




జ. రిలీఫ్ యిచ్చే దివ్యఔషధం సినిమా అనేదేనా బిలీఫ్.

టి శంబరాజు, మారుటేరు

ప్ర: వెండితెర మీదికి రాకముందు ఏమిచేసేవారు? కథానాయికగానే స్థిరపడదల్చారా? ఇకముందు వ్యాంపులు నటించరా? మా అనుంగు సోదరి మమ్మ విడిచి వెళ్ళింది. ఆమె రూపురేఖలుగల మీ ఫొటో పంపితే నిత్యం మా సోదరిని చూసుకుంటాము?

జ. డ్యాన్సు నేర్చుకునేదాన్ని. అవును స్థిరపడాలనుకుంటున్నా (ప్రేక్షకులు అభిమానిస్తే). మున్ముందు వ్యాంపులు వెయ్యను. మీ కోరికను త్వరలోనే తీరుస్తా.

టి ఎస్ శంకర్రావు, పామిడి

ప్ర: నర్తించడం కన్నా నటించడం కష్టమని నా అభిప్రాయం. నర్తకి నుండి నటిగా మీ అనుభవాల్ని పురస్కరించుకుని జవాబిస్తారని ఆశిస్తాను?

జ: 'నటన'లోనే నాట్యంవుంది.

ఎస్ అఫ్జల్, చిత్తూరు

ప్ర: మీకు సినిమాలో ఎటువంటి పాత్రలంటే యిష్టం? హాలీవుడ్ తారలలో మీ అభిమానులెవరు?

జ నవరసాలను చిందించే పాత్రలంటే యిష్టం. ఎలిజబెత్ టెయిలర్.

ఎస్ వి ఆర్ భాగ్యలక్ష్మి, ఉరవకొండ

ప్ర: ప్రేమించే శక్తి, సాహసం స్త్రీలకు పురుషులకన్నా అధికంగా వుంటుందంటారు. మరి మీ అభిప్రాయమో?

జ ఆ రెండే కాదు స్త్రీలకు అధికం—త్యాగంకూడ చేర్చుకోండి.

అన్నంరాజు పూర్ణచంద్రరావు, ఒంగోలు

ప్ర: హింది చిత్రాలపై మీ అభిప్రాయం?

జ: నాకు యింకా అంత అనుభవం రాలేదండి.

పి కృష్ణారెడ్డి, గద్వాల

ప్ర: మీరు వివాహం చేసుకున్నా తర్వాత సినిమాల్లో నటిస్తారా?

జ: వివాహం చేసుకునేవారిపై వుంటుంది ఆసమస్య. అయినా యిప్పుడెప్పుడే ఎందుకండీ వివాహం.

ఎస్ రామచంద్రనాయుడు, రాజంపేట

ప్ర: అన్నిటికంటే చల్లని స్థలమేది?

జ: తల్లి హృదయం.

మంగిపూడి పద్మావతి, శ్రీకూర్మం

ప్ర. భాషా సమస్యను గూర్చి సినిమా తారల అభిప్రాయమేమిటో చెబుతారా?

జ: సినిమాతారలకు వాళ్ళ సమస్యలను తీర్చుకునేదానికే తీరిక లేదు.

ఎం వి సింహాద్రావు, 56 ఎ పి ఒ.

ప్ర. మన విధి, కర్తవ్యము, బాధ్యత మనకు తెలిసివుండి కూడా మనస్సు మనల్ని తప్పుదారి ఎందుకు పట్టిస్తుంది. మన శరీరంలోని ఒక భాగమయిన మనసునస్సు ఎందుకు శాసించలేము?

జ: మనస్సు చాల సున్నితమయినది. మనకు జీవితంలో జరిగే సంఘటనల్ని బట్టి మనస్సు మారుతూ వుంటుంది.

# రాజకీయాలు - సినిమాలు

మనచిత్రాలపై రాజకీయ పక్షాల ప్రమేయం లేదు. కాని తమిళ చిత్రపరిశ్రమపై రాజకీయాల ప్రభావం ఎంతగానో వుంది. అందులోను ముఖ్యంగా ద్రావిడ మున్నేట్రకజగం ప్రభావం తమిళరంగం మీద బాగా ముద్రవేసుకున్నది. ఈపక్షం (పార్టీ) లోని వ్యక్తులకు సినిమారంగంలో చేరాలని అభిలాష వుంటే అవకాశాలు ఇట్టే అంది వస్తాయి. చేరదలచుకున్నవారి ఉత్సాహం అర్హతలను బట్టి పార్టీ ముఖ్యులు సినిమాలలో ఆయాస్థానాల్లో వారిని ప్రోత్సహించడం జరుగుతున్నది.

నటన విభాగంలో గాని, సాంకేతిక విభాగంలోగాని ఎంత ఉన్నత హోదాలో వున్నా—క్షణం తీరికలేక పోయినా, పార్టీ ప్రచార సభల్లోను ప్రజలతో నం దిన జీవిత కార్యకలాపాల మంచిచెడులను తెలుసుకుని

ఎం. జి. రామచంద్రన్

సభలు ఏర్పాటు చేసి —వారితో సన్నిహిత సంబంధ బాంధవ్యాలను ఏర్పరచుకుంటారు. అందుకే ద్రా. ము. క. కి చెందిన సినిమానటులు, రచయితలు ప్రజల్లో ఎంతో ఆదరణను సంపాయించుకో గలిగారు.

ఈపార్టీ స్థాపకులు ప్రస్తుత మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ సి. ఎన్. అన్నాదురై—ఒకప్పుడు పార్టీని ప్రతిభావంతంగా పటిష్ఠంగా నిర్వహిస్తూనే సినిమాలకి కథలు రాసేవారు. పార్టీ ఆశయాలు, ఆదర్శాలు సినిమాలద్వారా ప్రజలకి బోధపరచడం సులభమని బహుశా ఆయన అభిప్రాయమై ఉండవచ్చు. వెనక వచ్చిన జూపిటర్‌వారి 'వేలైక్కారి' ఉదయసూరియన్ పిక్చర్స్‌వారి 'నల్లవన్ వాళ్వాన్' మొదలయిన చిత్రాలకు శ్రీ అన్నాదురై కథలు రాశారు. అచిత్రాలు ఘనవిజయాన్నిసాధిం



అన్నాదురై

చిన. 'వేలైక్కారి' చిత్రం తెలుగులో 'సంతోషం' పేరుతో వచ్చింది.

శ్రీ కరుణానిధి (పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి) కూడా అన్నా అడుగు జాడల్లో పార్టీలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తూ ఎన్నో చిత్రాలకు రచయితగా పని చేశారు. ఆయన రాసిన వాటిలో ముప్పాతిక పైగా విజయవిహారం చేసినవి. వారి అల్లుడు శ్రీ మారన్ (మురసొలి) కూడా సంభాషణల రచయితగా వాసికెక్కారు. అతర్వాత మారన్ దర్శకుడు అయ్యారు.

పార్టీలో మరొక ముఖ్యవ్యక్తి శ్రీ ఎం. జి. రామచంద్రన్. రాష్ట్రంలో పార్టీ బాగా బలపడేందుకు ఈయన కృషి ఎంతో వుంది. సినిమాలలో క్షణం విరామం లేని నటుడుగా వుంటూకూడా ప్రజల మధ్య కు వచ్చి వారి మంచిచెడులను తెలుసుకుంటూ ఆదుకునే ఉదార హృదయుడు. పార్టీలోని అనేక



ఎస్. ఎస్. రాజేంద్రన్

మందికి ఈయనా సినిమారంగంలో అవకాశాలు కలుగ చేశారు.

ఇలాగే యీ రంగంలో పేరు ప్రఖ్యాతులను గడించుకున్న యస్. యస్. రాజేంద్రన్, ఆయన భార్య సి. ఆర్. విజయకుమారి ద్రా. ము. క. కిచెందిన వారు. సినిమా సాంకేతిక నిపుణులలోనూ యీ పార్టీకి సంబంధించినవారు చాలామంది వున్నారు.

ద్ర. ము. క. ప్రముఖుల్లో కొందరు సినిమా నిర్మాణ సంస్థలు, పంపిణీ శాఖలూ స్థాపించి చిత్రసీమలో కూడా సముజ్వలమయిన స్థానాన్ని సంపాయించుకోగలిగారు. వీరు ఏం తీసినా, ఆనటులు ఏం చేసినా తెరలమీద చూసి ఆనందించడానికి అలవాటు పడిపోయారు సామాన్య ప్రజలు. ఈ పార్టీకి



కరుణానిధి

చెందిన వారు నిర్మించే చిత్రాల్లోను, నటించే చిత్రాల్లోను పాటల్లో పార్టీ (చిహ్నం దగ్గరనుంచి) ఆశయాలు, ఆదర్శాలు జొప్పించి రాయిస్తారు. సంభాషణల్లో కూడా అధోరణి వుంటుంది.

కేవలం సినిమా తారలుగానే ప్రజలను దర్శించక వారి కష్టసుఖాలు విచారించే రాజకీయ వాదులుగా సంచరిస్తూ తమ సన్నిహితత్వాన్ని అభివృద్ధి పరచుకున్నారు. అందుకే సామాన్య ప్రజానీకంలో ఎంతో పలుకుబడి యీ పార్టీకి అన్వయించిన సినిమా వారికి ఉంది.

దక్షిణాదిన ద్ర. ము. క. యింత గట్టిగా బల పడేందుకు సినిమా ఒక ముఖ్య సాధనం అయింది.

—మోహన్ కుమార్

# సినిమా

### గురుభక్తి

ప్రతిభా ఫిలింస్ విజయ స్టూడియోలో వేసిన మొదటి సెట్టుకు దాదాపు 20వేలరూపాయలు ఖర్చయింది ఈ చిత్రంలో శ్రీ ఎన్ టి రామారావును తెల్లటి ఫుట్‌బాలర్ దుస్తుల్లో చూస్తూంటే ఎంత బాగుందో తెలుసా? మలయాళతార షీలా ముద్దులొలికే చిలక పల్కులతో మనల్ని రంజింప చేస్తుంది ప్రముఖ దర్శకుడు శ్రీ విఠలాచార్య మొదటిషాట్‌ను డైరెక్టు చేశారు ఆషాట్ శ్రీరామారావు ఫుట్‌బాల్ పందెంలో గెలిచి తన తల్లికి సంతోషాన్ని వ్యక్తపర్చడం

శ్రీ ఎన్ టి ఆర్ ఈ సంవత్సరం కూడ పోలీస్ టీంపై నేనే గెలిచానమ్మా

శాంతకుమారి సంతోషం, నాయనా

ఈ చిత్రానికి దర్శకుడు శ్రీ ఎస్ డి లాల్—అయినా మొదటిషాట్‌ను విఠలాచార్యచే షూట్ చేయించి తన గురుభక్తిని ప్రకటించుకున్నాడు లాల్ ఎస్ ఎస్ లాల్ ఛాయాగ్రహణం చమక్ చమక్'గా వుంటుంది సీజర్ అనెడి సీమకుక్కచే అద్భుతమయిన పర్కులను రాబట్టుతున్నారు ధూళిపాళకు వేసిన దుస్తులు పోలీస్ కమీషనర్ పాత్రకు నిండుదనం యిచ్చి అచ్చంగా ఒక పోలీసు అధికారికి వుండవలసిన లక్షణాల్ని ప్రతిబింబింప చేసింది ఈచిత్రంలో అధునాతన సంప్రదాయాల్ని అలవరచుకున్న అందమయిన యువతుల్ని చూచి అబ్బురపడగలరు మొదటి షెడ్యూలు మూడురోజులు సాగింది శ్రీ ఎన్ టి ఆర్ నైట్ కాల్‌షీటు కూడ పనిచేసి సెటు వర్కు పూర్తి చేసారు ఈ షెడ్యూలులో ఎన్ టి ఆర్ షీలా, శాంతకుమారి, ధూళిపాళ నటించారు వర్ధమాన నటుడు జయకృష్ణ సబ్—యిన్‌స్పెక్టరు పాత్రను పోషిస్తున్నాడు ఈచిత్రంయొక్కయూనిట్ (100 మంది) మే నెల 24నుండి 31 వరకు ఏర్‌కాడ్‌లో మకాం వేస్తున్నారు కొన్నిముఖ్యమయిన సన్నివేశాలు చిత్రీకరింపబడ్తాయి ఈ చిత్రానికి ఎస్ డి లాల్, ఎస్ ఎస్ లాల్ నిర్మాతలు, టి వి రాజా సంగీత సారధి

### సంపూర్ణ సహకారం

జనరంజని పిక్చర్స్ "చల్లనినీడ" చిత్రం శ్రీ చలపతిరావు నిర్మాణంలో 13 రీళ్ళు పూర్తయింది చిత్ర ప్రారంభంలో వేసుకున్న షెడ్యూలు ప్రకారం షూటింగు కార్యక్రమం కొనసాగుతూ వుంది శ్రీమతి జమున అంజలీదేవి,గుమ్మడి లాంటి బిజీ ఆర్టిస్టు కూడ యీ చిత్రానికి సంపూర్ణ సహకారాన్ని ఇచ్చి నిర్మాతకు తోడ్పడ్డారు శ్రీమతి జమునా రమణారావు రాత్రివేళల్లోకూడ షూటింగులో పాల్గొంటున్నారు ఈ యూనిట్ జూన్ మొదటి వారంలో

## మీకు తెలుసా?

శ్రీ నాగేశ్వరరావు హిందిలో విశారద పరీక్ష ప్యాసయినారని మీకు తెలుసా

శ్రీ రామారావుగార్ని ప్రతిభా ఫిలింస్ సెట్టులో సీజర్ కుక్క కరచింది

ఎస్ ఎ టి అండ్ రామకృష్ణా నిర్మిస్తున్న "వరకట్నం"లో కాకినాడ భోగం మేళం ప్రత్యేక ఆకర్షణ

రవీంద్రా ఆర్ట్సు "బంగారు గాజులు"లో నాగేశ్వరరావు బర్మా వ్యక్తిగా నటించారని తెలుసా

శ్రీమతి అంజలీదేవి ప్రతిరోజూ ఉదయం లలితాంబ పూజచేస్తారని తెలుసా

నటి వాణిశ్రీకి భరతనాట్యం బాగా తెలుసని మీకు తెలుసా

శోభన్‌బాబుకు సెక్సు విషయాల్ని చర్చించడమంటే చిరాకు

## సినిమా డైరీ

- లక్ష్మీ నారాయణ ఫిలింస్‌ను విఠలాచార్య డైరెక్టు చేస్తారు శ్రీ రామారావు హీరో ఆగస్టు నుండి షూటింగు ప్రారంభం అవుతుంది
- మాధవిలో నాగేశ్వరరావుతో ప్రధాన హాస్య పాత్రధారి రాజబాబు నిర్ణయింపబడ్డారు
- కౌముదీలో వాణిశ్రీకి భర్తగా రాంమోహన్ షీలాకు ప్రియుడిగా శోభన్‌బాబు నటిస్తున్నారు చిత్రం యొక్క రచనను నిర్మాత ఎం ఎస్ రెడ్డి సాగిస్తున్నారు
- 'రంగులరాట్నం" తమిళ చిత్రంలో చంద్రమోహన్ తెలుగులో ధరించిన పాత్రను శివాజీ నటిస్తున్నారు విజయ—సురేష్ కంబైన్స్ నిర్మిస్తున్నారు
- 'పుదియపరవై" కలర్ చిత్రాన్ని నిర్మించిన శివాజీ ఫిలింస్ నిర్మించే రెండవ ఈస్టుమన్ కలర్ చిత్రంలో జయలలిత నాయికగా నటిస్తుంది
- మోడరన్ థియేటర్సు నిర్మిస్తున్న 'ఎదిరిగళ్ జాగ్రత్త" చిత్రానికిగాను పి బి శ్రీనివాస్ సుశీల పాడిన నాల్గు పాటలు సేలంలో రికార్డు చేశారు
- నందనా ఫిలింస్ చిత్రంలో నాగేశ్వరరావుతో నాయికగా నటించడానికి విజయనిర్మల నిర్ణయింప బడింది ఈ చిత్రాన్ని బాపూ డైరెక్టు చేస్తారు
- టి ఎల్ కాంతారావు నిర్మించే "సప్తస్వరాలు చిత్రంలో భారతి, రాజశ్రీలు నాయికలుగా నిర్ణయింపబడ్డారు
- అజంఆర్ట్సు నిర్మించే ద్విభాషా చిత్రాన్ని ఎస్.డి లాల్ డైరెక్టు చేస్తారు శ్రీ రామారావు, శివాజీగణేశ్ నాయకులు సరోజాదేవి నాయిక
- కార్తికేయా ఫిలింస్ 'సోపు—సీపు— కన్నాడీ' తమిళ చిత్రంలో నాగేష్ ప్రక్కన విజయనిర్మల నాయికగా నటిస్తూంది
- శ్రీ బి నాగిరెడ్డి నిర్మించనున్న "గుండమ్మకథ" హిందీ చిత్రంలో రాజేంద్రకుమార్ కథానాయకుడిగ నటిస్తున్నాడు
- రాజకపూర్ నిర్మించిన 'మేరా నామ్ జోకర్" చిత్రం మొదటిభాగం అక్టోబరు 2న విడుదలౌతుంది
- ప్రసాద్ ప్రొడక్షన్స్ "రాజా అవుర్ రంక్" షూటింగు పూర్తయింది మహేష్‌కుమార్ ద్విపాత్రాభినయం చేసిన యీ చిత్రాన్ని కె ఎ ఆత్మా డైరెక్టు చేసారు



'చల్లనినీడ'లో గీతాంజలి



'బాంధవ్యాలు'లో లక్ష్మి

ఉదకమండలానికి పోతున్నారు. విశ్రాంతి కోసమని గాదు, ఎండకు తట్టుకోలేకగాదు. ఒకపాటను చిత్రీకరించడానికే. ఏమిటో ఆపాట? ఎవరు వ్రాసారు? ఎవరు పాడ్తారు? ఎవరు అభినయిస్తారు అనే విషయాల్ని మీకు చెప్పకపోతే ఎలా.

రాసింది: శ్రీ సి. నారాయణరెడ్డి—

'అనగనగా ఒక చిన్నది,
అందాల బంతి లాంటిది'

ఈ పాటను చలపతిరావు ట్యూన్ చేశారు. ఘంటసాల, సుశీల పాడారు. శ్రీమతి జమున, గీతాంజలి, హరనాథ్ పాటకు తగ్గట్లు అభినయిస్తారు. ఈ పాట చిత్రీకరణ అయిందంటే కొంచెం పాచ్ వర్క్ మాత్రం మిగిలి వుంటుంది. "చల్లనినీడ" జూన్ 21కి విడుదలవుతుంది. ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకులు, ఎం. కె. రాజా ఛాయాగ్రాహకులు. శ్రీ సుబ్బయ్య చౌదరి సహ నిర్మాత. రాయల్ ఫిలింస్ ఆంధ్రాలో రిలీజు చేస్తారు. "చల్లని నీడ" విడుదల కాగానే అక్కినేని నాగేశ్వరరావుతో ఒక చక్కటి సాంఘిక చిత్రాన్ని నిర్మించాలనుకుంటున్నారు నిర్మాతలు.

## కొత్త తరహా పాత్రలు

జయశ్రీ లక్ష్మీపిక్చర్స్ "తంగై" తెలుగుచిత్రం షూటింగు వాహినీలో చకచక సాగిపోతుంది. ఏప్రిల్ 12న జరిగిన ఒక హాస్య సన్నివేశాన్ని మీ ఎదుట పెడుతున్నా.

అది చంద్రకళ డిస్పెన్సరీ. పేషంట్సు గుంపులు గుంపులుగా గుమికూడి వుంటారు. అక్కడికి రాజబాబు వస్తాడు. అతడ్ని ఆడపిల్లలు చుట్టుముట్టేసి తన్నడానికి పూనుకుంటారు. ఆ సమయానికి కృష్ణ వస్తాడు. రాజబాబును డేంజర్‌నుండితప్పిస్తాడు. పేషంట్లును క్యూలో నిలబెడ్తాడు. చంద్రకళను చూస్తాడు. ఆమె అందాన్ని, సహనాన్ని చూచి ఆశ్చర్యపోతాడు. ఈ ఘటానికి అప్పలాచార్య వ్రాసిన సంభాషణలు చమత్కారంగానూ వున్నాయి, హాస్య రసభరితంగానూ వున్నాయి. హాస్యమేగాక, శోక రసాన్ని చిందించే డైలాగులను యీ యువరచయిత మన గుండెల్లో నిలిచిపోయే విధంగా వ్రాసారు. శ్రీ డూండేశ్వరరావు దగ్గరేవుండి ప్రతిషాటును నీట్‌గా దర్శకుడు మల్లికార్జునరావుచే తీయిస్తుంటే వి. ఎస్. ఆర్. స్వామి తన కెమెరాను వివిధకోణాల్లో త్రిప్పుతూ అద్భుతంగా వుండే ఎఫెక్ట్సును తీసుకొస్తున్నారు. సన్నివేశానికి తగ్గట్టు చలపతిరావు సంగీతాన్ని విన్పిస్తున్నారు. ఈ చిత్రంలో కృష్ణ, రాజబాబులను కొత్తతరహా పాత్రల్లో చూడగలరు. చూడడమేకాదు— వారి నటనచూచి విస్తుపోతారు. ఇంతవరకు కృష్ణ వేసిన పాత్రలన్నీ ఒక ఎత్తు, 'తంగై' పాత్ర ఒక ఎత్తు. ఏదిఏమయినా, నిర్ణయించాల్సింది ప్రేక్షకులైన మీరే.

* * *

సునందినీ పిక్చర్స్ నిర్మించే జానపద చిత్రంలో మీరు విచిత్రమయిన విశేషాలను చూడగలరు. ఆ సన్నివేశాలను శ్రీ విఠలాచార్య ఎలా చిత్రీకరించారా అని ముక్కుమీద వేలు వేసుకోవాలి. మాయలు,



వాహినీవారి 'బంగారుపంజరం' చిత్రీకరణసందర్భంలో కథానాయిక వాణిశ్రీ, దర్శక నిర్మాత బి. ఎన్. రెడ్డి.



'కలసివచ్చిన అదృష్టం'లో కాంచన, రామారావు.

మంత్రాలు, తంత్రాలు, ట్రిక్కులు, గజకర్ణ, గోకర్ణ విద్యలు అన్నీ వుంటాయి. ఈ విద్యలకు కాంతారావు, చలం పోటీ పడ్తారు. ఆశక్తులను తను వశం చేసుకుంటారు. విఠలాచార్య యిలాంటి వాటిలో అందెవేసిన చేయి. ప్రజల మనస్తత్వానికి ఎలాంటి చిత్రాలు కావాలి అని తెలుసుకుని తాను తీసే చిత్రాలల్లో యేదేని వింత దృశ్యాలను జూపిస్తారు. ఇప్పుడు మునందిసీ మల్లికార్జునరావుకు విఠలాచార్య డైరెక్టు చేసే జానపద చిత్రంలో కృష్ణకుమారి, కాంతారావు, త్యాగరాజు, విజయలలిత, రామదాసు, చలం ముఖ్య పాత్రల్ని ధరిస్తున్నారు. కోదండపాణి సంగీతాన్ని, వేణు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు.

## తమిళంలో పాపకోసం

డి. రామానాయుడు "కుళంద్తైకాగ" చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఇది తమిళ "పాపకోసం". ఇందులో

## సినీ:హా

సుందరరాజన్, రామదాస్, మనోహర్ దొంగలుగా నటిస్తున్నారు. టైటిల్‌సాంగ్‌ను సౌందరరరాజన్, పి.బి. శ్రీనివాస్, గోవిందరాజన్ పాడారు. పాపగా బేబిరాణి నటిస్తుంది. తెలుగు చిత్రంలో కృష్ణ, ప్రభాకరరెడ్డి వేసిన వేషాల్ని తమిళంలో కూడ వారే ధరిస్తున్నారు, అన్నారు నిర్మాత. మరి తెలుగుమాటేమిటి అని అడిగాను. జూలై 5న ఒక క్రయిం చిత్రాన్ని, ఆగష్టులో ఒకజానపదాన్ని ప్రారంభిస్తాను. క్రయింలో కృష్ణ నాయకుడు. జానపదం యింకా తేలలేదు. తెలుగు ఫస్ట్సెస్పు త్రిల్లర్‌కు ఎం. ఎస్. విశ్వనాథం మ్యూజిక్‌ను అందచేస్తారని, జి. వి. ఆర్. శేషగిరిరావు డైరక్షన్ నిర్వహిస్తారని తెలియచేశారు.

* * *

రామానాయుడు మంచి టేస్టు గలవ్యక్తి. వ్యాపార దక్షత గలవాడు. అంతేకాదు చలనచిత్ర పరిశ్రమలో ఏమేమికావాలో గ్రహించినవాడు. అందుకే మంచి వ్యాపార దక్షతగల శ్రీ నాగిరెడ్డిగారితో కలిసాడు. చిత్రకథలను ఎన్నుకోవడంలో కూడ ప్రజ్ఞను ప్రదర్శిస్తాడు. సెటులో అన్ని విషయాల్ని స్వయముగా గమనించి నిర్వహిస్తాడు. మున్ముందు చక్కటి నీతి ప్రదాయకమయిన సాంఘిక చిత్రాల్ని, మన జాతీయతను, సాంస్కృతిని ప్రతిఫలింపచేసే వుదాత్తమైన చిత్రాల్ని నిర్మించ నిశ్చయించాడు. పటిష్టమయిన సాంకేతిక వర్గం గల్గివున్న విజయ—సురేష్ కంబైన్స్‌నుండి గొప్పచిత్రాలను యెదురుచూడవచ్చు.

## మీరాబాయి వేషంలో విజయనిర్మల

అది గోకులాష్టమి. సూర్యకాంతం యిల్లంతా వేడుకలతో అలరారుతుంది. మేడపైన మీరా



'చిన్నారిపాపలులో' జమున

బాయి వేషంలో విజయనిర్మల రుద్రాక్షమాల చేతిలో పెటుకుని కృష్ణ కృష్ణ అంటూ వుంటుంది ప్రక్కనే కృష్ణ సూర్యకాంతం, అల్లురామలింగయ్య రమాప్రభ మీరాబాయిని కొలుస్తుంటారు అప్పుడు వూడిపడ్తాడు పాక్షి రంగారావు కోపంతో రాగానే తన అక్కయ్య సూర్యకాంతంతో యిలా అంటాడు (విజయనిర్మల నుద్దేశించి)

రంగారావు ఎవర్ని మోసం చేద్దామనుకున్నావ్, నేనేం మీ అమ్మనిగాను

సూర్యకాంతం ఒరేయ్ వూరుకోరా నీకు నమ్మకం లేకపోతే వూరుకో

విజయనిర్మల యశోదత్తాదేవిగారు మీరు ఆ కాళీయుడి కోరల్లో చిక్కుకొన్నారు

కృష్ణ నేనుంటినిగా వాడిపీచమణచుటకు.

ఈ సన్నివేశం 'అత్తగారు—కొత్తకోడలు'



'లక్ష్మీనివాసం'లో శోభన్‌బాబు, వాణిశ్రీ, భారతి.

చిత్రంలోనిది. శ్రీ సంజీవి దర్శకత్వంలో రాత్రింబవళ్ళు వాహిని, గోల్డెన్ స్టుడియోల్లో షూటింగు జరుగుతూవుంది. జి. కె. వెంకటేష్ పసందయిన బాణీలను విన్పించారు. శ్రీ బాబూరావు నిర్మించే యీ చిత్రం పూర్ణా పిక్చర్స్ ద్వారా జూన్‌లో విడుదల అవుతుంది.

## ఫామిలీ సెంటిమెంట్‌కి ప్రాధాన్యత

"బంగారుగాజులు" రషన్ వాహిని 'బి' థియేటర్లో వేసారు. 13 రీళ్ళు తయారయిన యీ చిత్రం పండిత, పామరులకు రుచించే రీతిగా దర్శకుడు శ్రీ సి.ఎస్.రావు కథను నడిపించారు. రాజశ్రీ చిక్కటి కథను వ్రాస్తే, వీనిసెటి చక్కటి సంభాషణలను రచించారు. చలపతిరావు మెల్లని, తియ్యని సంగీతాన్ని విన్పించారు. అన్నగా నాగేశ్వరరావు, చెల్లెలిగా విజయ



'అత్తగారు కోడలు'లో జయంతి

నిర్మల నటించిన విధం చూస్తే వాళ్ళ పుటుకతో తోబుటువులా అనిపిస్తుంది. ఫ్యామిలీ సెంటిమెంటుకు ప్రాధాన్యత యివ్వబడిన యీ చిత్రంలో భారతి చిలక పల్కులు వినడానికి తియ్యగా వున్నాయి. డైలాగులను ప్రేక్షకులు మరిమరి వినాలనిపించే విధంగా దర్శకులు ఆమెచేత ముద్దుగా చెప్పించారు. జూలాజికల్ గార్డెన్స్‌లో భారతి నాగేశ్వరరావులు పాడిన పాటను సి ఎస్ రావు చిత్రించిన విధం అనితరసాధ్యం నిర్మాత తమ్మారెడ్డి కృష్ణమూర్తి

## దర్శకుడు ఆశించిన ఫలితం

వేకేటి శివరాం "చుట్టరికాలు" విడుదలతో ఏస్ డైరెక్టరు కాగలడని ఘంటాపథంగా చెప్పొచ్చు "చుటరికాలు" ప్రత్యేకం చాలా నీట్‌గా కరెక్టుగా వచ్చింది. ఆయనకు తోడుగా విటిబాబు కెమెరా వర్కుచేసింది దర్శకుడి మాటకు కట్టుబడియూనిట్

అంతా వక్రమంగా పనిచేసింది. అందుకే రెండు మాసాల్లో షూటింగు పూర్తయింది. నటీనటులు అందరూ దర్శకుడు ఆశించిన ఫలితాన్ని యిచ్చారు. నిర్మాత తోటసుబ్బారావు బ్యానర్ వేల్యూ "చుటరికాలు" చిత్రంలో రెటింపు పెరుగుతుంది. జగ్గయ్య, గుమ్మడి, శోభన్, జయంతి, లక్ష్మి, అల్లు రామలింగయ్య, బాలకృష్ణ, రమాప్రభ, కృష్ణకుమారి, కాంతారావు, సత్యనారాయణ, ఛాయాదేవి ముఖ్య పాత్రలను పోషించారనడం కన్నా జీవించారనే చెప్పాలి. జూన్ 2వ తేది సెన్సారు చెయ్యబడి, 15కు జ్యోతి ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

*　　*　　*

"మంగమ్మశపథం", "పిడుగురాముడు", "తిక్కశంకరయ్య" చిత్రాలను డి. వి. ఎస్. బ్యానర్ లో నిర్మించిన శ్రీ డి. వి. ఎస్. రాజు యీసారి మమతాపిక్చర్స్ అనెడి చిత్రనిర్మాణసంస్థను స్థాపించి, ఒక సాహసోపేతమయిన జానపద చిత్రాన్ని నిర్మించడానికి నిర్ణయించి, విఠలాచార్యను దర్శకునిగా అంగీకరింపచేస్తారు. కథానాయకుడిగా శ్రీ ఎన్. టి. రామారావు నటిస్తారు. ఆగసు నుండి సెట్సుకు వెళ్తారు.

## సినిషా

ప్రస్తుతం పేపరువర్క్ వారి కార్యాలయంలోజరుగుతూ వుంది. టి. వి. రాజు మ్యూజిక్ కంపోసిషన్ ప్రారంభమయింది.

ఉన్నతభావాలు, ఆదర్శ సంప్రదాయాలు, సౌమ్యత, వుదారత, నిండిన శ్రీ రాజు ప్రయత్నం తప్పక విజయాన్ని చేకూరుస్తుంది. చిత్రంయొక్క జయాపజయాలు దైవాధీనాలు అని నమ్మే నిర్మాతల్లో వీరు ఒకరు.

—శ్రీనివాస్ ●

### అవీ-ఇవీ...

### వివాహం

చిత్రకారుడు చి. కె. శేషగిరి రావుకి మాజీ జిల్లా న్యాయాధికారి కీ. శే. ఆర్. వి. సీతారామారావు గారి కుమార్తె చి. సౌ. శాయికుమారికి మే 9వ తేదీ రాత్రి గం 10—21 ని.లకు విజయవాడలోని శ్రీ కన్యకా పరమేశ్వరి సత్రంలో వైభవంగా వివాహం జరిగింది.

## హరనాధ్ కి జరిమానా

సినీ నటుడు హరనాథ్ తప్పత్రాగి, మద్రాసుకు వచ్చే సర్కార్ ఎక్స్ప్రెస్ గొలుసును లాగి, తోటి ప్రయాణికులకు యిబ్బంది కల్గించాడనే నేరాలకు గాను పొన్నూరు జూడిషి



యల్ మేజస్ట్రేటు కేసును విచారించి ముద్దాయికి రు 800 లు జరిమానా అది కట్టని పక్షంలో 3 మాసాల సాధారణ జైలు శిక్ష విధిస్తూ తీర్పు చెప్పారు. ఈవార్త విజయవాడ "ఇండియన్ ఎక్స్ప్రెస్" లో మే 8వ ప్రచురితమైంది. ●

# పుస్తకాలు

## గృహనిర్వహణ శాస్త్రము :

రచన: శ్రీ శిరం ఉదయలింగరావు, ఎం.ఏ.,ఎల్.టి. క్రౌన్ ఆక్టేవో 532 పేజీలు, వెల:రు 6 లు. ప్రచురణ: దాచేపల్లి క్రిష్ణయ్య అండ్ సన్స్, వేంకటేశ్వర బుక్‌డిపో, జనరల్ బజారు, సికింద్రాబాదు—(ఆం. వ.)

'ఇంటికి దీపం ఇల్లాలు' అనటంలోనే మన హిందూ గృహిణి ప్రాముఖ్యత వెల్లడి అవుతూంది. తెచ్చిపడేసేవరకే యజమాని. ఆతరవాత గృహనిర్వహణ భారమంతా ఇల్లాలిదే. ఇంటిని తీర్చిదిద్దే బాధ్యత ఆమె భుజస్కంధాలపైనే వుంది.

ఇంతటి బాధ్యత వహించాల్సిన వ్యక్తికి ఎంత విజ్ఞానం లోకజ్ఞానం ఉండాలి? నలుగురిలోతలలో నాలుకగా మెలగడం, పదిమంది వచ్చిపోయే తనఇంటిని పవిత్రంగా పరిశుభ్రంగా ఉంచటం, అతిథి అభ్యాగతులను —చుట పక్కాలనూ ఆదరించి సముదాయించుకు రావటం, శాకపాకాలను అమర్చటంలో నేర్పు చూపటం— ఇవన్నీ మహిళలకు చెందిన విద్యలు.

ఇంటో మసిలేటప్పుడూ, పారీలకు వెళ్లేటప్పుడూ ఎలాంటి దుస్తులు ధరించాలి? ఎవరికైనా కాస్తంత నలతగా వున్నా, అనుకోని చిన్న ప్రమాదం వచ్చినా ఏవిధమైన పరిచర్యలు చెయ్యాలి? - ఇవీ ఈనాడు తెలియడం తప్పనిసరి.

ఉత్తరోత్తర రేపు ఇల్లాలు మాతృమూర్తి అయ్యాక—ప్రసూతి విషయం పిల్లల పెంపకం, వాళ్ల చదువు సంధ్యలూ, భావిజీవితాలకు దోవచూపటం— వీటిలో తగినంత పరిజ్ఞానం సంపాదించి ఉండాలికద?

మహత్తరమయిన ఈ అంశాలను తెలియ చెప్పేదే గృహ నిర్వహణశాస్త్రం. ఇందులో ఏ ఒక్క అంశాన్ని తీసుకున్నా అదే ఒక బృహద్గ్రంథమవుతుంది. కనుక, సూచీ మాత్రంగా అగత్యమైన అన్ని విషయాలనూ క్రోడీకరించి రచయిత ఈ గ్రంథంలో కాబోయే ఇల్లాళ్లకు ఒకకొత్తబాటను చూపారు. పాత పద్ధతులకు ఈనాటి విజ్ఞానాన్ని జతపరచడంతో గ్రంథానికి ఒక విధమైన నిండుదనం వచ్చింది.

హిందూ గృహిణికి తెలియ వలసిన ముఖ్య విషయాలలో ఇల్లు, ఒళ్లు, నిర్మాణం, శుభ్రత, జాగ్రత— ఆహార పదార్థాల గుణాలు, విలువలు,వంట వార్పు, వడ్డన, చక్కబెట్టు —కట్టు , బొట్టు —రోగ నిదానం, నివారణ— తీరిక సమయం సద్వినియోగం కాలం, ధనం: వీటి పొదుపు—చిన్నారి పాపలనుపెంచి ప్రయోజకులుగా చెయ్యడం— ఇవన్నీ ఆధునిక శాస్త్ర దృష్ట్యా చర్చించ బడ్డాయి.

ఇల్లాలికి ఇవన్నీ తెలిసి ఆచరించ గలిగినప్పుడే భర్తనూ పిల్లల్నీ సుఖపెట్టి, తనూ సుఖపడగలదు. అటువంటి గృహానికే స్వర్గసీమ అనే మాటసార్థకమవుతుంది.

ఇందులో విషయ పరిజ్ఞానానికిచ్చినంత ప్రాముఖ్యత శైలిలో కనబడదు. మాటిమాటికీ ఇంగ్లీషు లిపిలో ఉపయోగించిన పదాలు ఇంగ్లీషురాని సామాన్య గృహిణికి అడ్డంకులే అవుతాయి. అక్కడక్కడ సామెత లను గుదిగుచ్చినప్పటికీ, మొత్తం మీద రచన ఇంకా సాఫీగా జాతీయంగా సాగవలసిన అవసరం ఎంతైనా కనిపిస్తుంది.

అందరికీ తెలిసిన "బ్యాంకు" వంటి చిన్న మాటను ఇంగ్లీషులిపిలో రాయడం ఏమీబాగాలేదు. అవసరమున్నా లేకున్నా, మనిఆర్డరు ఫారాల్లోలాగ' పుస్తకమంతటా పేజిపేజికి రెండు భాషలుపయోగించటం చాదస్తమే.

చికిత్సలను గురించి వివరిస్తూ, 'ప్రస్తుతకాలమున జిగట విరేచనములకు 'నియో యూసెజ్' మాత్రలు చాల చక్కగ పని చేయుచున్నవి,(పేజి 106.) అన్నారు. డాకరు వహించవలసిన బాధ్యత తను గ్రంథకర్త తనపైన పెట్టుకుని సలహా

ఆటలు

## ఆటగాళ్లకి సంస్థల ప్రోత్సాహం



స్పోర్ట్స్ అండ్ పాస్టయిమ్స్ క్రికెట్ టోర్నమెంటులో విజేతలకి ట్రాఫీలని బహూకరించడానికి మద్రాసు క్రికెట్ అసోసియేషన్ ఆవరణలో ఏర్పాటు చేసిన సమావేశంలో మాట్లాడిన ఉపన్యాసకు లందరూ వ్యాపార సంస్థలు ఆటగాళ్లకి మంచి జీవితావకాశాలని కల్పించి ఉత్సాహాన్ని యివ్వాలని అన్నారు. ఘన విజయాన్ని సాధించిన ఇండియాసిమెంట్ స్పోర్ట్స్ అండ్ పాస్టయిమ్స్ ట్రాఫీని అందుకుంది. రన్నర్స్ అప్‌గా వచ్చిన పారిస్ స్పోర్ట్స్ క్లబ్ ఎస్. పార్థసారథి ట్రాఫీని అందుకున్నది.

15 ఏళ్లకి ముందు ఈటోర్నమెంట్‌ని రెండు ఉద్దేశాలతో ఏర్పాటు చేశారు. మొదటిది క్రికెట్‌ని మెరుగుపరచడానికి, రెండవది మంచి ఆటగాళ్లకి ఉద్యోగావకాశాలు కల్పించడానికి. ఇతర ఆటలలో కూడా బొంబాయిలో ట్రోఫీలను ఏర్పాటు చేశారు. ఆటని మెరుగు పరచాలన్న స్పోర్ట్స్ అండ్ పాస్టయిమ్స్ ఆశయం ఫలించింది. దానికి పోటీలనివీక్షించడానికి వచ్చే అసంఖ్యాక ప్రేక్షకులే సాక్ష్యం. ఇది నిజంగా సంతోషించ దగిన విషయం.

అతిముఖ్యమైన మరో ఆశయంకూడా సంతృప్తికరంగా నెరవేరిందనవచ్చు. ఎందువల్లనంటే ఎన్నో వ్యాపార సంస్థల బృందాలు ప్రతి యేడాది పాల్గొనటమే కాకుండా బలపడుతున్నయికూడా. ఇండియా సిమెంట్స్, పారిస్, సేట్‌బాంక్, ఇండియన్ ఓవర్సీస్‌బాంక్ లాంటి సంస్థలలో కొన్ని మాత్రమే పెద్ద ఆటగాళ్లని (రాష్ట్ర స్థాయి, టెస్ట్ స్థాయి లోని) ఆకర్షించ గలిగాయి. అందుకనే బృందాలలో పోటీ ఎక్కువై ఆసక్తి అధికం అయింది. అది మంచిదికూడా. సర్వీసెస్, ప్రభుత్వ సంస్థలు అయిన రైల్వేస్, పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్స్, ఏ. జి. ఆఫీసులజట్ల టోర్నమెంట్‌లు కూడా ఆటగాళ్లకి మంచి ఉత్సాహాన్ని అందించాయి. ప్రభుత్వం మాత్రమే అన్ని ఆటలలోని ప్రముఖక్రీడాకారుల్ని తనలోకి తీసుకోలేదు. ప్రయివేటు రంగంలోని సంస్థలు కూడా ఆటగాళ్లకి ఉద్యోగ అవకాశాలు కల్పించడంప్రముఖ పాత్ర వహించాలి. ఆటగాళ్ల విషయంలో ప్రభుత్వం లీవ్ రూల్స్‌ని సడలించి మరింతదోహదం చేసింది. ప్రయివేటు సంస్థలు కూడా ఈవిషయంలో చాలా సహకరిస్తున్నాయి కూడా.

కానీ ఒక ముఖ్యమైన విషయం ఉంది. తమతోపాటు పని చేసే మిగతా ఉద్యోగుల కన్నా ఎక్కువ అవకాశాలు తమకి ఉన్నప్పుడు ఆటగాళ్లు తమ విధి నిర్వహణలో బాధ్యత వహించాలి. ఈవిషయం ఎందుకు చెప్తున్నానంటే నాకు తెలిసినంతవరకు పరిస్థితులు కొన్ని సమయాలలో, విధి నిర్వహణని విస్మరించినందున, ఆటగాళ్ళకి చికాకుని కలిగిస్తాయి. వారు తమ శక్తి వంచన లేకుండా ఆడి పోటీలలో విజయాన్ని సాధించి సంస్థకి పేరు తీసుకు రావడానికి ప్రయత్నిస్తారు కాబట్టి వారికి ఉండాల్సిన అవకాశాలు వారికి ఉండాల్సిందే. అదేసమయంలో రోజంతాఆఫీసులో పని చేసే తమ సహ ఉద్యోగులతో ఎలాంటి పరిస్థితులలోనూ మనస్తాపాలు రాకుండా చూసుకోవాలి. ఆటగాళ్లు తమ సహాధ్యాయులలో మంచి ప్రావకాన్ని పెంపొందించుకోడానికి అవకాశాలు ఉన్నాయి. వారితో సత్సంబంధాలు కలిగి ఉండటం తేలికకూడా.

క్రీడారంగం అభివృద్ధికి ప్రభుత్వం,ప్రయివేటు సంస్థలు చేస్తున్న కృషి,ఆటగాళ్లకివారు యిస్తున్న ప్రోత్సాహం ఎంతైనా మెచ్చుకోదగిన విషయం.

—కె. ఎస్. నరసింహన్

ఇవ్వడం ఉచితంగా లేదు.

'వేసవియందు ఒళ్లు పేలకుండుటకై శరీర మంతట ప్రిక్లీ హీట్ పౌడరును విరివిగా వాడవలెయును' అనడం వరకు బాగానే వుంది అపైన జాన్సన్—జాన్సన్ అని నిర్మాతల పేరు సూచించటం ఆకంపెనీని సిఫారసు చేసినట వుతుందికదా? (పేజి—449) అలానే లక్సు, సర్ఫ్, డిష్, డెట్ (పేజి—333) అని పేర్లు చెప్పటానికిబదులు 'సోప్ పౌడర్లు' అని చెబితే సరిపోతుందిగా?—

శిశు ప్రకరణం వచ్చినప్పుడు—ఈ నాడు తీవ్ర సంఘర్షణలో ఉన్న 'జనాభా, మిత సంతతి' గురించి కూడా సూచించ వచ్చు ఏటా పోటీలు పెటి, అందమయిన ఆరోగ్య వంతమైన శిశువులకు బహుమతు లివ్వటమూ ఉదహరించవచ్చు

చూడగా ఈ పుస్తకం పాశ్చ్యప్రపంచాళికను అనుసరించి, కొన్ని పారిభాషిక పదాలను నిర్ణీతంగా వాడి, కేవలం విద్యార్థినుల కోసమె తయారు చేసినటు కనిపిస్తోంది గ్రంథకర్త అనుకున్నటు 'గృహిణులందరికీ ఉపయుక్తం కాగల'దనే ఆశయం నెరవేరాలంటే ఆ తీరేవేరు, ఆ ఫక్కియే వేరు

—శివకుమారి

## నాగస్వరం

ఖండకావ్యం రచయిత శ్రీ బండి నాగరాజు క్రౌను 6 + 62 పుటలు వెల రు 1—00 ప్రాప్తిస్థానం—మిత్రమండలి, 7 334 తూర్పువీధి, గూడూరు, నెల్లూరుజిల్లా

అభ్యుదయ రచయితల కోవకు చెందిన బండి—నాగరాజుగారు యిదివరలో భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్ర పత్రి మొదలైన పత్రికల్లో ప్రకటించిన శుద్ధవచనాలతోనూ, గేయాలతోనూ పాటు మరి కొన్నిఖండికలను చేసి పుస్తక రూపంగా దీన్ని కూర్చారు

ఇందులో శుద్ధవచనాలన్నీ ఒక పద్ధతిలోనూ, గేయాలు ఒక పద్ధతిలోనూ నడిచాయి గేయాలను గురించి చెబుతూ రచయిత ఇందులో 'స్మరహరుడు' మంజరీద్విపద రచన 'ఖలేశ్వరుడు, నయధేధ'అనేవి హయ పచారచ్ఛాయగల (త్రిశ్రగతి) గేయాలు ఇవినా అభ్యాస కమతకు గుర్తు'' అన్నారు ఇవి శుద్ధవచనాల రచనకు ముందువన్నమాట అందువల్లనే సరళమైన భావాలతో సుబోధంగా ఉంటున్నవి శుద్ధవచనాలు, రచయితకు రచనా సౌష్ఠవం కుదిరిన తర్వాత రచించబడినవన్నట్లు ఈ పయిమాటలవల్లనే తెలుస్తున్నది

ఈ పుస్తకంలలో శుద్ధవచనాలు చాలావరకూ అధిక్షేపరూపంగా ఉండి, లోకంలోని వివిధప్రకృతుల ప్రవత్తులను చకరాగా చిత్రిస్తూ ఉన్నవి అయినా ప్రతి ఖండికా పూర్తిగా అర్థం చేసుకోవడం సామాన్యపాఠకునికి చాలా కష్టం అర్థంకాదని చెప్పవచ్చును కూడా అభ్యుదయ కవిత్వం పైనిమోజు ఉన్నవారు మాత్రమే అటి రచనలను మెచ్చుకోగలరు శార్దూలాది వృత్తాలు శీర్షాల ప్రవృత్తులనీ, చిత్రకవిత్వాలు గంగిరెద్దులవంటివనీ, అర్థంకాని ప్రాచీన కవిత్వాన్ని జనంనెమ్మానిస్తున్నారని రచయిత అభిప్రాయం అని వూహించడానికి అవకాశం కలిగిస్తున్నాయి కొన్ని ఖండికలు అధిక్షేపణగానే వ్రాసినా "అంకితం" లో తన కవితాకన్యను తగిన కృతిపతికి యివ్వకుండా—ఏవో బుద్ధులు చెప్పి, దేశం మీద వదిలివేసినట్లు చెప్పడం సరి అయిన పద్ధతిగా తోచదు

రచయిత దృష్టిలో ప్రాచీన కవిత్వం ఆధునిక కవిత్వంతో—శుద్ధవచన కవిత్వంతో తులతూగలేకపోయి ఎన్నో శతాబ్దాలుగా—అవిచ్ఛిన్నంగా ఆదరాన్నిపొందుతూనే ఉన్నది నవ్యకవిత్వంలో అడుగడుగుకూ పరిణామం కానవస్తున్నందున, ఆదరం కూడా అస్థిరంగానే ఉంటుంది అందలాలెక్కి వూరేగిన భావకవిత్వం ఇప్పుడు వెనుకపడింది చక్కని కథలు ప్రధానంగా వెలిగిన నవ్యకవిత్వం గౌరవం క్షీణించింది వచన పద్యాలు వ్రాసేవారిలో కూడా ఏకొద్దిమందికోతప్ప సముచితస్థానం లభించలేదు దీని స్థానాన్ని పాఠకులే నిర్ణయించాలి కవిత్వం కొరకరాని కొయ్యకాకుండా— సాహిత్య ప్రీతికలిగించే రచనలు ప్రచురించాలని గూడూరులోని 'మిత్రమండలి' వారు తమ మండలి సభ్యులైన నాగరాజుగారి కావ్య ఖండికలను కొన్నింటిని యీ పుస్తకంగా ప్రకటించారు ఉపజ్ఞ, లోకానుభవం, చక్కని కవితాశక్తి ఉన్న యీ రచయిత 'నాగస్వరం' కతిపయాభ్యుదయ రసిక నాగులకయినా ఆనందాన్ని కూర్చి, పడగలను విప్పించి ఆడించగలదని చెప్పవచ్చు

—ఆంగీరస ●

## రంజని

ఏ జి ఆఫీసు తెలుగు సాహితీ సమితి హైద్రాబాదువారి ఏడవ సంపుటి సాహిత్యాన్ని వెదజల్లే పలువురి సాహితీప్రియుల రచనలున్నాయి సంస్థ కార్యకలాపాలు ఇవ్వబడ్డాయి

## కవిరాజనీరాజనం

పద్యాలు రచయిత కవి సుధాకర, గాయకరత్న శ్రీరాజన్న కవి వెల రు 1—50 పైసలు యువ కవితా సమితి ప్రచురణలు త్యాగరాజవీధి, ప్రొద్దుటూరు

## చైర్మన్ మావో సే-టుంగ్

వీరి నాయకత్వ మనుసరించే పద్ధతులకు సంబంధించిన కొన్ని సమస్యలు ఈ పుస్తకంలో ఉన్నాయి 38 పేజీలు పుస్తకం ఖరీదు 35 పైసలు శాంతి సాహితి ప్రచురణలు, బాపట్ల.

## లెనిన్ లేఖ

యూరప్, అమెరికా కార్మికులకు లెనిన్ రాసిన లేఖ 75 పేజీల పుస్తకం వెల పది పైసల్లు మాత్రం శాంతిసాహితి ప్రచురణలు, బాపట్ల.


Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras 1. Chief Editor, S. Sambhu Prasad.

# దొంగభయము లేకుండా చేసుకోండి



మీ యింట్లో దొంగపడి మీ విలువైన వస్తువులను దొంగిలించే భయము ఉంది. దొంగకు మీరు ఆ అవకాశమును యివ్వకండి.

మీ నగానట్రా, సెక్యూరిటీలు, సర్టిఫికేట్లను దొంగల భయము మరియు అగ్ని ప్రమాదములనుండి సురక్షితముగా పెట్టుకొనుటకు నేడే బ్యాంక్ ఆఫ్ బరోడాలో ఒక సేఫ్ డిపాజిట్ లాకర్‌ను అద్దెకు తీసుకోండి. దానికి మీకు నెలకు రు. 1 కంటె కొంచెము ఎక్కువ అవుతుంది. వివిధ సైజులలో లభిస్తున్న లాకర్లలో మీ అవసరములకు సరిపోయే దానిని తీసుకోండి.




సిరి సంపదలకు అక్షయపాత్ర

**ది బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్**

(స్థాపితం 1908) రిజిస్టర్డ్ ఆఫీస్ : మాండ్వి, బరోడా. భారతదేశములో, విదేశాలలో 300 పైగా బ్రాంచీలు కలవు. 'దయచేయండి మీకు సాయపడతాం' అనే కరపత్రం ఉచిత కాపీని అడగండి లేక మాకు వ్రాయండి.

Shilpi BOB 22A/68-Tel.



సారిడన్ యొక్క సహాయము మీకు అవసరమయ్యే దినాలు

# అందరు స్త్రీలకి తెలుసు... కొన్ని సమయాల్లో కేవలం నివారణ మాత్రమే సరిపోదు

ఒక్కొక్కప్పుడు సారిడన్‌తో సేదదేర్చుకొనే ఆవశ్యకత స్త్రీలకు వుంటుంది మీకు ఎక్కువ మాంద్యము, నిరుత్సాహము లేక బాధ వున్న యెడల ఒకే ఒక సారిడన్ భారాన్ని తగ్గించి, ఉత్సాహాన్నిస్తుంది సారిడన్ నొప్పిని, దానివలన కలిగే శ్రమను పోగొట్టును దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! మీరు శక్తితో ఉత్సాహపూరితులై వుంటారు, సరిగ్గా ఆలోచించగలుగుతారు, స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు! సారిడన్ యిచ్చే నివారణ సత్వరమైనది, స్థిరమైనది తలనొప్పి, పంటి నొప్పి మరియు ఒంటినొప్పికి కూడ ఎల్లప్పుడు సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును

'రోష్' తయారు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు వాల్టాస్ లిమిటెడ్